# జ్యోతిర్మాల



జాతీయజ్ఞాన  మందిరము

# జాతీయ జ్ఞాన మందిరమువారి

## సుప్రసిద్ధ బాలసాహిత్య గ్రంథములు

1. ''పిల్లల బొమ్మల భారతం''

మాగంటి బాపినీడు.

తెలుగు బాల సాహిత్యంలో ఉత్తమ గ్రంథంగా నిర్ణయించబడి లోగడ చెన్నరాష్ట్ర ప్రభుత్వ బహుమానం, ఇటీవల భారత ప్రభుత్వ బహుమానం పొందిన సుప్రసిద్ధ గ్రంథం. తృతీయ ముద్రణ.

వెల రు. 1-8-0

2. ''తెలుగుతల్లి''

మాగంటి బాపినీడు

''బాల విజ్ఞాన సర్వస్వం'' అని పలువురు ప్రముఖులచే ప్రశంసింపబడి అఖండ ప్రజాదరణము పొందినది. అనేక నూతన విషయములతో సంస్కరింపబడినది. చతుర్థ ముద్రణ. వెల రు. 1-0-0

3. ''బొమ్మల రామాయణం''

బొమ్మకంటి శ్రీనివాసాచార్యులు

బొమ్మల భారతమువలెనే విశేషప్రజాదరణము పొందు చున్న మా నూతన ప్రచురణ, వెల రు. 1-8-0

4. ''ప్రపంచ మతములు''

నిర్వికల్పానందస్వామి

సులభశైలిలో ప్రపంచంలో అన్ని మతములను గురించి వివరించును. వెల రు. 1-8-0

# జ్యోతిర్మాల

## అమెరికా మహాపురుషుల పదచిత్రాలు

సంకలన కర్త

ఫ్రాంక్ లూథర్ మాట్

అనువాదం

బొమ్మకంటి శ్రీనివాసాచార్యులు

వెల : రు 1-8-0

జాతీయ జ్ఞాన మందిరము
64, ఫోర్త్ మెయిన్‌రోడ్
గాంధీనగర్, మద్రాసు-20

First Edition
1000 copies.

# JYOTIRMALA

Telugu version of
'A Gallery of Americans'

*Edited by*
**Frank Luther Mott**

*Translated by*
**Bommakanti Srinivasacharyulu**

Price: Re. 1-8-0

Jatheeya Jnana Mandir
'64, Fourth Main Road
Gandhinagar Madras 20.

Telugu translation rights rest with
Jatheeya Jnana Mandir.

# పరిచయం

మిజూరీ విశ్వవిద్యాలయ పత్రికా రచనా పాఠశాలలో ప్రధానాచార్యుడైన ఫ్రాంక్ లూథర్ మాట్ అమెరికా జాతీయ వీరుల జీవిత చరిత్రలనుంచీ, స్వీయ చరిత్రలనుంచీ కొన్ని ముఖ్య భాగాలను సంకలితంచేసి ప్రచురించిన "A Gallery of Americans" అనే గ్రంథాని కిది సంక్షిప్తానువాదం.

ఒక జాతియొక్క నిజమైన గొప్పతనం ఆ జాతిలో జన్మించిన మహాపురుషుల జీవిత విశేషాలవల్లనే విశేషంగా విశదమవుతుంది. ఈ సత్యాన్ని గుర్తించే లూథర్‌మాట్ జార్జి వాషింగ్టన్ మొదలు ఫ్రాంక్లిన్ డి. రూజ్వెల్ట్ దాకా గల అమెరికా అధ్యక్షులలోను, థామస్ ఏ. ఎడిసన్ మున్నగు విజ్ఞానశాస్త్రవేత్తలు, నూతనయంత్ర నిర్మాతలలోను, ఎమర్సన్ మొదలు వాల్ట్ విట్‌మన్ వరకు వచ్చిన రచయితలలోను ప్రముఖులైనవారి జీవితాలలోని విశిష్టతను సూచించే రచనలను సేకరించి "A Gallery of Americans" అనే గ్రంథం ప్రచురించాడు. ఇంకా ఇతర రంగాలలో ప్రజాదరణ పాత్రులైన ఇతర మహా పురుషుల జీవిత పద చిత్రాలుకూడా అందులో చేర్చబడినవి. అయితే - తెలుగువారికి విజ్ఞానప్రదంగాను, వినోదదాయకంగాను, సుబోధకంగాను ఉండేవీ, అమెరికా జాతీయ జీవితాన్ని పరిచయం చేయజాలినవీ అయిన పన్నెండు ప్రముఖ వ్యాసాలు మాత్రమే ఈ 'జ్యోతిర్మాల' రూపం పొందినవి.

జాతులమధ్యా, దేశాలమధ్యా, ఖండాలమధ్యా పెరిగిన కృత్రిమ కుడ్యాలు కూలిపోయి, విశ్వసౌభ్రాత్రమనే పునాది మీద ఏక జగత్ ప్రభుత్వం స్థాపించబడాలంటే, అందుకు నాందిగా ప్రతి జాతికీ ప్రపంచంలోని ఇతర జాతులన్నిటితోను హార్దికమైన పరిచయం ఏర్పడాలి! ఆ ఉదాత్త లక్ష్యాన్ని సాధించడానికి ఈ చిన్ని గ్రంథం ఉపకరించగలదని ఆశిస్తున్నాము.

మా జాతీయ జ్ఞానమందిరము పక్షమున ఇతర ప్రపంచ మహాపురుషుల చరిత్రలనుకూడా త్వరలో ప్రచురించగలమని తెలుపుటకు సంతసించుచున్నాము.

ఇట్లు,

25-7-'55
మద్రాసు.

మాగంటి బాపినీడు,
సంపాదకుడు.

# విషయానుక్రమణిక

# జార్జ్ వాషింగ్టన్



1732-1799

వాషింగ్టన్‌లోని ప్రముఖ లక్షణమూ, ఆయనను మహాపురుషునిగా చేసిన సుగుణమూ ఆయన నిజాయితీ. ఇటీవల ఆయన జీవిత చరిత్రలు వ్రాసిన వారు ఆయన సర్వతోముఖ ప్రతిభపట్లను, ఆయన రాజ్యకార్యధురంధరత్వము పట్లను సంశయాలు ప్రకటించారు. కాని, ఆయనను తన దేశీయులకు ప్రియతమునిగా చేసిన ఏకైక లక్షణం: తనను తాను వంచించుకొనకపోవడం, తాను గాఢంగా నమ్మిన విషయానికి ఆత్మార్పణచేసి పనిచెయ్యడం — అని మాత్రం అందరూ అంగీకరించారు.

వాషింగ్టన్ ప్రకృతిలోని ఈ మౌలిక సత్యాన్ని గుర్తించినందువల్లనే ఒకప్పుడు క్రైస్తవ మతోద్యోగిగాను, సంచారపుస్తక విక్రేతగాను పనిచేసిన మాసన్ లాక్ వీమ్స్ అమెరికా తొలి అధ్యక్షుడైన ఈ వాషింగ్టన్ జీవితచరిత్ర వ్రాస్తూ బాల్యంలో ఆయన తన తండ్రి దగ్గర పొందిన శిక్షణకు, విద్యాభ్యాసానికి సంబంధించిన కొన్ని కథ

లను కూడా అందులో చేర్చాడు. ఆ కథలు అమెరికాలో సాంప్రదాయిక గాథలుగా స్థిరపడిపోయినవి. 'చెర్రీ చెట్టు' కథ కల్పితమే కావచ్చు (బహుశః కల్పితమే నేమో కూడా); కాని, అది వాషింగ్టన్ స్వభావాన్ని గూర్చిన ప్రజల భావనకు పూర్తిగా సరిపోయిన కథ. వీమ్స్ వ్రాసిన 'వాషింగ్టన్' చరిత్ర సాధారణ పాఠకులకు అభీష్టమైనది; అత్యధిక సంఖ్యలో ప్రతులు చెల్లినవి. దానిలో నుంచే ఈ క్రింది 'చెర్రీ' చెట్టు గాథ గ్రహించబడినది.

మేము ఎంచిన రెండవభాగం థామస్ జెఫర్సన్ వ్రాసిన 'అనాస్' లోని ఒకభాగం. దీనిలో మంత్రివర్గ సమావేశంలోని ఒక సంఘటన చిత్రించబడినది.]

# 'చెర్రీ చెట్టు'

చిన్నతనంలోనే జార్జికి సత్యమునందు అనురక్తి కలిగించటానికి అతని తండ్రి వాషింగ్టన్ పడ్డంత శ్రమ యులిసిస్ తన ప్రియపుత్రుడయిన టెలిమేకస్ విషయంలో కూడా పడి ఉండడు. వాషింగ్టన్ కొడుకుతో ఇలా అనేవాడు: "జార్జ్! యువకుడికి సత్యం అత్యంత సుందరమైన ఆభరణం. నిజాయితీగల హృదయం, ఆడినమాటల్లా విశ్వసింప దగ్గదిగా ఉండే పరిశుద్ధమైన వాక్కూ గల బిడ్డను చూడటానికి నేను 50 మైళ్ళదూరం ప్రయాణంచేయవలసి వచ్చినా లెక్క చెయ్యను. ప్రతివ్యక్తి దృష్టిలోను అటువంటి బిడ్డ ఎంతో అందంగా కనబడతాడు. అట్టి బిడ్డని తల్లిదండ్రులు అమితంగా ప్రేమిస్తారు. ఆ బిడ్డ బంధువులు అతన్ని చూచుకొని గర్వపడతారు; తమ పిల్లల ముందు నిరంతరం అతన్ని

ప్రశంసిస్తూ, అతన్ని అనుకరించమని వారిని హెచ్చరిస్తారు; అతడు కాగానే తమ బిడ్డలను సన్మార్గంలో పెట్టటానికి వచ్చిన ఒక దేవతామూర్తి అన్నంత ఘనంగా అతన్ని లాలిస్తారు.

"ఇక రెండో వేపున - జార్జ్! అబద్ధాలాడటం కాగా అలవాటై పోయి, అతనిమాట ఏదీ నమ్మటానికి వీలులేకుండా పోయిన కుర్రవాడి సంగతి చూడు! వాడెక్కడికి వెళ్లినా అసహ్యించుకొంటారు. ఏ తల్లిదండ్రులైనా తమ బిడ్డలు వాడితో కలసి తిరగడం చూస్తే హడిలిపోతారు. జార్జ్! నాతండ్రీ! నీవటువంటి వాడివిగా అవటం కళ్ళారా చూడడంకంటె నీవు నాకు ఎంత ప్రియతముడివైనా, సంతోషంగా నిన్ను మృత్యుదేవత కర్పించడానికైనా నేను ఇష్టపడతాను! చిన్న అడుగులతో నాతోకూడా పరుగులు పెడుతూఉండే నిన్ను, ప్రేమ తొణికిసలాడే చూపులతోనూ, తియ్యని ముద్దుపలుకులతోనూ నాజీవితంలో అత్యధిక సుఖాన్ని కలిగిస్తున్న నిన్ను చేజేతుల వదలుకోడం చాలా కష్టమైనదనేమాట నిజమే! అయినా సరే - నాబిడ్డ అబద్ధాలకోరుగా తయారవుతూండగా చూడవలసిరావడం కంటె వాణ్ణి వదలుకోవడమే నాకు ఇష్టం."

"నాన్నా!" అని పిలిచి, జార్జి గంభీరంగా తండ్రిని అడిగాడు: "నే నెప్పుడైనా అబద్ధాలాడుతున్నానా?"

"లేదు జార్జ్! నువ్వు అబద్ధాలాడకుండా ఉన్నందుకు నేను భగవంతుడికి నమస్కరిస్తున్నాను. ఇక ముందు

కూడా నీవు అబద్ధాలాడబోవనే ఆశతో సంతోషపడు తున్నాను. కనీసం నావల్ల నీకు అటువంటి అవమానకర మైన అపరాధం చేయవలసిన అవసరం ఎన్నడూ కలుగ బోదు. నిజానికి చాలామంది తలిదండ్రులు చిన్న తప్పుకి కూడా పిల్లల్ని కొడుతూ బలవంతంగా ఈ దారుణాభ్యాసానికి వాళ్లు పాల్పడేటట్టు చేస్తారు. మరోసారి తప్పు చేసినప్పుడు మొదటి నాటి దెబ్బలతో బేజారెత్తిపోయిన ఆ పసిహృదయం దండన తప్పించుకోవడానికి మెల్లగా ఒక అబద్ధం జారవిడుస్తుంది. నీ విషయంలో మాత్రం జార్జ్! నే నెప్పుడూ చెబుతూనే ఉన్నాను కదా! మళ్ళీకూడా చెబుతున్నాను. పొరపాటున నువ్వేదైనా తప్పుచేస్తే, దాన్ని కప్పిపుచ్చటానికి నువ్వె ప్పుడూ అబద్ధం ఆడకూడదు. అనుభవమూ, జ్ఞానమూ లేని పసివాడివి గనుక సాధారణంగా పొరపాటువల్లనే తప్పులు చేస్తూఉంటావు. అటువంటప్పుడు నువ్వు ధైర్యంగా వచ్చి నాతో చెప్పేసెయ్యి. నేను నిన్ను కొట్టకపోగా అందుకు నిన్నింకా ఎక్కువ గౌరవిస్తాను; ఎక్కువ ప్రేమిస్తాను.''

పిల్లలను సన్మార్గంలో పెట్టడానికి ఇది మంచి పద్ధతి అని అందరూ ఒప్పుకుంటారు. అలా రుజువుకూడా అయింది. తండ్రి తన బిడ్డపట్ల నిజమైన తండ్రిగా, సంరక్షక దేవత (Guardian Angel) గా ప్రవర్తించిన ప్రతి సందర్భంలోను ఎట్టి ఫలితం కలుగుతుందని నేను నమ్ముతున్నానో, సరిగ్గా అట్టి ఫలసాయమే జార్జివిషయంలో కూడా కలిగింది.

ఈ దిగువ సంఘటన జార్జి బాల్యజీవితంలో చాలా విల

క్షుణ్ణమైనదీ, విలువైనదే గాక తప్పకుండా నమ్మదగినది కూడా. ఎందువల్లనంటే–నేను ఎవరికైతే అనేక విషయాలు తెలిపినందుకు ఋణపడి ఉన్నానో ఆ ప్రాజ్ఞురాలే ఈ వృత్తాంతం కూడా నాకు తెలిపింది.

ఆమె ఇలా చెప్పింది : ''జార్జి ఆరేళ్ళ బాలుడుగా ఉన్నప్పుడు ఒక చిన్న చేతిగొడ్డలితో ఆడుకొంటూ ఉండే వాడు; ఆ వయస్సులో ఉన్న పిల్లలందరిలాగే ఆ గొడ్డలి అంటే అతనికి తగని ఇష్టం; ఎప్పుడూ అది చేత్తో పుచ్చుకొని దారి కడ్డమైన వస్తువునల్లా దానితో నరుకుతూ తిరుగుతూ ఉండే వాడు. మామూలుగా తన తల్లి పెట్టుకొన్న చిక్కుడుపాదును నరికివేస్తూ ఆనందపడుతూ తిరుగుతూ ఉండే వాడల్లా, ఒక రోజున దురదృష్టవశాత్తు ఒక పడుచు ఇంగ్లీష్ చెర్రీ చెట్టు మీద తన గొడ్డలి పదును పరీక్షించాడు. దారుణంగా ఆ చెట్టు బెరడు చెక్కిన తీరుచూస్తే, అది మళ్ళీ కోలుకుంటుం దని ఎవరికీ తోచదు. మర్నాడు ఉదయం ముసలాయన తనకు చాలాప్రియమైన ఆ చెట్టుకు పట్టిన దుర్గతి చూచి చర చరా ఇంట్లోకివచ్చి, ఆ కొంటె పనిచేసింది ఎవరని అతి కోపంగా గద్దించాడు. 'అయిదు గినీ లిచ్చినా, నే నా చెట్టును అమ్మి ఉండేవాణ్ణికాను' అని కూడా అన్నాడు. అది ఎలా జరిగిందో ఎవ్వరూ చెప్పలేక పోయారు. అంతలో జార్జి తన చేతిగొడ్డలితో సహా అక్కడ ప్రత్యక్షమయాడు. 'జార్జ్! ఆ తోటలో ఆ అందమైన చిన్న చెర్రీచెట్టును చంపిన హంతకు డెవడో నీకు తెలుసునా?' అని తండ్రి అడిగాడు.

అది చాలాక్లిష్టమైన ప్రశ్న; ఆ ప్రశ్నబరువుతో జార్జి ఒక నిమిషం కలవరపడ్డాడు. కాని, వెంటనే కోలుకున్నాడు. తండ్రివంక చూస్తూ, సర్వజనవశంకరమైన, అనిర్వచనీయమైన సత్యశోభతో రెట్టించిన కాంతిగల మధురమైన పసిమోమును పైకెత్తి, ధైర్యంగా అన్నాడు: ''నేను అబద్ధాలాడలేను నాన్నా! అబద్ధమాడలేనని నీవుకూడా ఎరుగుదువు. నేనే ఆ చెట్టును నాచేతి గొడ్డలితో నరికాను.''

మహానందంతో తండ్రి అరిచాడు: ''నా బంగారు తండ్రీ! ఇలా రా! నన్ను కౌగలించుకో! జార్జ్! నాకు పరమానందం కలిగించావు. నీవు నాచెట్టును నరికితే నరికావు. అందుకు వెయ్యిరెట్ల ప్రతిఫలం నాకు ముట్టచెప్పావు. నాబిడ్డలోని ఈ విధమైన ధర్మవీరము అట్టి వెయ్యిచెట్లకంటె విలువైనది. ఆ చెట్టు వెండి పువ్వులుపూసి, మేలిమి బంగారపు పండ్లు పండినా సరే!''

# అధ్యక్షుని ఆగ్రహాటోపం

[దిగువ సంఘటనలో వచ్చే హెన్రీ నాక్స్ వాషింగ్టన్ మంత్రి వర్గంలో యుద్ధమంత్రి. తన డైరీలో ఈ సంఘటనను పదిల పరచిన జెఫర్సన్ ఆ మంత్రివర్గంలో విదేశాంగమంత్రి. ఫిలిప్ ఫ్రెన్యూ ప్రభుత్వ వ్యతిరేక పత్రిక అయిన 'నేషనల్ గజెట్' సంపాదకుడు. ఈ సంఘటన 1793 ఆగస్టు 2 న ఒక మంత్రివర్గ సమావేశంలో జరిగింది.]

నాక్స్ ఒక తెలివితక్కువ, అసందర్భపు ప్రసంగంలో అప్పుడే ఒక పత్రికలో అచ్చుఅయిన 'రాజయిన వాషింగ్టన్ అంత్యక్రియ – న్యాయాధిపతి జేమ్స్ విల్సన్...' అనే ఒక వ్యంగ్యపరిహాస రచనను గూర్చిన ప్రస్తావన తెచ్చాడు. ఆ రచనలో అధ్యక్షుడు ఉరికంబ మెక్కించబడ్డాడు. ఆ ప్రస్తావన రాగానే అధ్యక్షుడికి విపరీతమైనకోపం వచ్చింది; ఒళ్లు తెలియని ఆవేశం వచ్చింది. వ్యక్తిగతంగా తనమీద కురిపించిన దూషణవాక్యపరంపరను ఆయన గట్టిగా నిరసించాడు. ఈ ప్రపంచంలో ఎవడైనా – తాను ప్రభుత్వంలో ప్రవేశించినది లగాయతు! ఫలానా పని తాను చిత్తశుద్ధితో చేయలేదని వ్రేలెత్తి చూపించగలడా అని ప్రశ్నించాడు. ఒక్కసారి తప్ప తాను పశ్చాత్తాపపడి ఎరుగననీ, ఆ ఒక్కసారి తన పదవికి రాజీనామాఇచ్చే అవకాశాన్ని చేజార్చినప్పుడే ననీ, అటుతరువాత ఆ వేదన తనను నిరంతరం వెన్నంటుతూనే ఉన్నదనీ అన్నాడు. దేవుడి సాక్షిగా తనకు తన ప్రస్తుత పదవికంటె సమాధి అడుగున శయనించడం సుఖ

మనీ, ప్రపంచ సార్వభౌమత్వం కంటె కూడా తనకు తన పొలంమీద పనిచేసుకోడమే ఎక్కువ ఇష్టమనీ, అయినప్పటికీ వాళ్లు తాను రాజు కాగోరుతున్నట్లు నిందిస్తున్నారనీ అన్నాడు. ఆ దౌర్భాగ్యుడు క్రెమ్యూ నిత్యం తనపత్రిక తాలూకు మూడుప్రతులు ఆయనకు పంపుతున్నాడట! అది చూడగా — తను ఆ పత్రికకి ఏజెంట్‌గా కుదురుతాడేమో అని వాడు ఆశిస్తున్నట్లు కనబడుతున్నదని అన్నాడు. తనను అవమానపరచాలనే నిర్లజ్జమైన పథకం తప్ప ఆ రచనలో తన కేమీ కన్పించడం లేదన్నాడు. తారస్థాయిలో ఆయన ఆ ఆగ్రహ ప్రకటన ముగించాడు.



# థామస్ జెఫర్సన్

## 1743 - 1826

[1775-76 సం॥రాలలో జెఫర్సన్ అమెరికా కాంగ్రెస్ సభ్యుడుగాను, ఆ మరుసటి సంవత్సరం స్వాతంత్ర్య ప్రకటన పత్రాన్ని తయారుచేసేందుకు నియమితమైన ఉపసంఘానికి అధ్యక్షుడుగాను పని చేశాడు. అటు తరువాత వర్జీనియా గవర్నరుగాను, ఫ్రాన్సులో అమెరికా రాయబారిగాను, వాషింగ్టన్ మంత్రివర్గంలో విదేశాంగ మంత్రిగాను కూడా పనిచేశాడు. 1797-1801 మధ్య ఉపాధ్యక్షుడయాడు; తరువాత అమెరికా మూడవ అధ్యక్షుడుగా ఎన్నికై, వరుసగా రెండు పదవీకాలాలపాటు ఆ పదవిలో ఉన్నాడు.

దిగువను ఇచ్చిన రెండు వ్యాసాల్లోనూ మొదటిది: జెఫర్సన్‌ను 'స్వాతంత్ర్య ప్రకటన' పత్ర రచనకు నియమించినట్టు జాన్ ఏడమ్స్ వ్రాసిన ఒక లేఖ.

రెండవది: వృద్ధుడైన జెఫర్సన్‌నుగూర్చి 36 ఏండ్ల యువకుడు డేనియెల్ వెబ్‌స్టర్ వ్రాసిన (లేక చెప్పి వ్రాయించిన) ఒక పదచిత్రం.

# స్వాతంత్ర్య ప్రకటన పత్ర రచన

[1822 ఆగస్టు 6 వ తేదీన టిమోతీ పికెరింగ్‌కు జాన్ ఏడమ్స్ వ్రాసిన లేఖ ఇది. దీనిలోని కొన్ని వివరాల యాథార్థ్యం శంకింపబడుతున్నప్పటికీ, ఆ వ్యవహారంతో సంబంధం ఉన్న ఒక ప్రముఖవ్యక్తి చెప్పిన ఒక రసవత్కథ ఇది.]

స్వాతంత్ర్య ప్రకటన పత్రరచనా సంఘాధ్యక్షుడుగా జెఫర్సన్‌వంటి యువకుణ్ణి ఎందుకు నియమించారని మీరు నన్ను ప్రశ్నించారు. దానికి నా జవాబు : ప్రతి సంఘానికీ అధ్యక్షుడుగా వర్జీనియా మనిషిని నియమించాలన్న ఫ్రాంక్‌ఫర్ట్ నిర్ణయం అందుకు కారణమని. రిచర్డ్ హెన్రీ లీ తన భార్యకు సుస్తీచేయడంవల్ల వర్జీనియా వెళ్లినమాట నిజమే కావచ్చు ; కాని నాకు తెలిసి ఉన్నంతవరకు జెఫర్సన్ నియామకానికి అది కారణం కాదు. ఏక కాలంలో మూడు సంఘాలను నియమించవలసివచ్చింది. ఒకటి 'స్వాతంత్ర ప్రకటన పత్ర' రచనకీ, ఇంకొకటి సమాఖ్యారాజ్య (Confederation) నిబంధనలు తయారుచేయడానికీ, మూడోది ఫ్రాన్సు దేశంతో సంధిపత్రాన్ని తయారుచెయ్యడానికీ. 'లీ'సమాఖ్యా సంఘానికి ఎన్నుకోబడ్డాడు ; ఒకే మనిషి రెండుసంఘాల్లో ఉండడం అసౌకర్యంగా ఉంటుందని భావించారు.

1775 జూన్‌లో జెఫర్సన్ 'కాంగ్రెస్'కు ఎన్నిక అయినాడు. అప్పటికే అతడు సాహిత్యంలోను, విజ్ఞాన శాస్త్రంలోను, రచనాప్రావీణ్యంలోను ప్రశస్తి గడించాడు.

భావప్రకటనలోని సౌలభ్యానికి అతని రచనలు ప్రసిద్ధిపొందినవి. కాంగ్రెస్‌లో ఎన్నడూ కాని పదవి వివ్వని సభ్యుడే అయినా, ఉపసంఘాల్లోను, సంభాషణల్లోను సద్యస్స్ఫూర్తి కలిగి నిర్మొగమాటంగా విస్పష్టము, నిష్కృష్టము అయిన అభిప్రాయాలు ప్రకటించేవాడు. (ఈ విషయంలో శామ్యుయల్ ఏడమ్స్‌కూడా అతనిని మించలేదు.) అందుచేత, అనతికాలంలోనే అతను నాదృష్టి నాకర్షించాడు. ఈ సందర్భంలో నావోటు అతనికే ఇచ్చి, ఇతరుల వోట్లుకూడా సంపాదించడానికి నాకు చేతనైనదంతా చేశాను. మిగతా వాళ్ళకంటె అతనికొక వోటు ఎక్కువ వచ్చిందనుకుంటాను. అందుచేత అతనికి అగ్రస్థానం లభించింది. అతని తర్వాత అధిక సంఖ్య వోట్లు నాకు వచ్చినవి. అందుచేత నాకు ద్వితీయ స్థానం లభించింది. ఆ ఉపసంఘం సమావేశమై, విషయాన్ని చర్చించి చివరికి జెఫర్సన్‌నీ, నన్నూ – బహుశః మేమిద్దరమూ ప్రథమ, ద్వితీయస్థానాలుపొంది ఉండటంవల్ల అనుకొంటాను – చిత్తు ప్రతి తయారుచేయడానికి నియోగించారు.

మేమిద్దరం సమావేశమయినాము. జెఫర్సన్ నేను చిత్తుప్రతి తయారుచెయ్యాలని సూచించాడు. ఖండితంగా "నేను చెయ్యను" అని చెప్పాను.

"మీరు చేసి తీరాలి!"

"ఎంత మాత్రం చెయ్యను."

"ఎందుకు చెయ్యరు? ఆ పని మీరే చెయ్యాలి!"

"నేను తయారుచెయ్యడం నా కిష్టంలేదు."

"ఎందువల్ల ?"

"చాలా కారణాలున్నాయి."

"ఏమిటా కారణాలు ?"

"మొదటి కారణం: నీవు వర్జీనియా రాష్ట్రం వాడివి. ఆ రాష్ట్రంవాడే ఈ విషయంలో ప్రధాన బాధ్యత వహించాలి. రెండో కారణం : నేను నిందితుణ్ణి, శంకితుణ్ణి, ప్రజాదరణ కోల్పోయినవాణ్ణి; నువ్వు సరిగ్గా దీనికి విరుద్ధం. ఇక మూడో కారణం : నీవు నాకంటె పదిరెట్లు బాగా వ్రాయగలవు."

"అలాగైతే సరే" అన్నాడు జెఫర్సన్, "ఇదే మీ నిశ్చితాభిప్రాయమైతే, నాకు చేతనైనట్టు వ్రాస్తాను."

"మంచిది. నీవు వ్రాయడం పూర్తికాగానే మళ్ళీ మనం కలుసుకొందాం!"

ఆ ప్రకారం మళ్ళీ కలుసుకొని, అతను వ్రాసుకొచ్చిన ప్రతిని పరిశీలించాము. ఆ రచనలోని గాంభీర్యం, ఉదాత్తమైన ధారా – ముఖ్యంగా నీగ్రోల బానిసతనాన్ని గూర్చిన భాగంలో – నాకు చాలా ఆనందాన్ని కలిగించినవి. ఆ భాగాన్ని అతని దక్షిణాది సోదరులు కాంగ్రెస్‌లో ఎలాగూ ఆమోదించరని నాకు తెలుసుగాని, నేనుమాత్రం ఆ భావాల నెన్నడూ ప్రతిఘటించను. అయితే, నేను వ్రాయడమంటూవస్తే, ఎన్నడూ చేర్చి ఉండని మరికొన్ని భాగాలు ఆ పత్రంలో లేకపోలేదు. ముఖ్యంగా జార్జి రాజును నిరంకుశుడని నిందించిన భాగం. అది చాలా వ్యక్తి

గతంగా ఉందని నేననుకొన్నాను. ప్రవృత్తిలోగాని, ప్రకృతిలోగాని, జార్జిరాజు నిరంకుశుడని నేనెన్నడూ నమ్మలేదు. అట్లాంటిక్ సముద్రాని కిరుప్రక్కలా ఉన్న ఆయన పరివారంచేత ఆయన వంచితుడయినాడని నా నమ్మకం. అధికారిక ధర్మనిర్వహణలో మాత్రమే ఆయనక్రూరంగాఉండేవాడు. జెఫర్సన్ చేసిన పదప్రయోగం చాలా ఆవేశపూరితంగాను, అంతటి ఉదాత్త పవిత్ర పత్రానికి అనుచిత మనిపించేటంత నిందాగర్భితంగాను ఉందని నేను భావించాను. కాని, అటు తర్వాత ఫ్రాంక్లిన్, షెర్మన్ దాని నెలాగూ పరిశీలించవలసి ఉంది గనుక, ఆభాగం నేను కొట్టివేయడం అనుచితమని ఊరుకొన్నాను. ఆ చిత్తుప్రతిని సంఘం ముందు పెట్టటానికి నే నామోదించాను; నేనేదైనా మార్పుచెయ్యటం గాని, సూచించడం కాని జరిగినట్లు నాకిప్పుడు జ్ఞాపకంలేదు. అయిదుగురు సభ్యులు గల మా సంఘానికి దానిని నివేదించాము. ఫ్రాంక్లిన్‌గాని, షెర్మన్‌గాని ఏ భాగాన్నైనా విమర్శించినట్లు నాకు గుర్తులేదు. మేము అడావిడిలో ఉన్నాం; కాంగ్రెస్ సభవారు తొందర పడుతున్నారు. ఆ పత్రాన్ని జెఫర్సన్ వ్రాసింది వ్రాసినట్లు, బహుశః అతని దస్తూరీలోనే కాంగ్రెస్ ముందు పెట్టాం. నే ననుకొన్న ప్రకారంగానే దాంట్లో నాలుగోవంతు కాంగ్రెస్ కోసేసింది. అయితే, వాళ్లు దానిలోని కొన్ని మంచి భాగాలుకూడా కొట్టేశారు. అభ్యంతరంగా తోచిందల్లా తీసేశారు. మొదట జెఫర్సన్ తయారుచేసిన ప్రతి యథాతథంగా ఎందుకు ప్రచు

రితం కాలేదా అని నేను చాలా ఆశ్చర్యపోతూ ఉంటాను. బహుశః నీగ్రోల బానిసతనానికి ప్రతికూలంగా సాగుతున్న తీవ్రమైన ప్రచారమే అందుకు కారణ మనుకొంటాను.

మీరు చెప్పినట్టు రెండేళ్ళనాడు కాంగ్రెస్‌లో చర్చించ వేయబడిన భావాలు తప్ప క్రొత్తది ఒక్కటీ అందులోలేదు. 1774 వ సంవత్సరం తాలూకు 'కాంగ్రెసు సంచికల' (Journals of Congress) లోని మానవస్వత్వాల ప్రకటనకు, ఆ స్వత్వాల ఉల్లంఘనకు సంబంధించిన భాగాలే ఈ పత్రంలోని సారాంశం. నిజానికి, మొదటి కాంగ్రెస్ సమావేశమవడానికి పూర్వమే బాస్టన్ నగరపాలకసభ ముద్రించి ప్రకటించిన కరపత్రంలోని ప్రధానధోరణినే ఈ పత్రం ప్రతిధ్వనిస్తూంది. ఆ కరపత్రాన్ని బహుశః జేమ్స్ ఓటిస్ తన ఆరోగ్యం బాగా ఉన్న ఒక సమయంలో వ్రాయగా, శామ్యుయల్ ఏడమ్సు దానిని దిద్ది మెరుగులు పెట్టాడనుకుంటాను.

# 81 ఏళ్ల వయస్సులో జెఫర్సన్

అప్పుడు 81 – 82 ఏళ్ల వయస్సులో ఉన్నాడు జెఫర్సన్. ఆరడుగులు పొడవయిన ఆజానుబాహువైన విగ్రహం; బక్కపల్చగా ఉన్నాడు. సాధారణ ప్రమాణంలోనే ఉన్న ఆయన తల భుజాలకంటె ముందుకు పొడుచుకు వచ్చినట్లున్నది. మెడ బాగా పొడుగవడంవల్ల ఆయన నడిచేటప్పుడుగాని, మాట్లాడేటప్పుడు గాని, మెడను ముందుకు సాచటం అలవాటయి పోయింది. తలమీద జుట్టు దట్టంగానే

ఉంది; ఒకప్పుడు ఎర్రగా ఉండిన ఆజుట్టు క్రమంగా నెరుస్తూ, ఇప్పుడు అస్పష్టమైన ఇసుక రంగుగా ఉంది.

కళ్లు చాలా చిన్నవి; ప్రస్తుతం ప్రకాశవంతంగానూ లేవు; ఆకర్షకంగానూ లేవు. గడ్డం పొడుగు: కాని, కొన తేరి లేదు. చిన్న ముక్కు; ఎక్కడా వంకర లేదు. ముక్కుపుటాలు మాత్రం కొంచెంగా పైకిలేచి ఉన్నాయి. తీర్చిన నోరు; పళ్లేమీ ఊడలేదు. పెదవులు మెలివడ్డ తీరులో సంతృప్తీ, ఔదార్యమూ స్ఫురిస్తున్నాయి. పూర్వం లేతరంగులో దర్శనీయంగా ఉండిన శరీరచ్ఛాయ ఇప్పుడు వార్ధక్యలక్షణాలకు గురియై, చర్మమంతా ముడుతలు పడింది. కాళ్లూ, చేతులూ విపరీతమైన పొడుగు. మణికట్ల ప్రమాణం చాలా ఎక్కువ. నడక తూచినట్లు సైనికుల నడకలాగ ఉండదు. యథాలాపంగా ఊగుతూ నడుస్తాడు. మనిషి కొంచెం వంగిపోయాడు; కాని, దానికి వార్ధక్యంకన్న ఆయన సహజశరీర నిర్మాణమే ఎక్కువ కారణం. కూర్చున్నప్పుడు పొట్టిగా కనిపిస్తాడు. దానికి కారణం - కొంతవరకు దిగజారి కూచునే ఆయన అలవాటే! ఆయన అవయవాల అనుచితప్రమాణం కూడా కొంతవరకు కారణం కావచ్చును.

ఇంట్లో ఉన్నప్పుడు ఆయన గోధుమవన్నె ఓవర్ కోటూ, ఉన్ని వెయిస్టుకోటూ, ముసురు ఎరుపురంగు లాగూ ధరిస్తాడు. ఆయన పంట్లాములు చాలా పొడుగ్గా, వదులుగా ఉంటాయి; కోటు రంగులోనే ఉంటాయి. ఆయన మేజోళ్లు ఉన్నివి. తెలుపు, గోధుమ వన్నెల మేజోళ్లు వాడతాడు.

పేరుకూడా వేసిఉండేరకం జోళ్లు ఆయన ధరిస్తాడు. మొత్తం మీద దుస్తులవిషయంలో ఎక్కువ శ్రద్ధ తీసుకుంటున్నట్టు కనబడదు. అయినా అవి అపరిశుభ్రంగా ఉండవు. సర్వసాధారణమైన గుండ్రని హాట్ (టోపి) ధరిస్తాడు. గుర్రపుస్వారీ చేసేటప్పుడు ఒక గోధుమవన్నె కోటూ, అదేకరం జాకెట్టూ – రెండూ ముత్యపుగుండీలుగలవి – ధరిస్తాడు. మేము మొదట ఆయనను గుర్రపుస్వారీ చేసేటప్పుడే చూశాం. నెక్‌టై బదులు తెల్లని ఉన్నితో అల్లిన ఒక మఫ్లర్ మెడకు చుట్టుకొన్నాడు; పంట్లాంక్రింద ముఖమల్ మేజోళ్లు ధరించాడు. చూసే చూడగానే అసాధారణమైన ఆరోగ్యసంపద, అమితోత్సాహం ఆయనలో స్ఫురిస్తాయి. ఆయనకు చూపు బాగా ఆనుతున్నది. సాయంసమయాల్లో తప్ప కళ్లజోడు అవసరంలేదు. వినబడడమూ బాగానే వినబడుతూంది; అయితే అనేక కంఠాలు ఏకకాలంలో ఆవేశంతో సంభాషించేటప్పుడు మాత్రం కొంత గజిబిజిగా ఉండవచ్చు.

జెఫర్సన్ ఉదయం తన పడక కెదురుగా వ్రేలాడే గడియారం ముల్లును తాను చూడగలిగే వేళకు నిద్ర లేస్తాడు. వెంటనే ధర్మామీటరు చూస్తాడు; ఎందుకంటే – ఆయన నిత్యం వాతావరణపట్టిక తయారుచేస్తూ ఉంటాడు. 9 గంటలకు ప్రాతఃకాల భోజనానికి లేచేదాకా ముఖ్యంగా వ్రాత పని చూసుకుంటాడు. అటుతర్వాత మధ్యాహ్నం భోజనంవేళ దాకా తన గ్రంథాలయంలో గడుపుతాడు. ఒక్కొక్కప్పుడు బయట తెరపిగా ఉన్న రోజుల్లో, ఆ సమయంలో 7 మొదలు

14 మైళ్ళ దాకా గుర్రపుస్వారీ చేయటం కూడా కద్దు. 4 గంటలకు మధ్యాహ్నభోజనం; 6 గంటలకు అతిథిదర్శనశాల (Visiting room) కు వస్తాడు; అప్పుడు కాఫీ వస్తుంది. రాత్రి 9 గంటలదాకా మిత్రులతో ఇష్టగోష్ఠి జరుపుతాడు. తరువాత విశ్రమిస్తాడు. 9 గంటలకల్లా విశ్రమించడం ఆయనకు బాగా అలవాటయిపోయింది. ఏమాత్రం ఆలస్యమైనా ఆయన ఆరోగ్యం దెబ్బతింటుంది. ఆయన భోజనం చాలా సాధారణమైనది; ఆయన అభిరుచులే అందుకు కారణమనుకుంటాను. ఉదయం టీ లేక కాఫీ, అప్పుడే పొయ్యిమీదనుంచితీసిన రొట్టె, ఒక్కొక్కప్పుడు కొంచెం చల్లారిన మాంసం తీసుకుంటాడు. ఇక మధ్యాహ్నం భోజనంలో మాంసంతోపాటు కాయగూరలుకూడా ఎక్కువగా తింటాడు. యూరప్ నుంచి వచ్చిన ద్రాక్షసారాయిమీద ఆయనకు ఎక్కువ మోజు. అనేక జాతుల మేలిరకపు యూరప్ పానీయాలు ఆయన ఇంట్లో ఎప్పుడూ సిద్ధంగా ఉంటాయి. వాటిని దిగుమతి చెయ్యడంలోనూ, భద్రపరచడంలోనూ ఆయన దిట్ట. ఈ దేశంలో (అమెరికాలో) చాలా అరుదైన లెడ్నావూ, ముస్కట్, సామియన్, బ్లాంచెటీ, డిలిమోక్స్ మొదలైన పానీయాలు అక్కడ మేముచూశాం. కొంత వర్జీనియా పద్ధతిలోనూ, కొంత ఫ్రెంచిపద్ధతిలోను, వడ్డన జరుగుతుంది. వడ్డనలో ఆదరంతోపాటు పదార్థా లధికంగా కూడా వడ్డిస్తారు. బల్లమీద గుడ్డ తీసివేయకుండా క్రొత్తద్రాక్షసారా సీసా బల్లమీదికిరాదు.

సంభాషణలలో జెఫర్సన్ అప్రయత్నంగాను, అతి

సహజంగాను మాట్లాడతాడు. అత్యాశ ఎక్కడా కని పించదు. అందరి దృష్టిని ఆకర్షించడం కోసమని బిగ్గరగా మాట్లాడడు; సాధారణంగా తన ప్రక్క వ్యక్తినే ఉద్దేశించి ప్రసంగిస్తాడు. తనశ్రోత స్వభావానికీ, అభిరుచులకూ సరి పడని విషయాలమీాద ప్రసంగం ఆయన ఎప్పుడైనాచేస్తే, ఆ విషయాలు ఆ సమయంలో ఆయన మనస్సుని బాగా ఆకట్టుకొని ఉన్న విషయా లన్నమాట. ప్రస్తుతం ఈ విధంగా ఆయన మనస్సులో ప్రధానంగా నిండి ఉన్న విష యాలు విజ్ఞానశాస్త్రమూ, సాహిత్యమూ, ముఖ్యంగా - ఆయన కృషివల్లే రూపొందుతూన్న వర్జీనియా విశ్వ విద్యాలయమూ అని చెప్పవచ్చు. ఆయన నిరంతర శ్రద్ధవల్ల ముందు ముందు ఆ విశ్వవిద్యాలయం చాలా ప్రయోగకారిగానూ, ప్రతిష్ఠాభాజనంగాను పరిణమింపగల దని ఆశిస్తున్నారు. మేము ఆయనను కలసినప్పుడు ఆయన ప్రసంగంలో వచ్చిన విషయాలు: గ్రీక్, ఆంగ్లో శాక్సన్ భాషలూ, ఫ్రెంచి విప్లవంనాటి చరిత్రాత్మక సంఘటనలూ, తాను 1783-84 నుంచి 1789 దాకా ఫ్రాన్స్‌లో గడిపిన రోజుల సంస్మరణమూ.



## అబ్రహాం లింకన్

**1809-1865**

[‘ఎన్నికల సందర్భంలో ఏకవేదికమీద స్టీవెన్ ఏ. డగ్లస్‌తో వాదోపవాదాలకు దిగేవరకూ లింకన్ ప్రతిష్ఠ స్థానికంగానే ఉంటూ వచ్చింది. మొదట రాష్ట్ర శాసనసభలో ఆయన తన జిల్లాకు ప్రాతినిధ్యం వహించాడు. తరువాత ఒక పదవీకాలం కాంగ్రెస్‌లో కూడా సభ్యుడుగా పనిచేశాడు. 1856 లో మొట్టమొదటిసారిగా రిపబ్లికన్ టిక్కెట్టుమీద ఉపాధ్యక్ష పదవికి నిలిచేందుకు ఆయన కొన్ని వోట్లు సంపాదించగలిగాడు. ఆ ఎన్నికలో ప్రతిస్పర్థి డెమోక్రటిక్ పార్టీ ప్రముఖ నాయకులలో ఒకడైన డగ్లస్. అందుచేత లింకన్‌కి జాతీయ ప్రశస్తి సిద్ధించింది. తూర్పు ప్రాంతంలోని పత్రికలకు సమర్థులైన విలేఖకులు ఆ వాదోపవాదాల వార్తలు వ్రాసిపంపారు. ఆ ఎన్నిక ప్రచారం ఫలితంగా చివరికి శాసనసభ డగ్లస్‌నే ఎన్నుకున్నా, ప్రజల ఆదరం మాత్రం డగ్లస్‌కంటె లింకన్‌కే అధికంగా లభించింది. ఆ ప్రచారం సందర్భంలో వ్యక్తమైన లింకన్ గుణగణాలు 1860 లో అధ్యక్షపదవికి రిపబ్లికన్ పక్షం తరఫున అతనిని ప్రముఖ అభ్యర్థిని చేసినవి.

ఈ దిగువ ఇచ్చిన రెండు వృత్తాంతాలలోను మొదటిది - హెర్న్డన్ పీక్ ప్రకటించిన 'లింకన్ - డగ్లస్' చర్చల వర్ణిస్తూ హోరేస్ వైట్ రచించినది. ఆ చర్చలకాలంలో వైట్ 'షికాగో ఈవెనింగ్ జర్నల్'కి విలేఖరుడుగా ఉంటేవాడు. తర్వాత అతడు వరుసగా 'షికాగో డెయిలీ ట్రిబ్యూన్,' 'న్యూయార్క్ ఈవెనింగ్ పోస్టు' పత్రికలకు సంపాదకుడయాడు. 'లింకన్-డగ్లస్' చర్చలు వినేందుకు వచ్చిన జనసమూహాలను వర్ణిస్తూ 'ఈవెనింగ్ పోస్ట్' పత్రిక తాలూకు చెస్టర్ పి. డ్యూయీ వ్రాసిన అంశాలుకూడా ఇందులో చేర్చబడినవి.

రెండవది - వాల్ట్ విట్‌మన్ వ్రాసిన 'విలక్షణ దినాలు' (Specimen days) అనే గ్రంథంలోని వాషింగ్టన్ నగరానికి సంబంధించిన భాగంనుండి గ్రహింపబడినది.]

# సంచారోపన్యాసకుడుగా లింకన్

నేను వ్రాయబోయే ఎన్నికల ప్రచారానికి నాలుగేళ్లముందు, 1854 అక్టోబరులో లింకన్‌తో నా పరిచయం ఆరంభమైంది. అప్పుడు నేను 'షికాగో ఈవెనింగ్ జర్నల్' పత్రికలో పనిచేస్తున్నాను. స్ప్రింగ్ ఫీల్డ్ నగరంలో జరుగుతున్న రాష్ట్రవారోత్సవాల రాజకీయ విశేషాలనుగురించి ఆ పత్రికకు వ్రాసి పంపే నిమిత్తం నన్నక్కడకు పంపించారు. ఆ విధంగా - ఆ నగరంలో సనాతన ప్రభుత్వ భవనంలో లింకన్ ప్రసంగించినప్పుడు పత్రికా ప్రతినిధుల శ్రేణులలో నేను అగ్రశ్రేణి నాక్రమించడం జరిగింది.

ఆ మహావక్త ఉపన్యాసం నన్ను పరవశుణ్ణి చేసింది. అంతవరకూ రాజకీయ ఉపన్యాసాలు నేను ఎక్కువగా విని లేదు. అటు తరువాత చాలా విన్నాను. కాని, ఆనాటి

లింకన్ ఉపన్యాసాన్ని మించిన ఉపన్యాసం తరువాత ఆ లింకన్ గాని, మరొకరుగాని చేయగా నేను వినలేదు. మానవహృదయాన్నీ, మనస్సునీ స్పృశించడానికి అవసరమైన సర్వ పరికరాలూ అతినిపుణంగా, అత్యంతశక్తిమంతంగా ప్రయోగించబడినవి. ఆ నైపుణికీ, ఆశక్తికీ వెనుక ఆ వక్త తన తోటి మానవులపట్ల తనకు గల విధిని నిర్వర్తించేందుకు అమితావేశంతో ఆత్మార్పణ చేసినవాడు అన్న దృఢవిశ్వాస మొకటి స్ఫురించి, శ్రోతల హృదయంలో గాఢంగా నాటుకుపోయింది. ఈ హృదయపూర్వక నివేదనము ఆయన యుక్తులను శ్రోతల మేధలగుండా తిన్నగా హృదయాలలోకి పంపి, అక్కడ శాశ్వతంగా తిష్టవేసుకొనేటట్టు చేసింది. నేను బానిస వ్యవస్థా నిర్మూలనవాదపు వాతావరణంలోనే పెరిగాను. బానిసతనానికి సంబంధించిన ఏ అంశంలో అయినా లింకన్ కంటె చాలాఎక్కువ తీవ్రవాదిగా ఉండేవాణ్ణి. అయినప్పటికీ ఆ ఉపన్యాసం ముగిసేసరికి 'కాన్సాస్ - నెబ్రాస్కా బిల్లు' క్రూరత్వాన్ని గూర్చి అంతకుముందు నాకు తెలిసింది చాలా తక్కువ అనిపించింది. పూర్వం ఎన్నడూ ఎరుగనంత ఎక్కువగా బానిసలపట్ల జరుగుతున్న అత్యాచారాల విషయంలో ఒక పౌరుడుగా నేను నిర్వర్తించవలసిన విధులను, బాధ్యతలను గూర్చిన భావాలు నాలో పెల్లుబికినవి.

అటుతరువాత క్లే, వెబ్‌స్టర్ల పరంపరలో దేశంలో తయారైన మహావక్తలందరి ప్రసంగాలూ విన్నాను. కాని, వక్తృత్వంలో విజయ కిరీటం నేను లింకన్ తలమీదనే పెడ

తాను. వక్తృత్వమార్గాలన్నిటిలోను ఆయన సిద్ధహస్తుడు కాకపోవచ్చు; కాని, వేదికపై ఉపన్యాసం చేసి సంశయాత్ములనూ, ప్రతికూలాభిప్రాయులనూ తన వాదంలోకి త్రిప్పుకోగల ప్రజ్ఞలో మాత్రం లింకన్ నిరుపమానుడు.

తర్వాత ఆయన ఉపన్యాసాలు అనేకం విన్నప్పటికీ, ఆ తొలి ఉపన్యాసం నాటి లింకన్ రూపమే నా కళ్లలో మసలుతూ ఉంటుంది. పొడుగాటి మెలికలు తిరిగిన శరీరం, అలాగే పొడుగ్గా మెలికలుతిరిగి ఉండే చేతులూ కలిగి అప్పుడప్పుడు ఆవేశంతో మరింత మెలిచుట్టుకుపోయే వాడు. నిరతరం కదుల్తూ ఉండే ముఖం స్వేదపూర్ణమై శిరఃప్రకంపనలతో ఆ స్వేదబిందువులు చిందిపడుతూ ఉండేవి. ఏమంత ఆకర్షణీయమైన మూర్తి కాకపోయినా, అందవికారమైన విగ్రహం కూడా కాదు. ఉపన్యాసం కొన్ని నిమిషాలు సాగి, ఆయన బాగా వేడెక్కి విషయంలో నిమగ్నుడయ్యే సరికి శ్రోతలకిక ఆయన అందమైనవాడా కాడా అనే ఊహ తోచదు. ఆయన మాటలలో ఉండే ఆకర్షణ ముందు శరీరసౌందర్యాన్ని గూర్చిన ఆలోచన మరుగుపడి పోతుంది.

1858 నాటి ఎన్నికల ప్రచారోద్యమాన్ని గూర్చి చెబుతాను. ఆ సంవత్సరం జరుగుతూన్న రిపబ్లికన్ పక్ష రాష్ట్ర సమావేశానికి హాజరయేందుకు మా పత్రికవాళ్లు నన్ను స్ప్రింగ్‌ఫీల్డ్ నగరం పంపించారు. జూన్ 17 న అభిప్రాయవైవిధ్యం ఎక్కువగా ఉన్న సభలో లింకన్ చేసిన ప్రసంగాన్ని దగ్గరనుంచి వినే అవకాశం మళ్లీ నాకు లభించింది.

అది వ్రాసుకొచ్చి చదివిన ఉపన్యాసం. ఆయన ఆ విధంగా చెయ్యడం మరెప్పుడూ నేను చూడలేదు. చదవడం పూర్తి అయిన తరువాత ఆ ప్రతి నా చేతిలో పెట్టి, నన్ను 'స్టేట్ జర్నల్' ఆఫీసుకు వెళ్లి, దాని తాలూకు ప్రూఫ్‌లు చూడవలసిందని చెప్పాడు. అప్పటికే అది 'కంపోజ్' అయింటుందేమో అనుకున్నాను. నే నా పని పూర్తిచేసేలోపుగా లింకనే స్వయంగా 'స్టేట్ జర్నల్' ప్రెస్‌లోకి వచ్చి రెండవ ప్రూఫ్ సరిచూచాడు. తా నా ప్రసంగం చాలా కష్టపడి తయారుచేశాననీ, తాను తయారుచేసిన ప్రసంగం తప్పులు లేకుండా యథాతథంగా ప్రజల ముందుకు వెళ్లాలని తాను కోరుతున్నాననీ అన్నాడు. తన స్నేహితులు కొందరు మొదటి పేరగ్రాఫ్ విషయంలో తనను చీవాట్లు పెట్టారట! దానిని మార్చటంగాని, పూర్తిగా తగ్గించటంగాని చెయ్యమన్నారట! కాని, వాళ్ళకంటే తా నా విషయాన్ని ఎక్కువ గాఢంగా తరచినట్లు తన విశ్వాసమనీ, ఏమి జరిగినా సరే ఆ ప్రతిలో అక్షరం మార్పు చేయననీ కూడా ఆయన అన్నాడు.

సెప్టెంబరు 18 న ఇద్దరు అభ్యర్థులూ ప్రసంగించే నాలుగవ ఎన్నికల సభలో పాల్గొనేందుకు కోల్స్ మండలంలోని చార్లస్టన్ నగరానికి మేము వెళ్లాము. ఆ సభకి వచ్చినంతమంది జనం మరే సభకీ రాలేదు. గ్రామీణులు అన్ని వేపుల నుంచి ప్రవాహాలుగా వచ్చి పడ్డారు. అక్కడకు వచ్చే రైలుమార్గం ఒకటే ఉంది. ఒకే ప్రత్యేకపు రైలు వేశారు. అయినప్పటికీ, నా దృష్టిలో ఒటావా, ఫ్రీపోర్టు

నగరాలలో కంటె కూడా ఎక్కువ మంది జనం వచ్చినట్టు అనిపించింది. ఆ ఎన్నిక సభల పరంపరలో అటుతర్వాత జరిగిన జేర్స్‌బర్గ్ సభను మినహాయిస్తే అంత ఎక్కువమంది జనం మరే సభకు రాలేదు. వెనుకటి సభలు ప్రజలలో సంచలనం కలిగించి, ఎన్నికల జ్వరాన్ని ప్రకోపింపచేసి ఉన్నందువల్ల అప్పుడు ఎన్నికల ఉద్యమం తారస్థాయిలో నడుస్తూంది.

ఒహ్యాయియో ఛార్లస్‌టన్ నగరంనుండి 'న్యూయార్క్ ఈవెనింగ్ పోస్ట్' పత్రికకు పంపిన లేఖలో ఇలా వ్రాశారు: "రాజకీయాలపట్ల ఇక్కడ ప్రజలు చూపుతూన్న శ్రద్ధ దిగ్భ్రమ గొలుపుతున్నది. చెట్లు చేమలు లేని మరుభూము లలో ఎర్రని ఎండలో కాలినడకను, గుర్రాలమీదను, గుర్రపు బగ్గీలమీదను మైళ్ళకొలది దూరము ప్రయాణిస్తూ తండాలు తండాలుగ అత్యుత్సాహంగా జనం వస్తున్నారు. స్త్రీలు, పురుషులు, బాలురు, వృద్ధులు, జబ్బుపడి పూర్తిగా కోలుకొనైనా కోలుకోనివారు, నెలలపాపల తల్లులు – అన్ని రకాలవారు ధూళిమేఘాలను రేపుతూ వచ్చి సభ జరిగే పట్టణం జేరుకొంటున్నారు. కూచునేందుకు స్థలమైనా దొరికే ఆశలేదు. ఆహారపదార్థాలు దొరికే అవకాశం మరింత తక్కువ. సభాస్థలమువద్ద గంటలకొద్దిసేపు నిరీక్షిస్తూ తమలోతాము మాట్లాడుకుంటూ, చర్చించుకుంటూ, తీవ్ర వాదోపవాదాల్లోకి దిగుతూ ఉంటారు; ఒక్కొక్క ప్రతినిధి వర్గమే ఊరేగింపుతో వచ్చినపుడల్లా ఆకాశంలోకి చేస్తే

తుపాకుల మ్రోత, బ్యాండువాద్యాల సవ్వడి, పతాకాల విలాసం, జనంచేసే హర్షధ్వనాలు, ఈసందడి అంతటిమధ్యా- సర్వరోగాల నివారణకు గ్యారంటీ ఔషధాల దగ్గరనుంచికొనే వారికి వీలుగా ఉండేట్లు ముక్కలుగాకోసి అమ్మే పుచ్చకాయబద్దలవరకూ వివిధ వస్తువులనమ్మే వీథివర్తకుల కేకలూ; — ఆ సంరంభం వర్ణింప నలవికానిది.

"సభా ప్రారంభసమయం చేరువ కాగానే దుమ్ము మేఘాలు రేపుతూ వేదికవంకకు అడావిడిగా పరుగెత్తుతారు. అప్పుడు వక్తలు — జెండాలతో బ్యాండు వాద్యాలతో, చుట్టూ హర్షధ్వానాలు చేసే తమపార్టీ అభిమానులతో వేదికను సమీపిస్తారు. వారు సభాస్థలిలో అడుగు పెట్టడంతో జనంలో ఆరంభమయ్యే హర్షధ్వానాలు ఆ వక్తలు వేదిక ఎక్కేసరికి తారస్థాయి నందుకుంటాయి. సుదీర్ఘమైన, ఉత్సాహభరితమైన హర్షధ్వానాల మధ్య ఆ వక్తలను పరిచయం చేయటం జరుగుతుంది. తరువాత శ్రోతలు నుంచునో, కూర్చునో చాలా ఓపికగా ఉపన్యాసాలు ఆసాంతం విని, సభ పూర్తికాగానే తిరుగు ప్రయాణాలకు సన్నాహాలు మొదలుపెడతారు. తప్పిపోయిన తమవారిని వెతుక్కొని తమ తమ బగ్గీలలో వచ్చినవారందరినీ మళ్ళీ పోగుచేసుకొని, ప్రొద్దు క్రుంకుతూ ఉండగా మళ్ళీ ఆ మరుభూముల కడ్డంపడి స్వస్థానాలు చేరుకుంటారు."

లింకన్, డగ్లస్ లిద్దరూ [illegible] దూరాన ఉన్న మట్టూన్ దగ్గరే రైల్వే[illegible] నిరీ

క్రీస్తూన్న తమ పార్టీ అభిమానుల వెంట బయలుదేరారు. మట్టూన్ అప్పటికి ఇల్లినాయిస్ సెంట్రల్ రైల్వేలైనుమీద ఔత్తరాహులు నివసించే ఒక చిన్నపట్టణం. ఇంచుమించు ఆ పట్టణంలోని జనాభా అంతా లింకన్ వెంట చార్లస్టన్ బయలుదేరారు. ఆయన ఊరేగింపులో యూనియన్‌లోని 32 రాష్ట్రాలనూ సూచిస్తూ 32 మంది యువతులుగల ఒక రథంకూడా ఉంది. ఆ విషయాన్ని సూచిస్తూ ఆ 32 రాష్ట్రాల జెండాలు ఆ రథానికి కట్టారు. ఆ రథంవెనుక "స్వాతంత్ర్యాన్నభిలషించే కన్సాస్ రాష్ట్రము" అని వ్రాయబడిన ఒక అట్ట చేత పుచ్చుకొని ఒక యువతి గుర్రం మీద వెళుతూంది. ఆమె చాలా అందంగా ఉండడంవల్ల ఎప్పుడూ ఆమె స్వతంత్రురాలుగా ఉండడం సాధ్యం కాదేమో - అని మే మనుకున్నాం. కావ్యకన్యకలకుకూడా ప్రాతినిధ్యం తక్కువగా లేదు. రథానికి ఒకప్రక్కన ఈ పద్యం వ్రాయబడివుంది :

"సామ్రాజ్య శుభతార పశ్చిమమ్ముగ సాగు
తనతల్లి 'క్లే' నెటులో, రాజ్యకన్యక యట్లె
లింకనును వరియించు - నేడు."

(Westward the star of empire takes its way;
The girls link-on to Lincoln, as their mothers did to Clay.)

డగ్లస్ ఊరేగింపుకూడా ఇలాగే బ్రహ్మాండంగా సాగింది. ఆయనకూ యువతులతోడి రథముంది; పైపెచ్చు ఒక ఆశ్వికదళంకూడా ఆ ఊరేగింపులో ఉంది. ఆ రెండు

ఊరేగింపులూ ఆ రోడ్డు వెంట ఇంచుమించు అనంతంగా సాగి పోయినవి. జంగమములైన రెండు ధూళిమేఘాలు ఆ ఊరే గింపుల ననుసరించినవి.

చార్లస్టన్ సభకు ముందు లింకన్‌కు (సెనేటర్ ట్రంబుల్ వద్దనుంచి అనుకొంటాను) కొన్ని పత్రాలు అంది నవి. డగ్లస్ 1856 లో కన్సాస్ రాష్ట్రాన్ని - దాని రాజ్యాంగం విషయంలో ప్రజలు వోటుచేసే అవకాశం లేకుండా - యూనియన్‌లో కలపాలని యత్నించినట్లు రుజువు చేసే కొన్ని అధికారిక పత్రాలు అవి. వాటితో లింకన్ తన ప్రతిస్పర్థిని సమాధానం చెప్పుకోవలసి వచ్చే పరిస్థితిలో పెట్టేశాడు. ఆయన ఉపన్యాసం విని ఆనాడే మా పక్షం విజయం సాధించినట్లు మేము భావించాము.

# వాల్ట్ విట్‌మన్ దృష్టిలో లింకన్

నగరం బయట ఉన్న అధ్యక్షుని నివాసానికి వచ్చి పోయే త్రోవలో మా ఇల్లు ఉండడంవల్ల ఇంచుమించు ప్రతి దినం నేను ఆయనను చూసేవాణ్ణి. వేసవి రాత్రుళ్లు ఆయన ఎప్పుడూ వైట్‌హౌస్ (ప్రభుత్వ భవనం) లో గడపడు. నగరానికి మూడుమైళ్ళ ఉత్తరాన సైనికశిబిరం ఉన్న ఆరోగ్యకరమైన ప్రదేశంలోని 'సైనిక గృహం' ఆయన వేసవి మకాం.

ఈ ఉదయం (1863 ఆగష్టు 12) సుమారు 8-30 గంటలకు వెర్మాంట్ వీధిగుండా నగరంలోకి వస్తూన్న ఆయ

సను 'ఎల్' సందు దగ్గర నేను చూశాను. కత్తులుదూసి బుజాలమీద నిలువుగా పట్టుకొని ఉన్న 25, 30 మంది ఆశ్వికులు ఆయనను వెన్నంటి ఉన్నారు. ఈ రక్షణదళం పరివేష్టించి ఉండడం ఆయన వ్యక్తిగతాభిమతానికి విరుద్ధమని చెప్పుకుంటారు; అయితే ఆయన తన సలహాదార్ల (కౌన్సిలర్ల)ను కాదనలేకపోయాడు. యూనిఫారం విషయంలో కాని, అశ్వాల అలంకరణలోగాని ఆ పరివారం ఏమంత ఆకర్షకంగా ఉండదు. లింకన్ సాధారణంగా ఒక గోధుమ వన్నెగల మధ్యమ ప్రమాణంలో ఉండే గుర్రంమీద బయలుదేరుతాడు. మాసిపోయినట్టు కనిపించే నల్లని సాదాదుస్తులు ధరిస్తాడు; ఒక నల్లని ముతక టోపీపెట్టుకొని, అతిసాధారణమైన వ్యక్తిలాగ కనిపిస్తాడు. పసుపు పచ్చని పట్టీలు ధరించిన ఒకసైనికోద్యోగి (లెఫ్టినెంట్) ఆయనకు ఎడమప్రక్కగా స్వారీచేస్తూంటాడు. వారివెనుక పసుపు పచ్చని పట్టీలుగల జాకెట్లతో ఇద్దరేసి చొప్పున ఆశ్వికులు అనుసరిస్తూ ఉంటారు. అధ్యక్షుడు నెమ్మదిగాపోతూ ఉండడవల్ల వాళ్లు తమ గుర్రాలను మెల్లగానే నడిపిస్తూ ఉంటారు. సైనికుల ఖడ్గాలూ, దుస్తులూ మాత్రం సవ్వడిచేస్తూ ఉండగా, పూర్తిగా నిరలంకారంగా సాగే ఆ పరివారం లాఫాయెట్ స్క్వేర్‌ని సమీపించినా జనంలో ఎట్టి సంచలనమూ కలిగించదు; అక్కడొకడూ అక్కడొకడూ నగరానికి క్రొత్తగా వచ్చినవాళ్ళు మాత్రం ఆగి, విస్తుపోయి చూస్తూ ఉంటారు.

అబ్రహాం లింకన్ ముదురు మామిడిచిగురు వన్నె

ముఖాన్ని నేను బాగా పరిశీలనగా చూశాను. ముఖం మీద లోతుగా పడ్డ ముడుతలూ, ముఖ్యంగా ఆ కళ్లూ, ఎప్పుడూ ఏదో గాఢమైన విషాదాన్ని సూచిస్తున్నట్లు నా కనిపించేది. మేము పరస్పరం చేరువకు రాగానే అత్యంత ప్రీతిపూర్వకమైన అభివందన వినిమయం జరిగింది. ఒక్కొక్కప్పుడు అధ్యక్షుడు టాప్ దింపివేసిన బగ్గీలో వస్తూ ఉండడం కూడా కద్దు. దూసిన కత్తులతో ఆశ్వికులు మాత్రం ఎప్పుడూ ఆయనను వెన్నంటే ఉంటారు. సాయంత్రంపూట గాయటికి బయలుదేరినప్పుడుగాని, ఒక్కొక్కప్పుడు ఉదయం పెందరాడే ఇంటికి తిరుగుముఖం పట్టినప్పుడుగాని ఆయన 'కే' వీధిలో యుద్ధకార్యదర్శి అందమైన నివాసం ముందు ఆగడం, ఆయనతో కొంతసేపు సమాలోచనలు జరుపుతూ ఉండడం కూడా నేను గమనించాను. బగ్గీలో బయలుదేరినప్పుడుమాత్రం అయన క్రిందికి దిగకపోవడం స్టాంటనే ఆ బగ్గీ దగ్గరకు వచ్చి మాట్లాడడం మా కిటికీలోనుంచి నేను చూసేవాణ్ణి.

ఒక్కొక్కప్పుడు ఆయన కొడుకుల్లో ఒకడు – పదేళ్ల వాడో, పన్నెండేళ్లవాడో – ఒక చిన్నగుర్రంమీాద ఆయన కుడిచేతి ప్రక్కన స్వారీచేస్తూ ఆయన ననుసరించడం కూడా ఉంది. వేసవి ఆరంభంలో సాయంసమయాల్లో అప్పుడప్పుడు అధ్యక్షుడు దంపతీ సమేతంగా ఒక బగ్గీమీాద నగర దర్శనానికై విహారం బయలుదేరడంకూడా చూశాను. లింకన్ సతి నల్లని దుస్తులు ధరించి, ఒక పొడుగైన క్రేప్ సిల్క్ మేలి

ముసుగు తలమీద వేసుకుంటుంది. ఆలాంటి సమయాల్లో రెండు గుఱ్రాలూ, వాళ్లూ తప్ప వేరే పరివారమేమీ ఉండదు. ఒకసారి వాళ్లు నాకు బాగా దగ్గరగా వెడుతున్నారు. నేను అధ్యక్షుని ముఖంలోకి నిదానంగా లోతుగా చూశాను. శూన్యంలోకి చూస్తూన్నట్లున్న ఆయన చూపు నెమ్మదిగా నా కన్నులలోకి ప్రసరించింది. ఆయన అభివాదసం చేసి, మందహాసం చేశాడు. కాని, ఆ మందహాసం వెనుక ఎక్కడో లోతుగా నేనిందాక చెప్పిన విషాదభావం తళుక్కు మనడం నేను గమనించాను.

ఆయన చిత్రం వ్రాసిన ఏ చిత్రకారుడూ ఆ మనిషి ముఖంలోకి గాఢమైన, సూక్ష్మమైన అపరోక్షభావాన్ని తీసుకు రాలేకపోయాడు. ఆ ముఖంలో ఏదో ఉంది. 2, 3 శతాబ్దాల క్రితం మూర్తి చిత్రణలో సిద్ధహస్తులైన మహా చిత్రకారులు తప్ప ఆ భావం పట్టుకోలేరు.



# థియోడోర్ రూజ్‌వెల్ట్

**1858—1919**

['టెడ్డీ' రూజ్‌వెల్ట్ అమెరికా అధ్యక్షపీఠ మలంకరించిన వ్యక్తులందరిలోను ఎక్కువ ఆకర్షణ గల విలక్షణ వ్యక్తిత్వం కలవాడు. ఫ్రాంక్లిన్ డి. రూజ్‌వెల్ట్ కీయన దూరపు జ్ఞాతి. న్యూయార్క్‌లో జననం; హార్వర్డ్‌లో విద్యాభ్యాసం. న్యూయార్క్ నగరపు పోలీసు కమీషనర్ల బోర్డు అధిపతిగా ఆయన మొట్టమొదట ఎక్కువమంది దృష్టిని ఆకర్షించాడు. తరువాత, నౌకాదళ సహాయ కార్యదర్శి అయాడు. స్పానిష్-అమెరికన్ యుద్ధంలో ఒక ఆశ్విక దళాన్ని నడిపేందుకుగాను ఆ పదవి నీయన వదలిపెట్టాడు. క్యూబాలోని శాన్‌జువాన్ కొండల దగ్గిర జరిగిన యుద్ధంలో రూజ్‌వెల్ట్ పేరుతో ప్రసిద్ధమైన ఆ ఆశ్విక దళం ప్రధానపాత్ర వహించి, విశేష యశస్సు నార్జించినది.

ఒకసారి న్యూయార్క్ రాష్ట్ర గవర్నరుగా పనిచేసిన తరువాత అమెరికా ఉపాధ్యక్షుడుగా ఎన్నికయాడు. 1901 సెప్టెంబరులో

మెక్కిన్లీ మరణానంతరం అధ్యక్షుడయాడు. 1904 ఎన్నికలలో అధ్యక్షపదవికి ఎన్నుకోబడి, 1919 వరకూ ఆ పదవిలోనే ఉన్నాడు. అటుతరువాత ఒక ఎన్నికలో రిపబ్లికన్ వోట్లు చీలదీసి టాఫ్టు ఓటమికీ, విల్సన్ ఎన్నికకూ కారణం అయినాడు.

'టెడ్డీ' అన్వేషకుడు (Explorer); యాత్రికుడు; నిపుణవ్యాఖ్యయుడు; సమర్థ రచయిత. అలసు ఎరుగని ఆయన కార్యదక్షతనూ, నిండయిన ఆయన మందహాసాన్నీ, తరచు ఆయన వాడే "బుల్లీ" "డిలైటెడ్" లాంటి మాటలను గూర్చి అమెరికాలో కథలు కథలుగా చెప్పుకుంటారు.

శాన్‌జువాన్ కొండ ముట్టడికి సంబంధించిన ప్రస్తుత భాగం "టెడ్డీ" సమకాలికుడైన సి. ఇ. బాంక్స్, లిరాయ్ ఆర్మ్‌స్ట్రాంగ్ లు వ్రాసిన ఆయన జీవిత చరిత్ర (1901) నుండి గ్రహించబడినది.]

# రూజ్‌వెల్ట్ ఆశ్వికదళం శాన్‌జువాన్ కొండ ముట్టడి

ముట్టడికి సంసిద్ధులుగా ఉండండని 1898 జూన్ 30 వ తేదీన తాఖీదు రావడంతో చికాకెత్తిస్తూన్న నిరీక్షణా కాలం ముగిసింది. మరుసటి రోజు మధ్యాహ్నం రూజ్‌వెల్ట్ ఆశ్వికదళంవారు అక్కడనుంచి మకాం ఎత్తి మిగిలిన దండయాత్ర దళాలన్నిటితోను కలసి ముందుకు సాగారు. ఆ రాత్రి ఎల్‌పోసో కొండశిఖరం మీాద నిద్రించారు. అక్కడ కొన్ని శిథిల భవనాలున్నాయి. సైనికులకు ఆహారపదార్థాలు కూడా లభించడంవల్ల వాళ్ళ ప్రాణాలు లేచివచ్చినవి. ఆ మకాములో ఆ సైనికులకు తమ కన్నల్ గుణాలు మళ్ళీ

ఒకసారి రుజువైనాయి. ఆ సైన్యాల కన్నిటికీ తాను అధిపతి అవడంవల్ల ఆయన అక్కడ ఉన్న భవనాలలో ఒక దాన్ని తన నివాసంగా స్వీకరించవచ్చు. కాని, ఆయన తన సైనికులతోపాటు ఆరుబయటనే గుర్రపు జీను తలగడగా, వానకోటు అంగరక్షగా శయనించాడు.

తెల తెలవారుతూండగానే సైనికులు నిద్ర లేచి నాడు ప్రారంభంకానున్న యుద్ధానికి సన్నద్ధులవుతున్నారు. ఆరుగంటలయేసరికి కుడిప్రక్కగా ఫిరంగుల మ్రోత సాగింది. శాంటియాగో నగర బాహ్యకేంద్రాలను పశపర్చుకోవడం కోసం తీవ్ర సమరం ఆరంభమైంది. ఆ సైనికులు ముందుకు సాగడానికి ఉద్యమిస్తున్న సమయంలో కర్నల్ రూజ్వెల్ట్ గాయపడ్డాడు. ఆ యుద్ధమంతటిలో ఆయనకు తగిలిన గాయ మదొక్కటే! ఒక స్పానిష్ తుపాకీగుండు వచ్చి ఆయన తల మీదుగా పేలింది. దానిలోని ఒక తునుక ఆయన మణి కట్టులో గుచ్చుకుంది. ఏమంత పెద్దగాయం కాలేదు; ఎక్కువ బాధా కలిగించలేదు. ఆ సైన్యంలోని మిగిలిన అందరికంటె ఎక్కువ చొరవగా ఆయన ప్రవర్తించినప్పటికీ తరువాత ఆయనకు మరే గాయమూ తగులలేదు. శాన్ జువాన్ నదిని దాటవలసిందని ఆ ఆశ్విక దళానికి తాఖీదు వచ్చింది. అనంతర కర్తవ్యం తరువాత తెలుపుతామన్నారు. నదిని దాటగానే ఒక సన్నని మురికి సందు ఉంది. దాని కిరుప్రక్కలా తీగెతో అల్లిన దడులు; ఆ దడుల వెనుక విశాలమైన మైదానాలూ ఉన్నవి.

పదిగంటలకు యుద్ధం బాగా రాజుకుంది. ముఖ్యంగా కుడివేపు నుంచే విజృంభిస్తూంది. 'మాసర్' రైఫిలుల తాలూకు గుళ్ళు శరపరంపరగా అమెరికనుల తలలమీాదుగా దూసుకుపోతున్నవి. అక్కడ లభ్యమైన ఏ రక్షణక్రింద దాక్కున్నా, ఒక్కొక్కప్పుడు అవి వాళ్ళను గాయపరుస్తూ కూడా ఉన్నవి; వారు ముందుకు సాగాలనుకున్నారు; కాని, ఎదురుచూచిన తాఖీదు 11 గంటలకుగాని రాలేదు. అప్పుడు షాఫ్టర్ సేనానికి ప్రతినిధి అయిన లెఫ్టినెంట్ మిలే అనిష్టంగానే పురోగమనానికి అనుజ్ఞ ఇచ్చాడు. తత్క్షణం కర్నల్ రూజ్‌వెల్ట్ టెక్సాస్ అనే తన అశ్వాన్ని అధిరోహించి కర్నల్ ఏ స్థానంలో ఉండాలో ఆ స్థానంలోనే, అనగా – దళానికి వెనుకగా తన అశ్వాన్ని పోనిస్తూ తన దళంవారినందరినీ ప్రోత్సహిస్తూ, ముందుకు సాగుతున్నాడు. ఆ సైన్యం కొన్ని పటాలాలుగా (Platoons) చీలి పురోగమిస్తూంది. ఒకసారి – తన దళం ముందు భాగంలోని ఆశ్వికులు క్రమంగా తమ ఎడమప్రక్కను వస్తూన్న కాల్బలంతో కలసిపోతూ ఉండడం చూసి ఆయన చరచరా తన దళం అగ్రభాగానికి అనగా నీగ్రోల దళమైన 9-వ దళం వెనుకకు వెళ్ళి సర్దుబాటు చేశాడు.

మొదటి కొండ శిఖరం చేరుకునేసరికి – అమెరికనులు స్పానిష్ స్థావరాలకు 500 ల గజాల దూరంలోకి వచ్చేశామని గ్రహించారు. రైఫిల్ తూటాలతో శత్రువులను నిర్మూలింప జూచే ప్రయత్నం నిరర్థకమని కర్నల్ హామిల్టన్‌కి

స్పష్టమైంది. ఆయన కాల్బలాలను నడుపుతూన్న ఉద్యోగులతో "ఈ కొండలను ముట్టడించడంలో మీకు సహాయపడాలని నాకు తాఖీదిచ్చారు"అన్నాడు. కాని, ఆ ఉద్యోగులు – "మళ్లీ తాఖీదు వచ్చేవరకూ ఎదురుచూడడం తప్ప ఏమీ చెయ్యవద్దని మాకు వచ్చిన ఆదేశం" అన్నారు. అది చాలా విపత్కరమైన ప్రదేశం. శ్పానిష్ సైన్యాలు ఎడతెరిపి లేకుండా కాల్పులు జరుపుతున్నవి. ఆ శత్రు సైన్యంలోని తుపాకిదళంవారు పొగరాని తుపాకీ మందు వాడుతూ ఉండడం వల్ల వాళ్లమీద మళ్లీ ప్రతీకారం జరపడానికి వీల్లేక పోయింది. ఆ పరిస్థితులలో రూజ్‌వెల్ట్ అంతకు ముందు పౌరజీవితంలో ప్రదర్శించిన ఉదాత్త గుణాలను సైనికరంగంలో కూడా ప్రదర్శించే అవకాశం లభించింది.

"మీ ముట్టడిలో మీకు సహాయపడాలని నాకు వచ్చిన ఆదేశం" అన్నాడు రూజ్‌వెల్ట్.

"అయి ఉండవచ్చు" అన్నాడు కాల్బలం అధిపతి.

"ఇంకా మీరు పురోగమించడానికి ఆదేశం కోసం ఎదురుచూస్తూ కూర్చున్నారు!"

"ఔను!"

"అయితే సరే!" – అని సైనికాదేశాలియగల ఉన్నతోద్యోగి (Ranking Officer) అక్కడఎవరైనా ఉన్నాడేమో అని చుట్టూ ఒకసారి కలయజూచి – "ఇక్కడ ఉన్న వారందరిలోకీ నేనే ఉన్నతోద్యోగిని. ముట్టడికి నేను అనుజ్ఞ ఇస్తున్నాను" అన్నాడు గంభీరంగా.

కాల్బలం అధిపతి నిర్విణ్ణుడయాడు; తటపటా యించాడు.

"మీరు రాకుంటే నా దళమే ముందుకు సాగిపో తుంది" అన్నాడు కర్నల్ రూజ్‌వెల్ట్. ఆ మాట అన్న తత్ క్షణం ఆశ్వికదళంలోని అగ్రశ్రేణివారు స్పెయిన్ సైన్యాల గుండ్లవర్షాన్నికూడా లక్ష్యంచెయ్యకుండా ముందుకి సాగారు. తమ నాయకునిపట్ల రెట్టించిన గౌరవ భావం, ఆయన వారిలో రేకెత్తించిన యుద్ధోత్సాహం వారిని పర వశులను చేసినవి.

వా రలా బయలుదేరే సరికి కాల్బలంకూడా వెనుక దిగబడి ఉండలేక పోయింది. వారు కూడా అశ్వదళంతో పాటు శత్రువుమీదికి ముందుకు నడిచారు. కర్నల్ రూజ్ వెల్ట్ గుర్రంమీద స్వారీచేస్తున్నందువల్ల తుపాకులు పేలుస్తూ ముందుకు సాగుతున్న కాల్బలంకంటె వడి వడిగా పోతూ ఆ కాల్బలాలను అదుపులో ఉంచడంలో ఆయా ఉద్యోగులకు సహాయపడుతూ వచ్చాడు. ఏ ప్రదేశాలనుంచి ముట్టడి విజయవంతంగా సాగించవచ్చో ఆ స్థలాలను నిర్దేశించేవాడు. ఆ సందు ప్రక్కనున్న తీగె కంచెమీదుగా మూడవసారి తన గుర్రాన్ని దూకించిన తరువాత రూజ్‌వెల్ట్ ఆ గుర్రాన్ని వదిలేసి కాలినడకనే చేతిలో టోపీ ఎగరవేస్తూ తన మను ష్యులను ప్రోత్సాహపరుస్తూ పరువులు పెట్టసాగాడు. ఆ కొండచరియ అంతా సైనికమయమై పోయింది. ఆశ్వికదళం,

కాల్పులం ఒకదానితో ఒకటి కలసిపోయి కొండకెగ్రబాకు తున్నవి.

అంతకుముందు శత్రువు ఆక్రమించుకొని యుండిన రక్షణ స్థావరాలను వారు ఒకదానివెంట ఒకటిగా పునరాక్రమించుకుంటూ పురోగమించారు. అట్టి రక్షణ స్థావరాల్లోఒకదాంట్లో కర్నల్ రూజ్‌వెల్ట్ తన మనుష్యులకు నేలమీద సాగిలబడి మరింత అనుకూల పరిస్థితికోసం నిరీక్షించవలసిందని ఆదేశించాడు. తిరిగి అక్కడినుంచి బయలుదేరబోయే వేళకు అంతా గందరగోళంగా ఉంది. ఇరుపక్షాల కాల్పులూ నిరంతరాయంగాను, అధిక వినాశకరంగాను సాగుతున్నవి. కుడివేపున ఉన్న గాట్లింగ్ తుపాకిదళం శత్రువులైన స్పెయిన్ వారికి అశుభ సూచకంగా గర్జిస్తూంది. కర్నల్ రూజ్‌వెల్ట్ తన దళాన్ని బయలుదేరమని ఆదేశించాడు. కాని అతని గొంతు వారికి వినిపించలేదు. తాను మాత్రం కందకంలో నుంచి బయటకుదూకి ముందుకుసాగాడు. అతనికి చేరువలో నున్న నలుగురు మాత్రం అతనిని అనుసరించారు. ఒక వందగజాలు ముందుకుసాగినతరువాత ఆదళం తనవెంట రావడంలేదని అతడు గుర్తించాడు. వెంటనే అతడు తనతో వచ్చిన నలుగురినీ అక్కడ ఉన్న గడ్డిపొదల మాటున దాగి ఉండమని, తాను వెనుకకు వెళ్లి మిగిలిన వారందరినీ తీసుకువస్తానని చెప్పి బయలుదేరాడు. అలా చేయటంలో ఆభిప్రాయమేమంటే - తాను ముగ్గురు నలుగురు మనుష్యులతో అయినా వెనుదిరిగివస్తే తన మనుష్యులు అన్యథాభావించి

నిరుత్సాహపడవచ్చుననీ. ఆ నలుగురు అశ్వికులూ ఆయన సూచనకు అడ్డుచెప్పలేదు. వాళ్లు నేలనంటి పెట్టుకొనేఉండి, తమ కెదురుగా శత్రుసైనిక శ్రేణిలో తలలు పైకిలేచి నప్పుడల్లా కాల్పులు జరుపుతున్నారు.

తనదళం వారు వెన్వెంటనే తన ఆదేశాన్ని పాలించనందుకు కర్నల్ రూజ్‌వెల్ట్‌కి చికాకు కలిగింది. వెనక్కు పరుగెత్తుకువెళ్ళి, వాళ్లమీద అరిచాడు: "ముందుకు సాగమని నేనాదేశిస్తే మీరెందుకు కదలలేదు?" వారు నిర్విణ్ణులయారు. "మాకు మీ కంఠం వినిపించలేదు కర్నల్!" అని సంజాయిషీ చెప్పుకున్నారు. వెంటనే ఆ దళమంతా అతని వెంట బయలుదేరింది. కాల్పులంలోని వాళ్లు కూడా కొందరు అనుసరించారు.

వారందరూ ఆ కొండ శిఖరప్రాంతం చేరుకొనేసరికి స్పానిష్ సైన్యాలు ఆ అమెరికన్‌దళం సాహసానికి ఆశ్చర్యపడుతూ, అక్కడ ఉన్న అద్భుతమైన రక్షణస్థావరాలను వదులుకొని, కొండచరియల మీదుగా క్రిందికి పలాయనం చిత్తగించినవి. రూజ్‌వెల్ట్ అశ్వికదళంవారూ, ఇతర దళాల వారూ కలసి ఆ విధంగా కొండశిఖరం ఆక్రమించుకోగానే ఆ దళాలలో బ్రహ్మాండమైన హర్షధ్వానాలు చెలరేగినవి. ఏమంటే – అక్కణ్ణించి దిగువగా కనుచూపు మేరలో శాంటి యాగో (క్యూబా లోనిది) తాలూకు తెల్లనిగోడలూ, ఎర్రని పెంకులు వేసిన ఇళ్ళకప్పులూ కనిపిస్తున్నవి.

జులై 1 వ తేదీనాటికి యుద్ధం ఆ విధంగా ముగిసింది.



# ఫ్రాంక్లిన్ డి. రూజ్వెల్ట్

**1882-1945**

తరచు పత్రికల్లోని పతాక శీర్షికలలో ఎఫ్. డి. ఆర్. అని వ్యవహరింపబడుతూ వచ్చిన ఫ్రాంక్లిన్ డి. రూజ్ వెల్ట్ రెండు పదవీ కాలాలకంటె అధికంగా అధికారంలో ఉండిన మొదటి అమెరికన్ అధ్యక్షుడు. హార్వర్డ్ విశ్వవిద్యాలయంలో పట్టభద్రుడయి మొదటి ప్రపంచ మహాసంగ్రామకాలంలో నౌకాదళశాఖ ఉపమంత్రిగా పని చేసి, 1920 లో ఆ ఉద్యోగానికి రాజీనామాయిచ్చి, ఉపాధ్యక్షపదవికి పోటీచేసి ఓడిపోయాడు. ఆ మరుసటి సంవత్సరం వ్యాధిగ్రస్తుడై, కొన్ని ఏళ్లపాటు ఆ వ్యాధితో పోరాడి, చివరికి ఎలాగో కోలుకున్నాడు. రెండు పదవీకాలాలపాటు న్యూయార్క్ రాష్ట్రం గవర్నరుగా పనిచేసిన తర్వాత, మొట్టమొదటిసారి 1932 లో అధ్యక్షుడుగా ఎన్నిక అయాడు. ఆర్థిక, సాంఘిక సంస్కరణలకు సంబంధించిన 'నూతన ప్రణాళిక' (New Deal) నేతృత్వమున్నూ, ద్వితీయ ప్రపంచ

మహాసంగ్రామ కాలంలో ఆయన ప్రదర్శించిన ప్రభుత్వ నిర్వహణ చాతుర్యమున్నూ జగద్విదితములు.

ఈ దిగువ పదచిత్రం - 1920 లో గవర్నర్ ఎమ్. కాక్స్‌కు పోటీగా రూజ్ వెల్ట్ పేరు ప్రతిపాదింపబడిన వెంటనే 'ఇండిపెండెంట్' పత్రికకు రిచర్డ్ బోకల్ వ్రాసిన వ్యాసం.]

# నిత్యయౌవనుడైన రూజ్ వెల్ట్

ఫ్రాంక్లిన్ రూజ్ వెల్ట్ యువకుడు. అతని యౌవనమూ, దానిలో ఒక భాగమే అయిన స్నేహశీలము - ఇవి రెండూ ఉపాధ్యక్ష పదవికి నేటి డెమోక్రటిక్ పక్షాభ్యర్థిలో ప్రముఖంగా కనిపించే లక్షణాలు. అతడు జాగిలమంత స్నేహపాత్రుడు, వయోధికుడుగా కనుపిస్తే బాగుండు ననిపించేటంత యౌవనభావ విలసితుడు.

రూజ్ వెల్ట్‌తో మాట్లాడేటప్పుడు చాలా ఇతర విషయాలుకూడా మనను ఆకర్షించవచ్చుగాని, ప్రధానంగా కొట్టవచ్చినట్టు కనిపించేది మాత్రం అతని యౌవనమే! అతని వయస్సు 38 ఏళ్లు; వంపులు తిరిగివుండే ఆ జుట్టువల్లా, కసరత్తుచేసినట్టుండే ఆ అవయవసౌష్ఠవమువల్లా చాలా చిన్నవాడుగా కనబడతాడు.

తన రాజకీయ జీవిత ప్రగతిలో తాను లేతగా కనుపించడం ఒక పెద్ద ప్రతిబంధకంగా ఉన్నట్లు ఆయన ఎప్పుడూ భావించేవాడు. కాని, ఈవిషయంలో శాన్‌ఫ్రాన్‌సిస్కో సమావేశానంతరం అతని అభిప్రాయం మారిఉండవచ్చు.

దూరదృష్టిగల రాజనీతివేత్త అవడంవల్ల, ఆయన ఆనాడే మున్ముందు తానధ్యక్షపదవికి ప్రతిపాదింప బడనుండడం గుర్తించి ఉండవచ్చు; వాషింగ్టన్‌లో మాత్రం ఎవరూ ఆ నాడీవిషయాన్ని ఊహించలేదు. ఆమహాసభలోని అతని ప్రవర్తనకూడా అతడు అధ్యక్ష పదవిని ఆశిస్తున్నట్లు సూచించలేదు.

జీవితంలో అతని విజయానికి అతనిపేరు చాలా వరకూ కారణమనడం నిర్వివాదాంశం. ఈ దేశానికి రూజ్ వెల్ట్ పేరంటే తగని అభిమానం. అందరు రూజ్‌వెల్ట్‌లూ ముక్కుకు సూటిగా పోయేవారే అనే విశ్వాసం ప్రజల్లో వ్యాపించి ఉంది. రూజ్‌వెల్ట్ వంశీకుల్లో రిపబ్లికన్ పక్షంలో ఉన్నవాళ్ళు (వీళ్లే ఎక్కువమంది) వోట్ల అభ్యర్థనలో డెమోక్రాట్లుకూడా రూజ్‌వెల్ట్‌పేరు విషయమై ప్రస్తావిస్తూ ఉన్నందుకు ఎప్పుడూ చికాకు పడలేదు.

ఈ ఫ్రాంక్లిన్ రూజ్‌వెల్ట్ కర్నల్ రూజ్‌వెల్ట్ కేమౌతాడు? ఆ మహాపురుషుడికీయన అయిదవ తరం జ్ఞాతా? లేక రెండవ తరం జ్ఞాతా? ఏ విషయంలోఅయినా ఈయనకు టి. ఆర్ (థియోడోర్ రూజ్‌వెల్ట్)తో పోలిక లున్నాయా? ఉపాధ్యక్షపదవికి డెమొక్రటిక్ పక్షాభ్యర్థి విషయమై ఈ ప్రశ్నలు తరుచు వినిపిస్తున్నవి.

ఈయన తండ్రి జేమ్సు రూజ్‌వెల్ట్ థియొడోర్ రూజ్‌వెల్ట్‌కి నాల్గవతరం జ్ఞాతి. ఈయన సోదరుడైన జేమ్సు రూజ్‌వెల్ట్ కూతురును కర్నల్ రూజ్‌వెల్ట్‌కి సోదర

పుత్రుడైన థియోడోర్ డగ్లస్ రూజ్‌వెల్ట్ కిచ్చారు. ఈయన భార్య ఎలియనార్ రూజ్‌వెల్ట్ కర్నల్ రూజ్‌వెల్ట్‌కి సోదరుడైన ఇలియట్ రూజ్‌వెల్ట్ పుత్రిక.

ఇక ఈ ఇద్దరికీ గల సంబంధాన్ని మీరే ఊహించుకోండి! రూజ్‌వెల్ట్‌నే ఈ ప్రశ్న అడిగినప్పుడు పూర్వాధ్యక్షునికి తాను 'దూరపు బంధువు'ననీ, ఆ బాంధవ్యం జ్ఞాపకం ఉంచుకోడానికిగాని, వివరించి చెప్పడానికిగాని దుష్కరమైనంత తికమకలతో కూడినదనీ అంటాడు.

తన సోదరి పుత్రిక డెమొక్రటిక్ పక్షానికిచెందిన ఈ ఫ్రాంక్లిన్ రూజ్‌వెల్ట్‌ను వివాహం చేసుకోదలచినప్పుడు దానికి తన ఆమోదం తెలుపడం తప్ప కర్నల్ రూజ్‌వెల్ట్ ఈ రూజ్‌వెల్ట్‌కి చేసిన సహాయం వేరేమీలేదు. రాజకీయాలలో ఆయన సహకారంగాని, కనీసం సలహా సంప్రతింపులుగాని ఈయన కెన్నడూ లేవు. రాజకీయాలనుగూర్చి ఫ్రాంక్లిన్‌కి తెలిసిన సమస్తమూ స్వయంకృషివల్ల తెలిసికొన్నదే. న్యూయార్క్ రాష్ట్రప్రభుత్వోద్యోగాలలో ఉన్న డెమొక్రటిక్ పక్షం వారందరి తాలూకు పేర్లూ, సంగ్రహ జీవితచరిత్రలూ గల 8 అరల ఒక పెద్ద మేజాబల్ల ఆయన ఆఫీసులో ఉండడమే ఆయన ఎంతో రాజకీయ పరిజ్ఞానం కలవాడనటానికి ప్రబల నిదర్శనం.

పత్రికల్లో ఫ్రాంక్లిన్ రూజ్‌వెల్ట్ జీవితచరిత్ర వ్రాసిన వారు ఈ రూజ్‌వెల్ట్‌కి, ఈయన 'దూరపు బంధువు'కీ మధ్య గల కొన్ని సామ్యాలను పేర్కొన్నారు. ఈ రూజ్‌వెల్ట్

రాజకీయ జీవితంలోని కొన్ని సంఘటనలు పూర్వాధ్యక్షుని రాజకీయ జీవితపరిణామాన్ని గుర్తుకు తెచ్చేవి ఉన్నప్పటికీ, వ్యక్తిత్వంలోను, అభిరుచులలోను, విధానాలలోను ఈ ఉభయులు పూర్తిగా విభిన్నులు.

ఉభయులూ హార్వర్డు విశ్వవిద్యాలయ పట్టభద్రులే! ఉభయుల రాజకీయ జీవితానికీ ఆల్బనీలోనే అంకురార్పణ జరిగింది. ఉభయులూ సరిగ్గా విదేశాలతో యుద్ధాలకు పూర్వం నౌకాదళ శాఖ ఉపమంత్రులుగా పనిచేశారు. ఉభయులూ యుద్ధకాలసేవలకు (అనగా ఒకరు ప్రత్యక్షంగా యుద్ధంలోను, మరొకరు వాషింగ్టన్‌లోనూ ఉండి చేసిన సేవలకు) ఫలితంగానే ఉపాధ్యక్షపదవికి అభ్యర్థు లయారు. ఇంతవరకు ఉభయుల మధ్య సామ్యమే గోచరిస్తుంది...

తన పార్టీ తరఫున అధ్యక్షపదవికి అభ్యర్థిగా నిల్చిన గవర్నరు కాక్సులాగానే ఫ్రాంక్లిన్ రూజ్‌వెల్ట్ కూడా తాను వాస్తవికమైన రైతునని సగర్వంగా చెప్పుకుంటాడు. తాను జన్మించిన న్యూయార్కు రాష్ట్రంలోని డచెస్ కాంటీలోని హైడ్ పార్కులో రూజ్‌వెల్ట్ సాగుచేసే పొలం నమూనా వ్యవసాయక్షేత్రం లాంటిది కాదు. బ్రహ్మాండంగా పంటలు పండే సువిశాలమైన క్షేత్ర మది.

ప్రభుత్వ నౌకాకేంద్రంలోని కార్మిక సంఘ నాయకులు జీతాలెక్కువ చెయ్యమని ఒత్తిడిచేసినప్పుడు ఆయన సానుభూతితో ఇలా అన్నాడు: "జీవిత వ్యయ ప్రమాణం పెరిగిపోవడం క్రమంగా ఒకక్లిష్టసమస్యగా పరిణమిస్తూంది.

ఈ మధ్య ఒకసారి నాభార్య ఆహారపదార్థాలకు చెల్లించే మొత్తాలు నేను కళ్లారా చూశాను. అవి దారుణంగా ఉన్నవి. ధరల పెరుగుదల నిరోధానికి ఏదో ఒకటి చెయ్యాలి. నావలె అయిదుగురు బిడ్డలూ, పదకొండుగురు నౌకర్లూ ఉన్న ఒక ఆసామీ జీవితం దుష్కరమనిపించేటంతగా పరిస్థితులు విషమిస్తున్నాయి.'' చిత్రంగా ఆయన 11 గురు నౌకర్లలోను ఎక్కువమంది వ్యవసాయ కార్మికులు.

వ్యవసాయ సమస్యే ఆపిల్‌పళ్ళ పీపాలకు నియత ప్రమాణాలు ఉండాలా, అక్కర్లేదా అనే సమస్యే—ఆల్బని రాష్ట్రపు సెనేట్‌కి రూజ్వెల్ట్ ఎన్నిక అవడానికి కారణమయింది. 28 ఏళ్లు వరుసగా రిపబ్లికన్ పక్షాభ్యర్థులనే సెనేట్ ప్రతినిధులుగా ఎన్నుకున్న ఒకజిల్లాలో ప్రోగ్రెసివ్ డెమొక్రటిక్ పక్షాభ్యర్థిగా నిలచి, వ్యవసాయదార్ల వోట్లతో కొద్దితేడాతో రూజ్‌వెల్ట్ నెగ్గాడు. అప్పటికి ఆయనకు 28 ఏళ్లు.

సెనేట్‌భవనంలో అడుగుపెట్టటంతోటే ఆపిల్ పళ్ళ పీపాల సంగతి పూర్తిగా మరిచిపోయి, ఇతడు మొదటి వారంలోనే పలుకుబడిగల 'టామనీ' వర్గంతో కలహాలు దూశాడు. కేంద్ర ప్రభుత్వపు సెనేట్‌కి ఖాళీ ఏర్పడ్డ స్థానానికి 'టామనీ'వర్గంవారు నిలిపిన అభ్యర్థి విలియం ఫ్రాన్సిస్ షీహాన్. రూజ్వెల్ట్ ఆ స్థానానికి ప్రత్యర్థిగా నిలబడుతున్నట్టు తెలిసినప్పుడు ఆ వర్గంవారికి తమకు విజయం సులభసాధ్యమనిపించింది. ఆ వర్గపు కేతనం కూడి న్యూయార్కు

లాంఛనం ముఖంలో మందహాసం విరిసింది. కాని, ఆ సభ లోని మరొక 19 మంది సభ్యుల సహకారాన్ని సంపాదించి రూజ్‌వెల్ట్ 60 సార్లు వోట్లు తీసుకున్నా షీహాన్ ఎన్నిక కాకుండా చేయగలిగాడు. చివరికి 64 వ సారి వోటింగు జరుపగా ఈ ఇద్దరూ కాకుండా మరొక అభ్యర్థి ఎన్నుకోబడ్డాడు.

టామనీ వర్గంమీద చిట్టచివరకు రూజ్‌వెల్ట్ సాధింప గలిగిన ఘన విజయం అతని పేరును, ప్రముఖ వార్తలలోకి తెచ్చి, కేంద్రప్రభుత్వపు సెనేటు సభ్యులను ప్రత్యక్షంగా ప్రజలే ఎన్నుకొనేందుకు వీలుగా రాజ్యాంగాన్ని సవరించా లన్న ఆందోళనకు దేశమంతటా బలం చేకూర్చింది. సుమారు పదేళ్ళపాటు నిర్విరామంగా రూజ్‌వెల్ట్ 'టామనీ' తో పోరాడాడు. ఉపాధ్యక్ష పదవికి అతని పేరు ప్రతిపా దింప బడడం తాత్కాలికంగా ఆ పోరాటాన్ని విరమింప జేసింది. కాని, ఈ ద్వంద్వయుద్ధంలో డెమొక్రటిక్ పక్షా భ్యర్థులు నెగ్గినా, ఓడినా మళ్లీ ఆ పోరాటం కొనసాగడం నిశ్చయమే!

రూజ్‌వెల్ట్ న్యూయార్కు రాష్ట్ర గవర్నరు పదవికి పోటీచేస్తే తాము బలపరుస్తామంటూ టామనీవర్గంవారు ఎన్ని సార్లో ఈయనతో రాజీబేరాలు జరిపారు. ప్రతి పర్యాయం ఈయనవాళ్ల సహకారాన్ని నిరాకరిస్తూ, కేంద్ర ప్రభు త్వోద్యోగాలలో నుంచి ఆ వర్గం సభ్యులను తరిమి తరిమి కొట్టే తన క్రీడను మరింత పట్టుదలగా సాగిస్తూ వచ్చాడు.

1912 లో బాల్టిమోర్‌లో జరిగిన డెమొక్రటిక్ పక్ష సమావేశంలో ఈయన టామనీ వర్గంతో హోరాహోరీగా పోరాడారు. వుడ్రో విల్సన్ ఆ పక్ష నాయకునిగా పేర్కొనబడడంతో టామనీ వర్గం పూర్తిగా ఓడిపోయింది. శాన్‌ఫ్రాన్సిస్కోలో జరిగిన డెమొక్రటిక్ పక్ష సమావేశంలోకూడా ఈయన 'టామనీ' తో పోరాడారు కాని, ఈసారి టామనీ వర్గమే గెలుపొందింది. విజయం సాధించినా టామనీ అతని మీద కక్ష వహించ లేదు. ముఖ్యంగా - రాజకీయ దృష్ట్యా అది వివేకవంతమైన పని కాదని ఆ వర్గం గుర్తించింది. న్యూయార్క్ రాష్ట్ర నాయకత్వాన్ని టామనీ వర్గీయుల చేతులలో నుంచి లాగుకొనడానికి మొదట ఈయన చేసిన పోరాటాన్ని ఆ వర్గం క్షమించింది. తన ఆదేశాల నుల్లంఘించి విల్సన్‌ను సమర్థించినా ఆ వర్గం క్షమించింది. తనకు అభిమానపాత్రుడైన కాక్స్‌తో నిరంతరం వ్యతిరేకిస్తున్నా, ఆ వర్గం క్షమించింది. అతని గత వర్తనలన్నిటినీ క్షమించి, ఆ వర్గం ఉపాధ్యక్ష పదవికి అతని పేరు ప్రతిపాదనకు ఆమోదం తెలిపింది.



# వాల్ట్ విట్‌మన్

**1819-1892**

[“నా కాళ్ళక్రింద నేల గ్రానైట్ ఖనిజముతో తాపితము చేయబడింది” అని విట్‌మన్ వ్రాసుకున్నాడు. అది నిజమని రుజువుకూడా అయింది. అమెరికన్ జాతీయభావం అత్యధికంగాగల ఈ కవి ప్రతిష్ఠ 1855 లో ‘గడ్డిరేకులు’ (‘Leaves of Grass’) అనే ఖండకావ్య సంపుటి ప్రచురించినది లగాయతు క్రమంగా పెరుగుతూ వచ్చింది.

విట్‌మన్ న్యూయార్క్ నగరానికి చెందిన లాంగ్ ఐలండులో జన్మించి బ్రూక్లిన్‌లో పెరిగి పెద్దవాడయాడు. యౌవనారంభంలో ఇతడు పత్రికా విలేఖకుడుగా పనిచేశాడు - ‘గడ్డిరేకులు’ కావ్యసంపుటి పట్ల చాలామంది విమర్శకులు అననుకూల వైఖరి ప్రదర్శించారు. అయినా తాను చనిపోయేవరకూ విట్‌మన్ ఆ గ్రంథానికి తిరిగి తిరిగి ప్రవర్ధిత సంపుటాలు ప్రకటిస్తూనే వచ్చాడు. ప్రజాస్వామిక కవిగా, మూఢాచార విధ్వంసకుడుగా అతని ప్రభావం అగణ్యమైనది.

ఈ దిగువను ప్రకటించిన భాగం స్వీయానుభవాలు వివరిస్తూ విట్‌మన్ వ్రాసిన “విలక్షణదినాల విచిత్ర స్మృతులు” (Specimen days and collect - 1882) అనే గ్రంథంనుండి ఉద్ధృతము. ఈ

భాగంలో ఫుల్టన్ ఫెరీ (Fulton Ferry) రేవువద్ద విట్మన్ జన సమూహాలను చూస్తూ గడపడం, బ్రాడ్వే ప్రాంతంలో ప్రముఖుల ననేకు లను సందర్శించడం, బుల్ రన్ వద్ద జరిగిన మొదటియుద్ధంలో యూని యన్ సైన్యం ఓడిపోయి వాషింగ్టన్ కి పారిపోయి రావడం వర్ణించ బడినవి.]

# విట్మన్ లోక పరిశీలన

అటుతరువాత, బ్రూక్లిన్ లో అనగా న్యూయార్క్ నగ రంలో – గడచిన నాజీవితం ఆకాలంలోను, తదనంతర సం వత్సరాలలో మరింత ఎక్కువగాను చిత్రంగా ఫల్టన్ రేవుతో ముడివడిపోయి గడచింది. అప్పటికే ప్రాధాన్యంలోను, పరి మాణంలోను, వైవిధ్యంలోను, రూపసౌందర్యంలోను ప్రపం చంలో అత్యంత ప్రముఖస్థానాన్ని ఫల్టన్ రేవు ఆక్ర మిస్తూంది. ఆకాలంలో (1850–60) ఇంచుమించు ప్రతి రోజూ నేను పడవమీద నది దాటుతుండేవాణ్ణి, తరచు నౌకలమీది 'చోదక గృహాల' లో ప్రయాణిస్తూ, అక్కడి నుంచి కనిపించే విశాలమై తన్మయత కలిగించే అదృశ్యా లనూ, ఆరమ్య పరిసరాలనూ చూస్తూ మైమరచి పోయే వాణ్ణి.

సముద్రం అడుగున ఏప్రవాహాలుగా, ప్రతి ప్రవా హాలూ ఉన్నాయో నాకు తెలియదుకాని, పైన కనిపించే మానవ మహాప్రవాహాలు – ఎప్పటికప్పుడు గతిమారుస్తూ ఉండే సజీవ ప్రవాహాలు – మాత్రం నన్ను ఎంతో ఆక ర్షించేవి. నిజానికి మొదటినుంచీ పడవ ప్రయాణాలంటే

నాకు విపరీతమైన సరదా. నా కా యాత్రలలో అననుకరణీయములైన, నిరంతరంగా ప్రవహించే సజీవ కావ్యాలు స్ఫురించేవి. నది సముద్రాఘాతంలో కలిసే దృశ్యం, న్యూయార్క్ దీవి సంపూర్ణదృశ్యం, తెరపగా ఉన్న రోజున ఏ సమయంలో చూచినా వడివడిగా వస్తూ, మధ్యలో విరిగి విరిగి పడుతూ ఉండే కెరటాలు, ఓడల స్థానాలు ఎప్పటికప్పుడు మారిపోతూ కనిపించే మనోహర దృశ్యాలూ, అన్ని పరిమాణాలలోను ఉండే ఓడలు, తరచు సుదూర గమ్యాలకు బయలుదేరబోతూ బయట కనిపించే పెద్ద ఓడల పంక్తి, తెల్లని తెరచాపలు విప్పుకొని అసంఖ్యాకంగా ఉండే 'స్కూనర్,' 'స్లూప్,' 'స్కిఫ్' ఓడలూ, విచిత్ర సౌందర్యాన్ని స్ఫురింపజేసే 'యాట్' పడవలూ, 'బాటరీ' పార్కును చుట్టుకొని తూర్పుదేశాలకు పోయేందుకు సాయంత్రం 5 గం॥ల ప్రాంతాల్లో వస్తూ ఠీవి వెలయించే 'సౌండ్' ఓడలూ, స్టాటిన్ దీవివేపుకిగాని, 'నారాస్' జలసంధి వెంట దిగువకుగాని, లేక హడ్సన్ నదికి ఎగువగా రెండవవేపున గాని కనిపించే దృశ్యాలూ,...ఆ అనుభవాలూ, ఆ దృశ్యాలూ కొన్నిసంవత్సరాలక్రితం (అటుతరువాత అనేక పర్యాయాలు) నాకు ఎంతో ఆనందాన్ని కలిగించేవి. ఆ నాటి నా సరంగు మిత్రులలో బాల్సిర్ కుటుంబంవారూ, జాన్‌కోల్, ఇరాస్మిత్, విలియమ్‌వైట్లూ, పడవలమీద నా చిన్నారి స్నేహితుడు టామ్‌గయర్ – అందరూ నాకెంతో స్పష్టంగా నేటికీ జ్ఞాపకం ఉన్నారు.

ఫుల్టన్ ప్రాంతానికే కాక, నేనా సంవత్సరాలలో తరచు బ్రాడ్వే ప్రాంతానికి కూడా వెళుతూ ఉండేవాణ్ణి. న్యూయార్క్ నగరంలో సమ్మర్దం, వైవిధ్యంగల మానవ సమూహాలకూ, సుప్రసిద్ధ పురుషుల సంచారానికీ పేరెన్నిక గన్న ప్రాంతమది. ఆరోజులలో అక్కడ నేను - ఆండ్రూ జాక్సన్, వెబ్‌స్టర్, క్లే, సీవర్డ్, మార్టిన్‌వాన్ బ్యూరెన్, సైనికసాహసికుడు వాకర్, కొసూత్, ఫిట్జ్‌గ్రీన్, హాలెక్, బైరంట్, వేల్సు రాకొమరుడు, చార్లెస్ డికెన్సులను జపాన్ తొలిరాయబారులను - ఇంకా ఆనాడు జగద్విదితులుగా ఉండిన వారినెందరినో చూశాను. ఎప్పుడూ ఏదో క్రొత్త విషయమే, ఆవేశజనకమైన విషయమే కనిపించేది ; అయినా- ఎప్పుడూ వడిగా సాగే ఒకే అనంత మానవ మహా ప్రవాహంగానే నాకు అనిపించేది. నగరమందిరం (City hall) వెనుక ఛేంబర్సు వీధిలో ఒక న్యాయస్థానంలో విశ్రాంతి గదిలో జేమ్సు పెనిమోర్ కూపర్‌ని సందర్శించడం నాకు జ్ఞాపకముంది. ఆన్యాయస్థానంలో అతడేదో కేసు నడుపుతున్నాడు. (అది బహుశః ఎవరిమీదో అతడు తెచ్చిన పరువునష్టపు దావా అనుకుంటాను.) 'డానే' లేక పెర్ల్ వీధి మలుపులో ఉన్న ఒకభవనం రెండో అంతస్తులోని ఆఫీసుగదిలో 'ఎడ్గార్ ఎల్లన్ పో'ని సందర్శించడం, హ్రస్వ సంభాషణ సాగించడం (బహుశః అది 1845 లోనో 46 లోనో) కూడా నాకు జ్ఞాపకం ఉంది. ఆయన 'బ్రాడ్వే జర్నల్' అనే పత్రికకు సంపాదకుడుగాను, పూర్తిగానో

పాక్షికంగానో యజమానిగాను ఉండేవాడు. ఆయన ప్రచు రించియుండిన ఏదో నారచన విషయంలో అప్పుడాయనను చూశాను. 'షో' చాలా మర్యాదస్థుడు; మనిషి రూపం, వేషం అన్నీ చాలా బాగా ఉన్నట్లనుకున్నాను. ఆయన మూర్తి, కంఠస్వరం, అలవాట్లు, పటిష్ఠత - అన్నీ నాకు సుదూరమైన మనోహరమైన స్మృతులు. చాలాదయ, దాక్షిణ్యంగలవాడు; కాని. వినమ్రుడుగాను, బహుశః కొంతవరకు విరక్తుడుగాను కూడా కనిపించాడు.

నా స్మృతులలో మరొకటి: ఈ న్యూయార్క్ పడమటి భాగంలోనే సరిగ్గా హూస్టన్ వీధికి దిగువగా ఒక సారి నేను (1832 జనవరి నెలలో తెరపగా ఉన్న రోజున అని జ్ఞాపకం) వంగిపోయిన, దుర్బలంగా ఉన్నా ఆజానుబాహువైన, బాగా వృద్ధుడైన ఒక వ్యక్తిని చూశాను. గడ్డం ఉంది; విలువైన ఉన్ని దుస్తులు, తల మీద తెల్లని పెద్ద ఉన్ని టోపి, - సుమారొక డజను మంది మిత్రులూ, నౌకర్లూ పరస్పరం పోటీ పడుతూ, జాగ్రత్తగా పట్టుకొని ఇంటి ముందరి నడవలోనుంచి మెట్లమీదుగా క్రిందికి నడిపించుకొచ్చి . . . ఇంచుమించు మోసుకువచ్చి . . . ఎత్తి, చక్రాలులేని మంచుమీద లాగే ఒక పెద్ద బండిలో కూర్చోబెట్టి, పైన మరికొన్ని ఉన్ని వస్త్రాలు కప్పి, షికారు త్రిప్పటానికి తయారుచేశారు, ఆ బండీ లాగిన గుర్రాలంత అందమైన గుర్రాలను నేను నా జన్మలో చూడలేదు. (చాలా బాగా జంతువులను ఈ కాలంలో పెంచుతున్నామని

మన మనుకో నక్కర లేదు. 50 ఏళ్ళనాడు లాంగ్ ఐలెండ్ లో గాని, దక్షిణ రాష్ట్రాలలోగాని, న్యూయార్క్ నగరంలో గాని దొరికిన గుర్రపు మాంసంలాంటిది మళ్లీ ఎక్కడా దొరకలేదు. రుచికీ పుష్టికీ జనం పెంపుడు గుర్రాల మాంస మంటేనే, - ఏ జాతి గుర్రం అయినా సరే- ఆ రోజులలో ఎగబడేవారు.) నేను బహుశః అప్పుడు 13, 14 ఏళ్ళ కుర్రాణ్ణి. అలా నిలబడిపోయి, ఆ ఉన్నిలో మునిగిపోయి, అంత మంది మిత్రులు నౌకర్ల మధ్య, ఆ బండీ మీద భద్రంగా ఆసీను డైన ఆ ముసలివానిని చూస్తూ ఎంతోసేపు ఉండిపోయాను. నెమరువేస్తున్న, ఉత్సాహం పొంగులు వారుతున్న ఆ గుర్రాలూ, చేతిలో కంచీకర్రతో బండి తోలేవాడు, వాని ప్రక్క అవసర సమయంలో వాడికి సహాయం చేసేందుకు మరో చోదకుడూ - అంతా నాకు స్పష్టంగా జ్ఞాపకముంది. అంతగా వాళ్లందరూ కన్నులలో పెట్టుకు చూస్తూన్న ఆ ముసలివాని రూపం ఇప్పటికీ నా కళ్ళముందు మెసలుతున్నది. అతడు జాన్ జాకబ్ ఆస్టర్ !

1846, 47 ప్రాంతాలలో - రచయితగాను, ముద్రాప కుడుగాను పనిచేస్తూ, నాకు సహజమైన ఆరోగ్యంతో ఉత్సాహంగా కాలం గడుపుతూ నే నింకా న్యూయార్క్ నగరంలోనే ఉన్నాను...

అయితే ఆ అనుభవం, ఉత్సాహం - అంతా ఒక భయంకరమైన ఆఘాతంతో ఒక్కసారిగా తారుమారై పోయింది. అది మొదటి 'బుల్ రన్' యుద్ధం. ఇప్పుడు

మన మందరం గుర్తించినట్లు – నిశ్చయంగా అది చరిత్రలో అత్యంత ప్రధానమైన యుద్ధం. (అన్ని యుద్ధాలూ, వాటి ఫలితాలూ మామూలుగా అనుకునేదానికంటే కూడ ఎక్కువగా హాఠాత్సంభవాలతో నిండి ఉంటాయి. అయితే ఈ యుద్ధంలో మొదటినుంచి చివరివరకూ అన్నీ హాఠాత్సంభవాలే! అనిశ్చిత పరిస్థితులే! ఏ పక్షాని కా పక్షం తాను నెగ్గాననే అనుకునేది – చివరి నిముషం వరకూ నిజం చెప్పాలంటే నిర్మూలితం కావడానికి ఒక పక్షం ఎంత యోగ్యమో రెండోపక్షమూ అంతే! ఒక కల్పిత వార్తవల్ల, లేక అనేక కల్పిత వార్తల పరంపర వల్ల చివరి నిమిషంలో జాతీయ సైన్యాలు చెల్లాచెదరై భీతాహంతో పలాయనం చిత్తగించనవి.)

అది 22 వ, తేదీ సోమవారం. అడపాదడపా ప్రొద్దస్తమానం వాన జల్లులు పడుతూనే ఉన్నవి. తెలతెలవారుతూ ఉండగా పరాజితసైన్యాలు లాంగ్ బ్రిడ్జ్ మీదుగా వాషింగ్టన్ లోకి వచ్చి పడటం ఆరంభమైంది. యుద్ధం జరిగిన శని, ఆది వారాలు (20, 21 తేదీలు) ఎండ విపరీతంగా కాసింది. దుమ్మూ, ధూళీ, పొగా దేహాలమీద చెమటతో కలసి ఒక పొరగా ఏర్పడి, మళ్లీ దుమ్మూ, మళ్లీ చెమట ఇంకో పొరగా ఏర్పడి, వీటన్నిటినీ ఆ ఉద్రిక్త ప్రాణాలు జీర్ణించుకొని, – గాలిలోని ధూళి కణాలతో వాళ్ళ దుస్తులన్నీ అట్టలుకట్టుకుపోయి, ఎండిన రోడ్లమీదా, తుపాకిదళాల కాళ్ల క్రింద నలిగిన పొలాలలోనూ ఎక్కడపడితే అక్కడ వాళ్లే! దుమ్మూ,

చెమట, వాన మలాములతో నిండిన దేహాలతో తిరుగు ముఖంపట్టి లాంగ్ బ్రిడ్జి మీదుగా వచ్చి పడ్డారు. భయంకరమైన 20 మైళ్ళ యాత్ర చేసి, బెదిరిపోయి అవమానంతో, భీతాహంతో వాషింగ్టన్ చేరుకున్నారు. వారిక్కడనుంచి వెళ్లేటప్పుడు పలికిన ఆ ప్రగల్భాలిప్పుడేమైనవి? ఆ ధ్వజాలూ, బాండ్ మేళాలూ, ఎదిరిఖైదీలను తీసుకొచ్చేందుకు పట్టుకెళ్లిన త్రాళ్లూ - అవన్నీ ఇప్పుడేమైనవి? ఒక్క బాండు వాద్యం మ్రోగడంలేదు ; సిగ్గుగా జెండాకొయ్య కంటిపెట్టుకుని ముఖం వ్రేలవేయని ఒక్క జెండా లేదు.

సూర్యుడుదయించాడు ; కాని, ప్రకాశించడం లేదు.. ఆ మనుష్యులు - మొదట పల్చగా, అవనతవదనాలతో రా సాగారు. క్రమంగా గుంపు బలిసింది. వాషింగ్టన్ వీధుల నిండా - ముఖ్యంగా పెన్సిల్ వేనియా వీధిలో, ఇళ్ల మెట్లమీదా, క్రింది అంతస్తుల వాకిళ్లలోను - ఎక్కడ పడితే అక్కడవాళ్లే! ఒక క్రమం లేకుండా దారి తప్పినవాళ్ళలాగ, చిన్న చిన్న గుంపులుగా వస్తున్నారు. అప్పుడప్పుడు మాత్రం ఒక్కొక్క దళం పూర్తిగా క్రమబద్ధంగా సైనికోద్యోగుల ఒద్దికలో (కొందరు ఉద్యోగుల స్థానాలు మధ్య మధ్య ఖాళీగా కనిపిస్తున్నాయి ; చచ్చిపోయి ఉంటారు ; వాళ్లు నిజమైన వీరులు) మౌనంగా వంచిన ముఖాలతో గంభీరంగా మార్చి చేస్తూ, కుప్పకూలిపోతారేమో అన్నంత అలసటతో, అంతా నల్లగా, మడ్డిగా, అయినా చేత తుపాకులు ధరించి సజీవంగా అడుగువేస్తూ రావడం కూడా కద్దు ;

అయితే, అలాంటి దళాలు చాలా అరుదు. పెన్సిల్ వేనియా వీధిలో పేవ్‌మెంట్లూ, 14 వ వీధీ జనంతో కిట కిటలాడి పోయినవి; పౌరులు, నీగ్రోలు, గుమాస్తాలు ... అంతా ఆ సైనికులను చూడటానికి వచ్చినవాళ్లే; కిటికీలలో ఆడ వాళ్ల ముఖాలు ... ఆ పారిపోయి వచ్చిన, దుమ్ముకొట్టుకుని ఉన్న సైనికుల తండాలు (వాటికి అంతం అనేది ఉందా?) తమ ఇళ్ల ముందుగా కదిలిపోతున్నప్పుడు ఆ స్త్రీల ముఖాలలో కౌతుకం వెల్లివిరుస్తూంది. ఎవ్వరి నోటా మాటలేదు: ఎట్టి వ్యాఖ్యలూ లేవు. (ఈ చూడవచ్చిన వాళ్లలో సగం మంది అతి తీవ్రమైన విభజనవాదులు; పైకేమీ మాట్లాడరు. ముఖాలలో మాత్రం రాక్షసత్వం తొంగిచూస్తూంది) ఆ ఉదయమంతా వాషింగ్టన్ నిండా మచ్చలు మచ్చలుగా పరాజిత సైనికుల గుంపులు వ్యాపించినవి; వింత వస్తువుల్లాగ విచిత్రమైన కళ్లతో, ముఖాలతో, తడిసి ముద్దయి, (ఆ రోజంతా ఎడతెగకుండా జల్లులు పడుతూనే ఉన్నవి) అమితంగా అలసిపోయి, ఆకలితో, పీక్కుపోయిన కళ్ళతో, ఉబ్బిన కాళ్ళతో — ఎక్కడ చూసినా ఆ సైనికులే! సజ్జనులైనవారు (వారైనా మరీ అంత ఎక్కువమంది లేరు) అ సైనికుల కింత తిండి పడెయ్యాలని సతమత మవుతున్నారు. జావ, కాఫీ కాయడానికి గాడిపొయ్యి మీదికి గంగాళా లెక్కించారు. పేవ్‌మెంట్ల మీద మేజాబల్లలు వేసి, వేగన్ల కొద్దీ రొట్టె కొన్నారు. వడి వడిగా దానిని పెద్ద పెద్ద ముక్కలక్రింద తరుగుతున్నారు. అందులో ఇద్దరు వయస్సు

ముదిరిన స్త్రీలు – చాలా అందమైనవాళ్లు – సంస్కారానికీ, సౌందర్యానికీ నగరంలో అగ్రతాంబూలం పొందినవారు.... హడావిడిగా తెచ్చివేసిన, మొరటు కొయ్యతో చేసిన ఒక మేజాబల్ల దగ్గర బోలెడు భక్ష్య, పానీయాలతో నిలబడి ఆ సైనికుల కాహారం పంచుతున్నారు. ఆ రోజంతా ఖర్చ య్యేది ఖర్చు అవుతూంటే అర గంట అర గంటకీ మళ్లీ ఇళ్ల దగ్గరనుంచి ఆహారపదార్థాలు తెప్పిస్తూనే ఉన్నారు. జోరున కురుస్తున్న వానలో ... అతి ఉత్సాహంగా నిలబడి మౌనంగా, నెరసిపోయిన తలకట్లతో వారు అలా ఆహారం వడ్డిస్తూనే ఉన్నారు. అంతసేపూ ఇంచుమించు ఎడతెరపి లేకుండా వారి చెక్కిళ్లమీదుగా కన్నీరు ఓడికలు కడుతూనే ఉంది. ఆ గాఢమైన ఉద్వేగం మధ్య, అంత సందడిలోను, సంచలనంలోను, నిస్పృహతో కూడిన ఆదుర్దా మధ్య ... అత్యాశ్చర్యకరంగా ... ఆ సైనికుల్లో చాలామంది నిద్రకు పడ్డారు. అంత సంరంభం మధ్యా అతి గాఢంగా నిద్రపోతూ న్నారు. ... ఇళ్ల మెట్లమీదా, ప్రహరీగోడల ప్రక్కనా, పేవ్‌మెంట్లమీదా, రోడ్ల ప్రక్కన ఖాళీస్థలాలోను ఎక్కడ పడితే అక్కడే ఒరిగిపోతూ గాఢంగా నిద్రిస్తున్నారు. పాపం 17, 18 ఏళ్ల కుర్రాడు ... అక్కడ ... ఆ మహా సౌధ ద్వారం దగ్గర నిద్రిస్తున్నాడు. ఎంత శాంతంగా, ఎంత గాఢంగా నిద్రపోతున్నాడు! నిద్రలో కూడా కొందరు తమ తుపాకులను గట్టిగా పట్టుకున్నారు; కొందరు మిత్రులు, సన్నిహితులు దగ్గర దగ్గరగా గుంపులు గుంపులుగా పసు

కున్నారు. అలా నిద్రిస్తున్న ఆ అందరి మీదా జాలిజాలిగా వాన పడుతూంది.

మధ్యాహ్నం గడచి, సాయంత్రం అయేసరికల్లా వీధుల్లో, హోటళ్ల (Bar rooms) లో, కూడలిస్థలాలలో ప్రతి-చోటా శ్రోతలూ, పృచ్ఛకులూ, భయానక గాధలూ, భయంకర సన్నివేశాలూ, "ప్రచ్ఛన్నంగా శత్రుదళాలు వచ్చి పడటం, తమదళం చెదరిపోవడం"లాంటి కథలు, కథకులు, ప్రగల్భాలు పలికే ప్రజల గుంపులు...అదంతా చూస్తే – సంకల్పశక్తి, ధైర్యం వాషింగ్టన్ నగరంనుంచి అంతర్థానమైనట్లనిపించింది. ముఖ్యమైన హోటల్ 'విలియర్డ్స్' బుజాలపై సైనికుల లాంఛనాలు దాల్చిన సైనికోద్యోగులతో నిండిపోయింది. అవమానంతో వాళ్లు దిగజారిపోయి ఉన్నారు. (వాళ్ళని నేను చూశాను. ఇలా అందామని కూడ అనుకున్నాను: "వచ్చారా బాబూ! భుజాల మీద సైనిక లాంఛనాలతో? అయితే మీ సైనిక దళాలేవి? ఆ సైనికులందరూ ఏమయారు? అసమర్థుల్లారా! యుద్ధాల్లో అదృష్టం, ఒంటరిగా చిక్కుబడి పోవటం– ఇలాంటివి నాదగ్గర చెప్పకండి! ఇది మీ ఘనకార్యమే!... ఈ పలాయనం...మువ్మ్యాటికీ! ... మెల్లగా జారుకున్నా, లేక గట్టిగా అరచినా, లేక ఈ విలియర్డ్స్ హోటలుగదుల్లో ధైర్యోత్సాహాలను అభినయించినా, ఏంచేసినా, ఏం చెప్పినా మీరు తప్పుకోలేరు. బుల్‌రన్ యుద్ధపరాజయానికి బాధ్యత మీది. మీ సామాన్యసైనికుల తెగింపులో సగం, కనీసం పదోవంతు తెగింపు మీకుఉన్నా, ఇది జరిగేదికాదు)



# రాల్ఫ్ వాల్డో ఎమర్సన్
## 1803-1882

[నూటికినూరుపాళ్ళు అమెరికనులుగా అభివర్ణింపదగిన విట్మన్, మార్క్ ట్వెయిన్, ఎమర్సన్ ప్రభృతులు అమెరికారచయితలలో అగ్రగణ్యులు. ఎమర్సన్ బాస్టన్‌లో జన్మించి, హార్వర్డ్‌లో విద్యాభ్యాసం చేసి, బాస్టన్‌లోని (యూనిటేరియన్) సెకండ్ చర్చి మతాచార్యుడుగా నియమింపబడ్డాడు. మొదట్లో అతడివృత్తి అతణ్ణి క్రుంగదీయ నారంభించింది. పిమ్మట, యూరపులో సంచారంచేసి కొన్నిరచనలు, కొన్ని ఉపన్యాసాలు చేసినమీదట, ఈనూతనమార్గమే ఆయనకు బాగా నచ్చింది. ఉపన్యాసాలద్వారా విద్యాబోధన సాగించే విధానం అమెరికాలో విస్తృతంగా ఉండడంవలన ఉపన్యాసాలివ్వడం; వ్యాసాలు, కావ్యాలు, గ్రంథాలు రచించడమే ఆయన తన జీవనమార్గంగావరించి, అచిరకాలంలోనే విజ్ఞానిగా, రచయితగా అఖండకీర్తి ఆర్జించాడు.

ఇక్కడ ఇచ్చిన రచనలురెండూ నూరుసంవత్సరాల క్రిందట సాహిత్య విమర్శకుడుగా సుప్రసిద్ధి గడించిన ఎడ్విన్ పెర్సీ విపుల్

రచించిన "మహనీయులను గురించిన మధురస్మృతులు" [1886] అనే గ్రంథంలోని భాగాలు.]

# ఎమర్సన్‌తో గుర్రపు బగ్గీలో స్వారి

ఎమర్సన్ మహాశయునితో నాకు పరిచయ మేర్పడిన క్రొత్తల్లో ఒకరోజున బొస్టన్‌కి ఐదుమైళ్ళదూరంలో ఉన్న ఒక చిన్న పట్టణంలో ఉపన్యాసం చెప్పడానికి నాకు హఠాత్తుగా ఆహ్వానం వచ్చింది. మొదట, ఆ ఉపన్యాసం చేయవలసినదిగా ఎమర్సన్‌కి ఆహ్వానం వెళ్ళింది, ఆయన వచ్చి, మహోపన్యాసం చేస్తారని పాపం అక్కడి రసజ్ఞులంతా ఆశించారు; కాని, ఆయన తన సమ్మతి తెలియపరచ లేదు. ఆ ఆహ్వానానికి జవాబీయడంలో ఆయన అశ్రద్ధచేసి అయినా ఉండాలి; లేదా ఆయన ప్రత్యుత్తరం ఎక్కడో తప్పిపోయి సకాలంలో చేరకపోయి అయినా ఉండాలి.

నేను వెళ్లాను. ఉపన్యాసం ప్రారంభమవడానికి సరిగా పదినిమిషాలకు పూర్వం ఎమర్సన్ ప్రత్యక్షమయాడు. వెంటనే, ఆ నాడు ఆయన ఉపన్యాసం వినే అవకాశం నాకు కలగడం నిజంగా నా భాగ్యమనీ, నేను ఉపన్యాసం చెప్ప దలుచుకోలేదనీ స్పష్టంగా చెప్పాను. కాని, తన అశ్రద్ధ వల్లనే పొరపాటు జరిగినట్టు కనిపిస్తూన్నందువల్ల, ఆనాడు ఉపన్యసించే హక్కు నాదే గాని తనదికాదని ఆయన ఔదార్యంతో జవాబు చెప్పాడు. దానిమీదట, "మీరు ఉపన్యసిస్తేనే ఈ వేళ ఈ ఊళ్లో ఉపన్యాసం ఉంటుంది; లేకపోతే

ఉండదు,'' అని నేను ఖండితంగా చెప్పాను. ఆయన అస మ్మతితోనే తన చేతి సంచీలోని కవిలికట్ట విప్పి ఉపన్యసించ డం ఆరంభించాడు.

ఆ ఉపన్యాసం ఇతర సాహిత్య గోష్ఠులలో ఆయన చేసిన ఉపన్యాసాలన్నింటిలోకీ శ్రేష్ఠమైనది కాక పోవచ్చు గాని, సమకాలికులైన ఇతర ఉపన్యాసకుల ఉత్తమోత్తమ ఉపన్యాసాలన్నిటికన్న గొప్పది. ఉపన్యాసం పూర్తిఅయిన తరువాత, నేను కూడా తన గుర్రపు బగ్గీలో రావచ్చునని ఆయన నన్ను పిలిచాడు. నేను అమితానందంతో అంగీ కరించాను.

నా అదృష్టవశాత్తు, ఆ గుర్రం అతినిదానంగా పయ నించే పోటీలో ప్రథమ బహుమానం పొందదగినది. మామూలుగా కాలినడకను, తనలో తాను తన్మయత్వంతో ఏదో ఆలోచించుకుంటూ పోతూ ఉండే బాటసారికన్న, ఇద్దరు ప్రయాణికులు గల ఆ బగ్గీనిలాగుతూ, తాను అధిక వేగంతో ప్రయాణం చేయగలననే దంభం పాపం ఆ గుర్రంలో ఏకోశనా కనిపించలేదు. బహుశః, ఆ గుర్రపు బగ్గీవేగం గంటకు దాదాపు రెండుమైళ్ళదాకాఉండవచ్చు.

నేను బండిలోకి ఎక్కగానే ఆనాటి ఉపన్యాసాన్ని గురించిన ప్రసంగం ప్రారంభించాను. ముఖ్యంగా, ఆయన ప్యూరిటన్‌లను గురించి చెప్పిన విషయాలనుగూర్చి మాట్లాడుతూ 'గంభీరమైన' (Grim) అనే పదాన్ని విలక్షణంగాను, సునాయాసంగాను వాడిన సంగతిసూచిస్తూ,

"బహుశః ఆపదం మీకు చాలా ఇష్టమనుకుంటాను; మీరు ప్రకటించిన వ్యాసాలలో కూడా మీరు ఆ మాట ఎక్కువగా వాడినట్టున్నారు." అన్నాను. వెంటనే ఆయన ఆదుర్దాగా, నే నామాట బాగా తరచుగా వాడుతున్నానంటారా?" అని ప్రశ్నించాడు. "ఔను. అయితేవాడిన చోటనల్లా మీ రభివర్ణిస్తూన్న వ్యక్తుల స్వభావానికి పూర్తిగా వర్తించే విధంగానే సర్వత్రా మీరామాట వాడారు", అన్నాను. ఆయన, ఒకటి రెండు నిమిషాలు సాలోచనగా మౌనముద్ర దాల్చి, "బహుశః, ఆ మాట నాకొక ఊతపదంలాగ తయారవుతున్నట్టుంది. ఇకనించి దాన్ని వాడడంలో కొంచెం జాగ్రత్తగా ఉండాలి. నా నిఘంటువులోనుంచి మెల్లిగా దానికి ఉద్వాసన చెప్పాలి," అన్నాడు.

మేమూ పట్టణపు విపణుల్లో నుంచి బయటపడి, బాస్టన్‌కి పోయే పల్లెటి దిక్కురోడ్డు ఎక్కేసరికి, ఎమర్సన్ పండితుడు బాగా ఉత్సాహంగా ఉన్నాడు. ఆయన తన యువ సహచరుడితో ఒక విలక్షణమైన ప్రసంగం ప్రారంభించాడు. ప్రసంగధోరణి మొదట తనలో తాను చేసుకొనే యథేచ్ఛాభావన స్థాయిలోనుంచి స్వగతం స్థాయిలోకి వచ్చి, పిమ్మట మాయిద్దరి నడుమ సంభాషణగా మారింది. అయితే, ఆ సంభాషణ మధ్యలో ఆయన సహప్రాసంగికుడు తన భావప్రకటనోత్సాహాన్ని నిగ్రహించు కొనగల కౌశలం ప్రదర్శించినపుడు, మళ్ళీ స్వగత స్థాయిలోకీ, మౌనభావనస్థాయి

లోకి మళ్ళిపోవడం కూడా జరుగుతూ ఉండేది. ఆ సాయం సంధ్యను నేను ఎన్నటికీ మరచిపోలేను. చంద్రుడు షోడశ కళా పరిపూర్ణుడై ప్రకాశిస్తున్నాడు. తనను తెరుముకొని వస్తూన్న ఒక మబ్బుని చూచి ఏ మాత్రం చలించకుండా, ఏదో ఇంద్రజాలికశక్తితో ప్రకృతినంతను ముంచెత్తుతూ, సుస్నిగ్ధమైన, సుప్రసన్నమైన, ప్రశాంతమైన, పార వశ్యాన్ని కలిగించే వెన్నెల కాస్తున్నాడు. కన్నులు మిరు మిట్లుగొలిపే సూర్యరశ్మిలో వాస్తవాలుగా కనిపించిన సర్వవస్తువులను ఆ వెన్నెల అవాస్తవికాలను చేస్తున్నది. మా నిద్రబోతు గుర్రం దాని స్వప్నసౌఖ్యం అది అనుభ విస్తూన్నట్టుంది; పూర్తిగా ఆగిపోయి వైరాగ్యోదయమైన తత్త్వవేత్తవలె, నికృష్టమైన ఆ బండీ నుండీ, ఆ బాడీకి తనను బంధించి ఉంచిన కళ్లెం వగైరా సామాను నుండీ తెగతెంపులు చేసుకుని తన ధ్యాన సమాధిలో తాను మునిగిపోక పోవడానికి కారణం: మధ్య మధ్య ఎమర్సన్ దాని ప్రక్కలకు తగిలిస్తూన్న యథాలాపపు కొరడా విద లింపు. నిజానికి ఆ జీవ సమాధి స్థితిలోనుంచి జాగ్రదవస్థ లోకి తీసుకొని రావడానికి ఇది తగినంత సమగ్రమైన కార ణం కాదు. ఆ యజమాని ఆ కొరడాతో ఎంత గట్టిగా కొట్టినా, ఆ దెబ్బకు పూర్తిగా గురియైన ఒక ఈగకు కూడా ఏ విధమైన ప్రమాదం ఉండదు. అలాగే, మేము మెల్లగా సాగిపోతున్నాం.

చివరకు మా ప్రసంగం, నాడు షేక్స్పియర్ నాట

కాల్లో నాయక పాత్రలు ధరించే ప్రముఖ నటుల వంకకు మళ్లింది. హామ్లెట్, ఒథెల్లో, లియర్, మాక్‌బెత్ ల వలె అభినయించడానికి ప్రయత్నించిన వారిలో ఎవరైనా నాకు సంతృప్తి కలిగించారా అని ప్రశ్న. లేకేం? నేను బూత్ (సీనియర్) ఈ వేషాలు వేయగా చూశాను. అతడు పరిపూర్ణుడు కాక పోయినా, నేను చూచిన ఇతర నటులందరికన్న పరిపూర్ణతకు ఎక్కువ సన్నిహితుడు. నిజానికి షేక్స్‌పియర్ రచనలు కూలకషంగా చదివిన విద్వాంసులకు ఏ నటుడూ వాస్తవమైన సంతృప్తి కలిగించ లేదు. అయినా, బూత్ కి నిశితమైన గ్రహణశక్తి, చక్కని భావనాబలం ఉన్నవి; తాను నిర్వహించే పాత్ర యొక్క వ్యక్తిత్వానికి సంబంధించిన ముఖ్యమైన విలక్షణ స్వభావాలను గురించి ముందుగా తన మనస్సులో దృఢమైన, వాస్తవికమైన చిత్రణ చేసుకుంటాడు. అందువల్లనే అతడు షేక్స్పియర్ భావనలోని ఒకవిధమైన సంకీర్ణ ప్రకృతిని ప్రదర్శిస్తూనే వివిధ పాత్రలలోని వైవిధ్యాన్ని కూడా చూపగలుగుతున్నాడని నా అభిప్రాయం. మెక్రియాడీ ఇంతకన్న ఎక్కువ ప్రజాకర్షణ గలవాడు;-కనీసం ''నాజూకు''తన మెరిగిన వర్గాల అభిమానం చూరగొన్నవాడు కావచ్చు. కాని, అతనికి వచ్చిన ఇబ్బంది ఏమిటంటే, అతడు ఎంత సునిశిత గ్రహణశక్తి గలవాడైనా, తనను తాను మరచి పాత్రలో లీనం కాగల శక్తి అతనికిలేదు. అందువల్ల షేక్స్పియర్ నాటకమంతా ఓపికగా చదివి, అతడు అభి

నయించబోయే పాత్రను గురించి అతనికి ఏర్పడిన అభిప్రాయానుసారంగా నటిస్తాడు.

"బాగుంది," అన్నాడు ఎమర్సన్, – నేను బూత్‌ని ప్రస్తుతించడంలో వెళ్ళబుచ్చిన మూడునిముషాల్లో ఒక కునుకు తీయడానికి ప్రయత్నిస్తూన్న సోమరి గుర్రాన్ని మెల్లగా కొరడాతో నువ్వి మేల్కొలుపుతూ ; – "మీరు చాలా అదృష్టవంతులు. షేక్స్పియర్ నాటకంలోని ఒక నటునిద్వారా పారవశ్యంతో కూడిన ఆనందం పొందగలరు. నేను, షేక్స్పియర్ నాటకాన్ని చూడడానికి ఎప్పుడు ఏ నాటకశాలకు వెళ్లికూచున్నా, నాటకం పొడుగునా నాటక కర్తే నాదృష్టిని ఆకర్షిసాడు. పోయిన మంగళవారం నేను మెక్రియాడీ నటిస్తూన్న "హామ్లెట్" నాటకం చూడడానికి వెళ్లాను. అంతా సవ్యంగా సాగుతూంది ; కాని, –

"thou, dead corse, again, in complete sted,
Revisit'st thus the glimpses of the moon—"

అనే పంక్తుల దగ్గరకు వచ్చేసరికి, కరిగి కరిగింప జేయగల ఆ మహాభావుకత నటుణ్ణీ, నాటకశాలనూ, పూర్తిగా మాయం చేసివేసి, ఈ బృహద్భూగోళాన్ని దానిపైన సర్వాన్నీ కేవలం ఆ పద్యభాగంలో చెప్పిన "వెన్నెల వెలుగు" గా మార్పుచేసి వేసింది. ఆ తరువాత కూడా నాటకం నడిచింది. కాని, నేను మాత్రం ఆ మహాభావుకుని ఈ ఒక్కభావంలో తన్మయుడనై పోయి అక్కడ ఏమి జరుగుతున్నదీ గమనించలేదు," అన్నాడు.

ఎమర్సన్ ఈ విషయం చెప్పేటప్పుడు, ''వెన్నెల సోయగం''అని మెల్లగా ఉచ్చరిస్తూ మా చుట్టూ ఒక్కసారి కలయచూడడం నన్ను ముఖ్యంగా ఆకర్షించింది; షేక్స్పియర్‌కి ఆ భావం తోచడానికి కారణమైన ఆ చంద్రకాంతే సరిగా ఆ సమయంలో మా చుట్టూ పరచుకొని ఉంది. మధ్యాహ్నంవేళ సూర్యుని తీక్ష్ణకాంతిలో స్పష్టంగా నగ్న సత్యంగా నిర్వివాదంగా కనిపించిన వివిధ వస్తుమయమైన ఈ ప్రపంచాస్తికతను ఆ చంద్రకాంతి తన సుస్నిగ్ధ కిరణాలతో మంత్రించి సర్వం 'మాయ', 'భ్రాంతి' అనే సంశయానికి ఆస్పదం చేస్తూంది.

## ఎమర్సన్ కంఠస్వరం: కొన్ని అభిప్రాయాలు

ఎమర్సన్ కంఠస్వరంలో ఒక విచిత్రమైన శక్తి ఉంది. రంగస్థలం మీదగాని, సభావేదికపైనగాని, మరొక కంఠస్వరం ఏదీ నన్ను అంతగా ఆకర్షించ లేదు. స్వచ్ఛమైన భావం వివేకపూరితమైన స్వరంలో వినబడుతుంది. అది ఉదాత్త సంగీతసారస్యం స్ఫురించే దివ్యశ్రుతులను బోలినది. పద్యాలను ఆయన ఎక్కడ ఎలా నొక్కి లాగి చదివేదీ గుర్తులేనిదే, అసలు వాటిని మరొకరు సక్రమంగా చదవ గలగడం అసంభవం. ఆయన ఉదాత్త వచన రచనలను కూడా, ఆయన కంఠస్వరవిన్యాసాలతో పరిచయంలేనివారు

చదువుతూన్నప్పుడు నిజంగా వాటిలోని అందమంతా వెల్లడి కాదు; అలాంటి ఆ గంభీర కంఠస్వరానికి అయ్యో! ఈ భూమిపైన శాశ్వత మౌనముద్ర పడిపోయింది. బహుశః ఆయన, ఈ భూమిపైన తన సహచరులకు కాకుండా నేడు ఏ దివ్యలోక పురుషుల పుణ్య సమావేశాలలోనో తన కంఠ స్వర మాధుర్యాన్ని రుచిచూపిస్తూ ఉన్నాడు కాబోలు! ఇంద్రియ చాపల్యజన్యమైన విషయాలుగాని, ఇంద్రియానం దమే లక్ష్యంగాగల చవుకబారు చమత్కారాలుగాని, అల్ప శ్రావ్యతగాని మందుకైనా ఆయన ప్రసంగాలలో ఎక్కడా దొరకవు; కాని ఆయన గొంతులో నిష్కర్ష, నైశిత్యం, ఒక విలక్షణ మాధుర్యం ఉన్నవి. అందువల్ల ఆయన ఆత్మోద్దీపకమైన సర్వతంత్రస్వతంత్రమైన బుద్ధికి ఆ కంఠ స్వరం ఉచితమైన ఉపకరణంగా ఉపయోగపడింది.

ఆ కంఠస్వరంలో వైయక్తిక వైలక్షణ్యం ఉన్నప్పటికీ దానితోపాటుగానే ఒక విధమైన విశ్వజనీనతకూడా ఉండేది; ఏదో దైవిక శక్తి ఆయనలో నుండి మాట్లాడుతున్నట్లు ఉండేది. స్వీడన్‌బర్గ్‌ని గురించి ఆయన చేసిన ఒక ఉపన్యాసం ప్రారంభంలో; ముందుగా ఆ స్వీడన్ దేశపు యోగిస త్తిముని అభిప్రాయాలను సంగ్రహంగా వివరించడం మొదలుపెట్టాడు. ఆ అభిప్రాయాలు ఉదారమైనవిగా, మానవులందరూ — క్రైస్త వులూ, క్రైస్తవేతరులు కూడా — ఆమోదింప దగినవిగా ఉన్నాయి గనుక వాటిని ఆమోదించవలసినదిగా ఉపన్యాస కుడు ప్రబోధిస్తున్నట్టు కనిపించింది. కాని, ఈ వివరణ

పావుగంట సాగేసరికి ఉపన్యాసం చప్పగా, విసుగుదల పుట్టించేదిగా తయారయింది. ఎమర్సన్ ఆ స్వీడిష్ యోగికి శిష్యుడై నట్టున్నాడని ప్రేక్షకులలో గుసగుసలు ప్రారంభమైనవి. ఆ యోగి అభిప్రాయాలను వివరించడం పూర్తిచేసిన తరువాత ఎమర్సన్ ఒక అర నిమిషం సేపు మౌనముద్ర వహించాడు. ఆ తరువాత, సూటిగా హృదయాన్ని స్పృశించగల తన ఉచ్చైస్స్వనంతో, "అయితే ఎవరీ ఎమాన్యుయల్ స్వీడన్ బర్గ్?" అని ప్రశ్నించాడు. ఈ వాక్యాన్ని ఉచ్చరించేటప్పుడాయన స్వరంలో క్రమంగా అక్షరం అక్షరానికి స్థాయి హెచ్చింది. ఇది విద్యుద్ఘాతంలా పనిచేసింది. ప్రేక్షకులలో నెమ్మదిగా ఒక కునుకు తీయడానికి ప్రయత్నించే ధోరణిలో ఉన్నవారందరికి ఒక్కసారి మెలకువ వచ్చింది. ఉపన్యాసకుడు చిన్న చిన్న మెరుపుల్లాంటి వాక్యాలతో లోగడ తాను వివరించిన స్వీడన్ బర్గ్ అభిప్రాయాలను విమర్శించడం ఆరంభించాడు. అవి తనకే విసుగు పుట్టించేటట్టున్నవనీ, ఏమైనా తన ప్రేక్షకులకు మాత్రం తప్పకుండా విసుగు పుట్టించి ఉండవచ్చుననీ ఆయన అనేసరికి సభలో ఉన్నవారంతా ఆపైన ఆయన చెప్పబోయే అభ్యంతరాలన్నిటినీ శ్రద్ధగా వినడానికి సర్దుకొని కూచున్నారు. తత్ఫలితంగా, స్వీడన్ బర్గ్ మానవోత్తములలో చేరినవాడని, ఆ సభలోని వారందరికి విశ్వాసం ఏర్పడింది. అయితే అంత మాత్రాన వారంతా తమ మత విశ్వాసాలను మార్చుకొని, న్యూ జెరూసలేం సమావేశాలకు పరుగెత్తక పోవచ్చును;

కాని, ఆ మహనీయునియందు వారికి గౌరవభావం మాత్రం ఏర్పడింది.

మరొకసారి, షేక్స్పియర్ అద్భుత ప్రతిభను సదృష్టాంతంగా వివరించి, తక్కిన అందరు రచయితలను మించిన మహోన్నత స్థానానికి అతనిని ఎత్తివేసిన తరువాత, ఆ మహా కవి రచనలలోని పరమార్థాన్ని గురించిన విచారణ ప్రారంభించాడు. మొత్తముమీద షేక్స్పియర్ బోధించిన దేమిటి? "తాను చెప్పినట్లు వినే ప్రకృతి శక్తులను వినోదశక్తులుగా మార్చివేశాడు. మానవ మనోరంజనంలో ఆయన సాటిలేని సిద్ధహస్తుడు. విచిత్రమైన బాణసంచా కాలుస్తూ ఉంటే చూచినంత ఆనందం షేక్స్పియర్ మహాప్రతిభ ఈవేళ మనకు కలిగిస్తూంది. ఈ బాణ సంచా సామాన్యమైనది కాదు; శాస్త్రవిజ్ఞాన సామర్థ్యంవలన మనం తోకచుక్కలను, వివిధ గ్రహాలను, వాటి తాలూకు చంద్ర గోళాలను వాటి స్థానాలలోనుంచి లాగుకొనివచ్చి, వాటితో మన జాతీయోత్సవ దినాలను ఉద్దీపింప జేసుకొనడానికి గాను తయారుచేసిన అపూర్వమైన బాణసంచా. కనుక, మన మునిసిపాలిటీవారి బాణ సంచాకన్న ఇది చాలా విచిత్రమైనది." ఈ ప్రసంగమంతా వాడియైన, సాంద్రమైన, మంద్రస్వరంలో సాగింది. అచ్చు సిరాతో, అచ్చు అక్షరాలలో ఆ స్వరంయొక్క ఉదాత్తానుదాత్తాల శోభలో శతాంశం కూడా ఇక్కడ చూపడం సాధ్యం కాదు. క్రమంగా, మెల్లగా శ్రుతి హెచ్చిస్తూ ఆయన ఇలాఅన్నారు:

"'ఖొరాన్'లోని 'భూలోకం, నాకం - ఈ రెండింటికీ మధ్య నుండే సర్వం మనమే మన వినోదంకోసం సృష్టించు కొన్నామని గ్రహించండి' అన్న ప్రబోధాన్నే షేక్స్పియర్ రచనలు మనకు స్ఫురింప జేస్తాయి.'' ఎమర్సన్ కంఠస్వరం ఎక్కడ ఎలా హెచ్చినదీ నిజంగా సూచించాలంటే, ఈ వాక్యంలో ఈ రెండు టైపులే కాదు ఇంకా చాలా టైపులు వాడాలి; కాని అది సాధ్యం కాదు. "వినోదం కోసం" అన్నమాట ఆ వాక్యానికి శిఖరాయమానమైనదనే సంగతి ఆయన కంఠస్వర విన్యాసంవల్ల సులభంగా వ్యక్తమయింది.

"స్వాతంత్ర్య ప్రకటనలోని మిలమిల మెరసే పంక్తు''లని ఖొయేట్ అభివర్ణించిన అంశాల ప్రసక్తి తెచ్చి, ఎమర్సన్ మహాశయుడు, "మిలమిల మెరసే పంక్తులా? - కావు ధగధగ దీపించే జగత్సత్యాలు!'' అని విమర్శించేటప్పుడు ఆ మొదటి "మిలమిల మెరసే'' అనే అక్షరాలను ఉచ్చరించేటప్పుడు ఆ విశేషణం పట్ల ఆయన కంఠస్వరంతో వెల్లడించిన అసహ్య భావాన్ని సూచించడానికి ఆ అక్షరాలను భూతద్దంతో తప్ప చదువరానంత చిన్న టైపులో అచ్చువేసినా చాలదు; 'అలాగే ధగధగ వెలుగొందే జగత్సత్యాలు' అనడంలో పెద్ద శతఘ్ని ముఖతః వెలువడినట్లు ఉచ్చరించిన ఆయన కంఠస్వర సారస్యాన్ని సూచించడానికి ముద్రాక్షరశాల వారివద్ద ఉండే టైపులలో కల్లా మిక్కిలి పెద్ద టైపులు వాడినా కూడా ప్రయోజనం లేదు.

హెన్రీ డేవిడ్ థొరో ప్రతిభను గురించి, ప్రవర్తనను గురించి ఎమర్సన్‌కి గల ఉదారమైన, పరిపూర్ణమైన ప్రశంసాభావం బహు సందర్భాలలో బహువిధాల వ్యక్తమయింది. నేను కంకార్డ్‌లో సాంస్కృతిక విద్యాగోష్ఠిలో ఉపన్యసించడానికి తొలిసారి వెళ్ళినప్పుడు, మలిసారి వెళ్ళినప్పుడు. – వ్యక్తిత్వం గల పురుషులను గురించి ప్రస్తావన వచ్చినప్పుడల్లా ఆయన ప్రసంగించే విలక్షణమైన సాంద్ర ధోరణిలో ఆయన ఇలా అన్నాడు: "మీరు థోరోను గురించి తప్పకుండా తెలుసుకోవాలి. ఆయన మన నాగరకతతో విసిగిపోయి, ఈ లౌకిక జగత్తులో నుండి తనను తానే బహిష్కరించుకొని వాల్డెన్ అడవులలో ప్రవాస జీవితం గడపడానికి వెళ్ళాడు. అక్కడే ఉంటున్నాడు. ఆ అడవిలో తన కుటీరం తానే నిర్మించుకొన్నాడు; తన భోజనం తానే వండుకుంటున్నాడు; పన్నులు కట్టనంటాడు! ఏస్కిలెస్ రచనలు చదువుతూ ఉంటాడు; ఆచారాలను అనుకరణలను ఏవగించుకొంటాడు; – ఆయన ఒక మహాత్ముడు."

ఎమర్సన్‌కి ఆత్మనిత్యతా వాదం (spiritism) అంటే ఒక విధమైన ఏవగింపు మొదటినుంచీ ఉండేది. మరణించిన వారి ఆత్మలు దయ్యాలై వచ్చి, మన ఇంట్లో సామాన్లను తారుమారుచేస్తూ, ఆ విధంగా తాము ఇంకా జీవించే ఉన్నట్టు అల్పమర్త్యులమైన మనను తొలిసారిగా హెచ్చరించడానికి మొదలు పెట్టినప్పుడు, అమరత్వాన్ని గురించిన విశ్వాసాలను ధ్రువపరచడానికి క్రొత్త భోగట్టా సమకూరి

నట్టు, సంప్రదాయనిష్ఠులైన శిష్టులు చాలామంది భావించారు.

ఒక సందర్భంలో చాలామంది విజ్ఞులతోకూడిన ఒక గోష్ఠిలో ఈ సమస్యను గురించిన చర్చ వచ్చినప్పుడు ఎమర్సన్ ప్రదర్శించిన విసుగుదల తప్పకుండా చూచి తీర వలసినది. ముఖ్యంగా మరణించిన వారి ఆత్మలచేత మాట్లాడిస్తామంటూ, వారి బంధువుల దగ్గరనుంచి తలకొక షిల్లింగు వసూలుచేస్తూ, అదే తమ వృత్తిగా పెట్టుకుంటూన్న స్త్రీల మాట ఎత్తితే ఆయన అసహ్యించుకొనేవాడు. మొత్తం ఆ వ్యవహారమంతా ఆయనకు ఏదో బాధ, జుగుప్స కలిగించింది. ముఖ్యంగా తన మిత్రులలోనే కొందరు ఈ వ్యవహారంలో కొంతైనా నమ్మకం ఉన్నవారు కనిపించడం ఆయనకు మరింత చికాకు కలిగించింది. "కుట్టుపని చేసుకునే స్త్రీలు భూతమాంత్రికురాండ్రై అణాకొక ఆత్మచేత మాట్లాడిస్తున్నా" రని ఈ తతంగాన్ని ఆయన అభివర్ణించాడు.

ఎమర్సన్ సరసత చాలా గొప్పది. ముఖ్యంగా. ఆయన మహోన్నత భావనలను సక్రమంగా గ్రహించగల సహృదయులగోష్ఠిలో అది మరీ ప్రస్ఫుటంగా వికసించేది. తత్వవేత్తలలో తీవ్రవాదులు చాలా మంది ఒకనాడు సాయంకాలం ఆయన గృహంలోనే సమావేశమయారు. వారి ప్రసంగ ధోరణి సహజంగా, ప్రపంచాన్ని సంస్కరించడానికి ఉదారహృదయులు సూచించే వివిధ కార్య

క్రమాలవంకకు మరలింది. ప్రతివ్యక్తీ, సంఘంలోని సర్వా నర్థాలను నివారించగల ఏదో చింతామణి ప్రక్రియను సూచిస్తున్నాడు. ఆ చర్చ కొన్ని గంటలు సాగింది; — నిద్ర వేళ అయేలోగా — ప్రపంచంలో ఉన్న పాపం, దుఃఖం సర్వం ఈ ప్రపంచంలో నుంచి బహిష్కృతమై పోయింది; ఈ భూమి అంతా పూర్తిగా సంస్కరింపబడి మానవ దేవ తల మంగళ నివాసంగా తయారయింది, సౌశీల్యం, సౌఖ్యం సర్వమానవ సహజగుణాలయి పోయినవి. ఎమర్సన్ ఈ ప్రసంగాలన్నీ విన్నాడు. కాని, తాను మాత్రం దాదాపు మౌనవ్రతమే అవలంబించాడు. బహుశః ఆయన కూడా లామెన్నాయిస్ వలె, ఈ ప్రపంచంలో వాస్తవ సంఘట నలు మన ఆశయాలను అటకాయించకపోతే అచిరకాలం లోనే ఈ భూమిపైన బ్రతకడమే దుర్లభమై పోయే స్థితి ఏర్పడవచ్చునని అనుకుంటున్నాడేమో! చివరకు ఆ చర్చను ముగిస్తూ ఆయన ఇలా అన్నాడు: ''ముసలి ముత్తైదువు ల్లాగ మనమంతా హాయిగా సుఖంగా ఒక సాయంకాలం వెచ్చని చలికుంపటిచుట్టూ చేరి, మన యోచనలతో, మన ఆశలతో మన చుట్టూ గాలి గుమ్మటాలు కట్టుకొని వాటి పైన ఎగిరిపోతూ వస్తూ, చైతన్యమయమైన ఈ విశ్వమంతా వీరవిహారం చేస్తాము; మధురమైన ఆ జ్వరసంధి తీవ్రతలో మన భావాలకు ఎదురంటూ ఉండదు; ప్రత్యక్షంగా సంఘ సంస్కరణకు పూనుకునే సామాన్య సంస్కర్త ఆదినుండీ అడుగడుగునా ఎదుర్కొనవలసి వచ్చే వాస్తవ సన్నివేశా

లేవీ మనకు దారిలో ఎక్కడా అడ్డం తగులవు; మనం ప్రొద్దు పోయేటంతవరకు ఈ అపూర్వభావ జగద్విహారమంతా చేసిచేసి ఆ అలసటతో హాయిగా నిద్రపోతాము; కాని, మరునాడు ఉదయం నిద్ర లేచి చూచుకునే సరికి మనం మళ్ళీ ఎప్పటివలె సత్తువ లుడిగిన ముసలి వాళ్ళంగానే మిగిలిపోతు న్నాము. ఇది చాలా శోచనీయమైన సంగతి!''

అనుభవాతీత విజ్ఞానవాది (Transcendentalist) కూడా ఒక్కొక్కప్పుడు, కౌలీ చెప్పినట్టు ''అల్పాదృష్ట వశాత్తు'' తన సిద్ధాంతాలకు సమయానుకూలమైన వ్యాఖ్యా నం చెప్పకోక తప్పనిసరి అవుతుంది. ఇందుకు దృష్టాంతంగా సుమారు పదిహేను, ఇరవయ్యేళ్ళ క్రిందట, ''శనివారపు క్లబ్బులు'' స్థాపించబడిన తొలిరోజులలో ఒక విలక్షణ సంఘటన జరిగింది. ఎమర్సన్ అగాసిజ్ అనే అనుభవాతీత వాదితో మొదట కొంతసేపు చర్చించిన మీదట, స్వభావ వాది (Naturalist) గా వస్తువుల పుట్టుకను గురించి ఆయన ముఖ్యాభిప్రాయాలను సంగ్రహంగా తెలుపవలసినదిగా ఎమర్సన్ కోరాడు. అగాసిజ్ తన సహజ ధోరణిలో గట్టిగా, గబగబా చెప్పేసెయ్యడం మొదలుపెట్టాడు. సూక్ష్మదర్శనితో మాత్రమే చూడదగిన ''జీవకణం''తో ప్రారంభించాడు. అంతకన్న సూక్ష్మవస్తువేదీ మానవుడు ఇంతవరకు కనుగొన్న ఏ ఉపకరణంతోను చూడలేదు అన్నాడు. ఆ జీవకణం క్రమంగా పరిణామం పొందుతూ జంతుకోటిలో అత్యుత్తమ ప్రాణిదాకా ఎలా అభివృద్ధి

చెందిందీ వివరించాడు. ఈ సంగ్రహ నిర్వచనానికి ఆయనకు అరగంట పట్టింది.

ఎమర్సన్ అందుకుని, "అయ్యా! మీ తత్త్వశాస్త్ర మంతా పశుజాతి పరిణామక్రమాన్ని చెపుతుంది లాగుంది. పైగా – మీ శాస్త్రం కాలంయొక్క వాస్తవికతమీద ఆధారపడినది. కాని, మాబోటి వాళ్ళం కొందరం, కాలం మానవ భావనా కల్పితమైన ఒక ఊహామాత్రమే కాని, దానికి వేరే అస్తిత్వం లేదన్న కాంట్ సిద్ధాంతాన్ని విశ్వ సిస్తామన్న సంగతి తాము గ్రహించాలి." అంటూనే తన గడియారంతీసి చూచుకున్నాడు. తానా సాయంకాలం సకాలంలో కంకార్డ్‌కి చేరుకోవాలంటే 'ఫిచ్ బర్గ్ రైల్‌రోడ్డు' స్టేషనుకు వెళ్ళడానికి ఇక పదిహేను నిమి షాలే వ్యవధిఉంది. వెంటనే తన హాటు తీసుకుని ఓవర్‌కోటు తొడుక్కుని, ఆ గదిలోనుంచి గబగబా వెళ్ళిపోతూ "ఈ విషయాన్ని గురించి నాకు వేరేపని తొందర లేని మరో సమయంలో మాట్లాడుకుందాం లెండి," అని అగాసిజ్ దగ్గర సెలవు పుచ్చుకున్నాడు. తరువాత సంవత్సరాలు గడిచి పోయినవి; ఆ స్వభావవాదీ, ఈ అతీతానుభవవాదీ ఒక క్లబ్బులో కలుసుకొన్నారు. మళ్ళీ ఇద్దరిలో ఎవరైనా ఆ విషయమైన ప్రసంగం తెస్తారేమో అని నేను ఆతురతతో ఎదురుచూశాను. కాని ఫలితం లేకపోయింది. మళ్ళీ వారా విషయాన్ని ఎన్నడూ మాట్లాడుకోలేదనే నా నమ్మకం.



# మార్క్ ట్వెయిన్

## 1835-1910

ప్రత్యక్షలాది పాఠకులకు మార్క్ ట్వెయిన్‌గా పరిచితుడై, వారి ప్రేమకు పాత్రుడైన శామ్యుయల్ ఎల్. క్లెమెన్స్ మిసిసిపీ నదీతీర పట్టణమైన మిస్సోరీలోని హానిబాల్‌లో జన్మించాడు. ఆ ప్రాంతమే ఆటు తరువాతి కాలంలో 'టామ్‌సాయర్', 'హాకల్ బెరీఫిన్' అనే అతని అమర గాథలకు రంగస్థలమైంది. సంచార ముద్రాపకుడుగాను, మిసిసిపీ లాంచీల చోదకుడుగాను, గనుల కార్మికుడుగాను, వార్తాపత్రికా రచయితగాను పనిచేసి, మార్క్ చివరికి కాలిఫోర్నియాలో స్థిరపడే నాటికి హాస్య రచయితగాను, ఉపన్యాసకుడుగాను మారాడు.

అయినా, అనంతరకాలంలో హాస్యరచనను మించి చాలా ముందుకుపోయాడు. గొప్ప నవలా రచయితగాను, అమెరికా ప్రజలనూ, ఆ కాలాన్నీ వ్యాఖ్యానించి చెప్పిన [illegible] గాను, ఉపన్యాసకుడుగాను ఆయన అంతర్జాతీయ గౌరవాన్నీ, ప్రశంసలనూ చూరగొన్నాడు.

ఈ క్రింది కథ "మిసిసిపీ నదిమీద వెనుకటి రోజులు" అనే రచననుండి గ్రహించబడినది. అది మొదట "అట్లాంటిక్ మంత్లీ"లో ముద్రితమై తరువాత "మిసిసిపీ నదిమీది జీవితము" అనే గ్రంథంలో చేర్చబడింది.]

# నౌకా చోదక శిక్షణ

'పాల్‌జోన్స్' నౌక చల్లగా సెంట్ లూయీ దిక్కు పోతూంది. ఆ నౌకా చోదకుణ్ణి వశపరచుకొనడానికి నేను పెద్ద పన్నుగడ పన్నాను. మూడు రోజులు క్రిందా మీదా పడ్డపర్వాత చివరికి అతడు లొంగివచ్చాడు. అయిదు వందల డాలర్లకు - ఆ డబ్బు నేను ఆ విద్యలో పట్టభద్రుణ్ణయిన తర్వాత సంపాదించే మొదటి జీతంలోనుంచి ఇచ్చే షరతుతో - అతడు మిసిసిపీ నదిని న్యూ ఆర్లియన్స్ లగాయితు సెంట్ లూయీవరకు నాకుపరిచయంచేయడానికి అంగీకరించాడు. అప్పటి నా వయస్సుకి సహజమైన ఆత్మవిశ్వాసంతో మిసిసిపీ మహానదిమీద 12, 13 వందలమైళ్ళ నౌకాయానాభ్యాసమనే ఆ చిన్న ఉద్యమానికి నేను పూనుకున్నాను. ఆ పనికి ఆవశ్యకమైన అర్హతలలో నాలో కొరవడిఉన్న వేవో నాకు తెలిసిఉంటే ఆ పనికి పూనుకునే సాహసం నాకుండేదికాదు. నౌకా చోదకుడు చేయవలసినదల్లా నౌకనెప్పుడూ నదిమధ్య ఉంచడమేగదా అనుకునేవాణ్ణి! ఆ నది అంత వెడల్పుగా ఉండటంవల్ల ఆ పనికి విశేష నైపుణ్యం అవసరమని నాకు తోచలేదు.

సాయంత్రం 4 గంటలకు మా నౌక న్యూ ఆర్లియన్స్‌ను వదలిపెట్టింది. అప్పటినుంచి సాయంత్రం 8 గంటలదాకా మా వంతు. మా నాయకుడైన బిక్స్‌బీ నౌకను గట్టువెంట నిలచిఉన్న నౌకల వెనుకభాగాలకు చేరువగా పోనిస్తూ, ''ఇంక నువ్వు నడుపు. ఆ స్టీమర్లకు ఆపిల్ పండందుకునేటంత చేరువగా పోనియ్యి'' అన్నాడు. నేను చక్రం తీసుకున్నాను. నా హృదయస్పందన సంఖ్య వందలలో పడింది; కారణం – ఆ వరుసలోఉన్న ప్రతి నౌక పార్శ్వభాగంతోను మా నౌక రాచుకోబోతూందని నే ననుకునేవాణ్ణి; ఆ నౌకల కంత దగ్గరగా పోతున్నాం. నేను ఊపిరి బిగబట్టి ప్రమాదం తప్పించడానికి మా నౌకను దూరంగా తీసుకెళ్ళడం మొదలు పెట్టాను. అలాటి ప్రమాదాల్లోకి లాక్కెళ్ళడంతప్ప వేరేమీ తెలియని మా నౌకా చోదకుని విషయంలో నాకు చిత్ర మైన ఊహలు తోచినవి; అయితే నా వివేకం వాటిని బయటపెట్ట నివ్వలేదు. ఒక అర నిమిషంలో మా పాల్‌జోన్స్‌కీ ఇతర నౌకలకీ మధ్య సురక్షితమైన అంతరం ఉండేట్టు మా నౌకను పోనిచ్చాను. అయితే ఆ తరువాత పది సెకనులకు అవమానకరంగా నన్ను మానిపించేసి, బిక్స్‌బీ మళ్ళీ ప్రమాదకరంగా ఇతర నౌకలకు దగ్గరగా మా నౌకను తోలుతూ, నాభయానికి నిందిస్తూ మాటలతో నన్ను చిత్రవధ చేశాడు. నాకు చాలా కష్టంతోచింది; కాని, మా నాయకుడు ఎంతో ఆత్మ విశ్వాసంతో చక్రానికి ఇటూ, అటూ ఊగుతూ, ఎప్పటికప్పుడు ప్రమాదం తప్ప

దనిపించేటంతగా ఇతర నౌకలకు చేరువగా మా నౌకను నడిపిస్తూన్న కౌశలాన్ని ప్రశంసించకుండా ఉండలేక పోయాను. అతడు కొంచెం శాంతించిన తర్వాత నాతో - ప్రవాహానికి ఎదురు వెళ్ళేటప్పుడు ఒడ్డున వడి తక్కువగాను, మధ్య ఎక్కువగానూ ఉంటుందనీ, అందుచేత అటువంటప్పుడు గట్టునే అంటిపెట్టుకుని ఉండాలనీ, నదికి దిగువకు వచ్చే టప్పుడు మాత్రం ప్రవాహపు వడిని ఉపయోగించుకుంటూ, నది మధ్యగా పోవాలనీ చెప్పాడు. నదికి ఎగువ ప్రయాణము వివేకరహితులైనవారికి వదలి, నేను నదికి దిగువ ప్రయా ణాల్లోనే చోదకుడుగా ఉండాలని నా మనస్సులో నిశ్చయం చేసుకున్నాను.

అప్పుడప్పుడు బిక్స్బీ ఏదో విషయాన్ని నా దృష్టికి తెస్తూ ఉండేవాడు. 'ఇదిగో - ఇది ఆరుమైళ్ళ పాయింటు' అన్నాడు. నేను 'ఓహో!' అన్నాను. అది సంతోషం కలిగించే భోగట్టాయే! అయితే, దానివల్ల ప్రయోజన మేమిటో మాత్రం నాకు బోధపడలేదు. అది నాకు అవసర మైన విషయమని నాకు తెలియదు. ఇంకోసారి అతను 'ఇది తొమ్మిదిమైళ్ళ పాయింటు' అన్నాడు. అలాగే మళ్ళీ కొంతసేపటికి 'ఇది పన్నెండుమైళ్ళ పాయింటు' అన్నాడు. అవన్నీ నీటి అంచుకీ, మట్టానికీ సంబంధించిన విషయాలు; అవన్నీ ఒక్క రకంగానే నాకు కన్పించినవి; విసుగు పుట్టించే టంత నిర్జీవంగా ఉన్నవి ఆ విషయాలు. బిక్స్బీ విషయం మారుస్తాడని ఆశపడ్డాను. కాని, ఎంతకూ మార్చడు. ఒక

'పాయింట్' వచ్చిందంటే ప్రేమగా. ఆతీరాన్ని వర్ణిస్తూ, దానిని గురించే మాట్లాడుతూ ఇలా అనేవాడు: 'ఈ చీనాచెట్ల గుబురు కెదురుగా వడి తక్కువగా ఉండే నీరు అంతమై పోతుంది. ఇక మనం నౌకా గమనం మార్చాలి'. నౌకా గమనం మార్చాం. ఒకటి, రెండు సార్లతడు చక్రం నా కిచ్చాడు: అయితే నాకదృష్టం లేదు. ఏ చెరుకుతోట గట్టుకో తగలబోవటమో, లేక ఒడ్డుకి చాలాదూరంగా వెళ్ళిపోవడమో జరిగింది. అందుచేత మళ్ళీ అవమానంతో తప్పుకుని తిట్లకు గురికావలసి వచ్చింది.

చివరికి ఎలాగో మావంతు పూర్తిఅయింది. మేము భోజనాలుచేసి పడుకున్నాం. అర్ధరాత్రి సమయానికి ఒక లాంతరు వెలుగు నాకళ్ళమీద పడింది. రాత్రి కాపలా వాడు – 'త్వరగా లేచిరా!' అన్నాడు.

అని అతడు వెళ్ళిపోయాడు. ఈ అసాధారణ చర్యని నే నర్థంచేసుకోలేక పోయాను. అర్థం చేసుకోవాలనే ప్రయత్నంకూడా విరమించి మళ్ళీ నిద్రకు పడ్డాను. అనతికాలం లోనే మళ్ళీ కాపలావాడు ప్రత్యక్షమయాడు. ఈసారి వాడి ప్రవర్తన మొరటుగా ఉంది. నేను కంగారుపడుతూ అడిగాను :

"ఈ అపరరాత్రివేళ ఎందుకు ఇలా వచ్చి నన్ను వేధిస్తావు? ఒకసారి మెళకువ వచ్చిందంటే నాకు మళ్ళీరాత్రంతా నిద్రపట్టదు తెలుసా?"

కాపలావాడు – "బాగానే ఉంది వరుస!" అన్నాడు.

పూర్తి అయిన వంతువాళ్లు అప్పుడే లోపలికి వస్తున్నారు. వాళ్లు అతి దారుణమైన వికవికలతో పగలబడిపోవడం, "ఓహోయ్! కాపలాదారూ! క్రొత్త నావికుడింకా లేవలేదా ఏమిటి? బహుశః పసివాడై ఉంటాడు. పాపం! నోట్లో ఇంత చక్కెరపోసి, జోలపాట పాడటానికి దాదికి కబురంపించు"— ఇలాంటి మాటలంటూ ఉండటం నేను విన్నాను.

అప్పటికి బిక్స్బీ కూడా అక్కడికి వచ్చాడు. ఆ తరువాత సుమారొక నిమిషానికి నావికుని దుస్తుల్లో కొన్ని తొడుక్కొని, కొన్ని చేతుల్లో పట్టుకుని హడావిడిగా 'చోదకగృహం' (Pilot-house) మెట్లు ఎక్కుతున్నాను. నా వెనకనే నా చర్యని విమర్శిస్తూ బిక్స్బీ వస్తున్నాడు. ఇది కొంత చిత్రంగానే అనిపించింది - అర్ధరాత్రివేళ లేవడం, పనిచేయవలసి రావడం. నౌకాచోదక వృత్తిని గూర్చి ఆలోచించినప్పుడు ఈ అంశం నా కెప్పుడూ తట్టనే లేదు. నౌకలు రాత్రిళ్లుకూడా ప్రయాణిస్తూ ఉంటాయని నాకు తెలుసు. కాని, ఎందుచేతనో - ఎవరో ఒకరు తమ వెచ్చని పడకను వదలిపెట్టి ఆ నౌకను నడుపుతూ ఉండాలనే ఊహే నాకు రాలేదు. నే ననుకున్నంత సరదా అయిన వృత్తి కాదేమో ఈ నౌకాచోదకవృత్తి అనే భయం ఒకటి నాలో అంకురించింది. క్రొత్తగా తెలిసిన ఈ విషయంలో ఏదో వాస్తవికత, మిగిలిన పనుల్లోలాంటి కష్టం కనిపించినవి.

చాలాభాగం నక్షత్రాలు కనిపిస్తూనే ఉన్నప్పటికీ,

అది ఒక గ్రుడ్డి రాత్రి. అప్పుడు మా ప్రధాన నావికుడు చక్రం ముందున్నాడు. ఒక నక్షత్రానికి సూటిగా మా నౌకను నడుపుతున్నాడు; సరిగ్గా నదికి మధ్యగా ఓడ పోతూంది. ఇటూ, అటూ గట్లు అరమైలు దూరం కంటె ఎక్కువ లేవు; కాని, ఆశ్చర్యకరంగా అవి ఎంతో దూరాన ఉన్నట్లు, అస్పష్టంగా అలుక్కుపోయి కన్పిస్తున్నాయి. ఒక నావికుడు మా నాయకుడితో అన్నాడు:—

"జోన్స్ తోటల దగ్గర మన మాగవలసి ఉంటుందండి!"

నాలో ఉన్న కసి అంతా ఒక్కసారి పైకుబికింది. లోలోపలే అనుకున్నాను: "నీ వృత్తిలో ఉన్న సుఖం తెలిసి వస్తుందిలే బిక్స్బీ! ఇటువంటి నిశిరాత్రివేళ జోన్స్ తోటలు గుర్తించేటప్పటికి నీ పని అవుతుంది. నువ్వు బతికుండగా ఆ తోటలు గుర్తించలేవు."

బిక్స్బీ ఆ నావికుణ్ణి అడిగాడు: "ఆ తోటల ఎగువ కొసదగ్గిరా, దిగువ కొసదగ్గిరా - ఎక్కడ ఆగాలి?"

"ఎగువ కొసదగ్గరే నండి."

"అది వీలులేదు. ఈ సమయంలో అక్కడి మోళ్లు (stumps) నీటిలో మునిగిపోయి ఉంటవి. అయినా అది దిగువకొసకి ఏమంత దూరంకాదు. మీా రెట్లాగో సర్దుకుపోవాలి."

"అలాగే నండి. జోన్స్ (నౌకమీాద సామాను మోసేవాడు)కి ఇష్టంలేక పోయినా సామాను అక్కడదాకా

చేరవేయవలసిందే నండి; తప్పనిసరి అయినప్పుడేం చేస్తాం?''

అలా అని ఆ నావికుడు వెళ్లిపోయాడు. నాలో కసి నెమ్మదిగా శాంతించి, ఆశ్చర్యం పెల్లుబుక సాగింది. అటువంటి కాళరాత్రివేళ ఆ తోటలను గుర్తిస్తా ననడమే కాకుండా ఆ తోటల కొసలలో దేన్నైనా గుర్తించగలననే పెద్ద మనిషిని చూస్తే నాకు నవ్వు వచ్చింది. అతనిని ఒక ప్రశ్న అడగాలని నాకు మహా అనిపించింది. కాని, నా సామాను గది నిండిపోయేటన్ని ముక్తసరి జవాబులు అప్పటికే పొంది ఉండటంవల్ల ఆ ప్రశ్న వేయకుండా ఊరుకున్నాను. బిక్స్బీని నే నడుగుదామనుకున్న ప్రశ్న చాలా సామాన్యమైనది. "అన్ని తోటలూ సరిగ్గా ఒకేవిధంగా ఒకేరంగులో కనిపించే అలాంటి కాళరాత్రివేళ ఆ తోటలను గుర్తించగలనని నిజంగానే భావించేటంత మూర్ఖుడవా నువ్వు?'' అని. కాని, నేను తమాయించాను. ఆ రోజులలో నాకు తరుచు వివేకయుతమైన అంతరాత్మ ప్రబోధాలు కలుగుతూ ఉండేవి.

బిక్స్బీ నౌకను గట్టుదగ్గరగా పోనిచ్చి పట్టపగలు పోనిచ్చినంత ధైర్యంగా గట్టునొరుసుకొని నడుపుతున్నాడు. అంతే కాదు; సంగీతం పాడుతున్నాడు :

"దివి లోని ఓ పితా !
దినమంత మవుతూంది...''

(Father in heaven ! the day is declining etc.,)
ఒక విచిత్రమైన అజాగ్రత్త మనిషి చేతుల్లో నా ప్రాణాలు

పెట్టాననిపించింది. అంతలో అతను నావేపు తిరిగి అడిగాడు:-

"న్యూ ఆర్లియన్స్ వదలిన తర్వాత వచ్చిన మొదటి పాయింట్ ఏమిటి?"

నేను వెంటనే జవాబు ఇవ్వగలిగినందుకు చాలా సంతోషించాను. "నాకు తెలియదు" అని వెంటనే జవాబిచ్చాను.

"తెలియదూ?"

ఆ ప్రశ్న ధోరణిచూచి నేను ఉలిక్కిపడ్డాను. మళ్లీ అవమానంతో కుంచించుకు పోయాను. కాని, ఇందాకటి సమాధానమే పునశ్చరణ చేయక గత్యంతరం లేదు.

"బాగుంది - నువ్వు చాలా తెలివైన వాడివిలా గున్నావు! పోనీ ఆ తర్వాత పాయింట్ ఏమిటి?"

మళ్లీ - "నాకు తెలియదు."

"పోనీ ఇలాఅడుగుతాను. నేను చెప్పిన పాయింట్లలో, లేక స్థలాల్లో ఏదైనా ఒకటి చెప్పు!"

కొంతసేపు ఆలోచించాను. కాని, చెప్పలేనని నిశ్చయానికొచ్చాను.

"ఇలా చూడు! 12 మైళ్ళ పాయింట్ దాటిన తర్వాత ఎక్కణ్ణించి మనం ప్రక్కకి తిరిగాం?"

"నాకు...నాకు...తెలియదు."

"నీకు...నీకు...తెలియదేం?" ఈడుస్తూ, నిద్ర పోతుగా మాట్లాడే నా పద్ధతి ననుకరిస్తూ అన్నాడు. అయితే మరి ఏం తెలుసు నీకు?"

"నాకు ... నాకు ... ఏమీ తెలియదు ... నిశ్చయంగా!"

"అరి భగవంతుడా! ఎరక్కపోయి నిన్ను నమ్మాను. నీ అంతటి మొద్దుని నే నిదివరకు చూడలేదు; వినలేదు. నువ్వు నౌకా చోదకుడి వెలా కాగలవు? సరిగా ఒక ఆవునైనా ఒక సందులో నుంచి తోలుకురాలేని నువ్వు!"

అతని ఆగ్రహం తారస్థాయికి వెళ్లింది. అతడు నరాల దౌర్బల్యం గల మనిషి; క్రింద నేల కాలిపోతున్నట్టు చక్రానికి ఇటునుంచి అటు మారాడు. కొంతసేపలా లోలోపల దహించుకుపోయి, మళ్లీ నన్ను తిట్టటం మొదలు పెట్టాడు:

"ఇలా చూడు! నేనా పాయింట్ల పేర్లు నీకు చెప్పిం దెందుకని నీ ఉద్దేశం?"

వణికిపోతూ ఒక నిమిషంపాటు ఆలోచించాను. చివరికి దుర్బుద్ధి ప్రోత్సహించగా ఇలా అనేశాను:

"అదా? సరదాగా కాలక్షేపం కావటంకోస మనుకున్నాను."

ఆ మాట అగ్నికి ఆజ్యం చేర్చింది. బ్రహ్మాండమైన ధాం ధూములతో అతడు (అప్పుడు నది కడ్డంగా నౌకను తోలుతున్నాడు) ఒళ్లు మరచిపోయాడు. గ్రుడ్డివాడయిపోయాడేమో అనుకున్నాను; ఎందుచేతంటే - అతడా ప్రక్కన పోతున్న ఒక వాణిజ్య నౌక చుక్కాని వైపుకు పరువెత్తాడు. అయితే - ఆ వాణిజ్య నౌకలోని వర్తకులనుంచి మమ్మల్ని

ఉద్దేశించి, దారుణంగా నిందావాక్యాలు మాకు వినిపిస్తున్న మాట నిజమేననుకోండి. బిక్స్బీ వంటి కృతజ్ఞుడు మరొక డుండడు. ఏమంటే అతడు క్రోధంతో తూలి తూలిపోతూ వారికి ఒక్కటి పొల్లుపోకుండా అన్ని మాటలూ తిరిగి అప్ప జెప్పాడు. ఒక కిటికీ తెరచి, తల బయటికిపెట్టి, నే నెప్పుడూ ఎరుగనంత బ్రహ్మాండంగా విజృంభించాడు. ఆ వర్తకుల తిట్లు దూరమై, అస్పష్టమౌతున్నకొద్దీ బిక్స్బీ గొంతు మరీ రెచ్చింది; అతడు వాడే విశేషణాల తీవ్రత హెచ్చింది. కిటికీ మూసేసరికి అతడు పూర్తిగా ఖాళీ అయిపోయాడు. అతడు వాళ్ల తల్లుల శీలందాకా పోలేదన్న మాటే గాని, మిగిలిన అన్ని రకాల తిట్లూ తిట్టాడు. తర్వాత నాతో అతి మృదువుగా అన్నాడు :

"చూడబ్బాయి! నువ్వొక చిన్న నోట్‌బుక్ పెట్టుకో! నేనేదైనా సంగతి చెప్పినప్పుడల్లా దాంట్లో వ్రాసుకుంటూ ఉండు. నౌకా చోదకుడు కావటానికి ఒకే మార్గం ఉంది. అది – ఈ నదినంతటినీ కంఠోపాఠం పట్టడం. ఏ,బి,సీలు నేర్చు కున్నట్టుగా ఈ నదిని ఆద్యంతం నేర్చుకోవాలి."

అది నా కొక విషాదకరమైన ఆవిష్కరణ; ఎందు చేతంటే, నా జ్ఞాపకశక్తిని గుల్లులేని వినోదపు తూటాలతో తప్ప ఎప్పుడూ దట్టించలేదు. అయినప్పటికీ – ఆ నిరుత్సా హం నాలో ఎంతో సేపు నిలువలేదు. అతని మాటలలో చాలా భాగం కొట్టెయ్యవచ్చు అనుకున్నాను. నిస్సందే హంగా బిక్స్బీ మాటల్లో కొంత అతిశయోక్తి ఉన్నట్లు

నాకు తోచింది. అతడు ఒక త్రాడు లాగి పైన వ్రేలాడే పెద్ద గంటమీద కొన్ని దెబ్బలు కొట్టాడు. అప్పటికి నక్షత్రాలన్నీ అస్తమించినవి. సిరా పులిమినంత నల్లగా ఉంది రాత్రి. గట్టుమీద బళ్ళచక్రాల చప్పుడు వినిపిస్తాంది; కాని, గట్టు విస్పష్టంగా నాకు కన్పించటం లేదు. 'డెక్' మీదనుంచి కాపలావాడి గొంతు వినిపించింది.

"ఇదే ప్రాంతమండీ?"

"జోన్స్ తోటలు"

నాలో నేననుకున్నాను: "ఇది ఎంత మాత్రం జోన్స్ తోట కాదని చిన్న పందెం వేస్తే?" కాని, పెదవి విప్పలేదు. ఆగి ఏం జరుగుతుందో చూస్తున్నాను. బిక్స్బీ 'ఇంజను గంటలు' ప్రయోగించాడు. నిర్ణీత కాలానికి ఓడ ఒడ్డు చేరుకుంది. ముందరి 'డెక్' (Fore castle) మీద నుంచి ఒక టార్చి లైట్ వెలుగు కనిపించింది; ఒక మనిషి ఒడ్డుకు దూకాడు. గట్టుమీద ఒక నీగ్రో కంఠం అంటున్నది: "జోన్స్గారూ! మా తివాసీల మూట యాడుందండీ?" ఆ మరుక్షణం మళ్ళీ మా ఓడ నదిలో ప్రయాణంచేస్తాంది. నేను తీవ్రంగా ఆలోచించి, లోలోపల అనుకున్నాను: "ఈ తోటను గుర్తించడం ఎప్పుడూ కనివిని ఎరుగనంతటి అదృష్టవంతమైన యాదృచ్ఛిక సంఘటన; మళ్లీ ఇలాంటిది వంద ఏళ్ళలోపుగా జరగటానికి వీలులేదు." అది యాదృచ్ఛిక సంఘటనే అని నా సంపూర్ణ విశ్వాసం.

7,8 వందల మైళ్ళు నదికి ఎగువగా ప్రయాణించే

సరికి పగటిపూట నదికి ఎగువగా చోదకత్వం నెరపటం కొంతవరకు అలవడింది; ఇక సెంట్ లూయీ చేరుకునే లోపుగా రాత్రి పనిలో కూడా స్వల్పంగా ముందంజ వేశాను; అయితే అది చాలా స్వల్పం. ఒక నోట్ బుక్ పెట్టాను; పట్టణాలు, పాయింట్లు, హోటళ్ళు, లంకలు, వంపులు, రేవులు, మొదలైన భోగట్టాతో దాన్ని నింపే శాను. అయితే ఆ భోగట్టా నోట్ బుక్‌లోకి మాత్రమే ఎక్కింది; దానిలోని లవలేశం కూడా నా బుర్రలో కెక్క లేదు. నదిలో సగం భాగమే నేను నోట్ చేసుకోగలిగానే అని నాహృదయంలో బాధగా వుంది. కారణం – మావంతు పగలూ, రాత్రీ కూడా నాలుగేసి గంటల కొకసారి మాత్రమే! ఇక–నేను నిద్రకు పడ్డప్పుడల్లా నా పుస్తకంలోని నాలుగు గంటల వ్యవధానం మరింత దీర్ఘమయేది.

అంతలో మా నాయకుణ్ణి న్యూ ఆర్లియన్స్‌పోయే ఒక పెద్ద ఓడవాళ్ళు చోదకుడుగా మాట్లాడుకున్నారు. మూటా ముల్లె సర్దుకుని నేనూ అతని వెంట బయల్దేరాను. ఆ ఓడ బ్రహ్మాండంగా ఉంది. అందులోని చోదక గృహంలో నేను నుంచున్నప్పుడు నీటి మట్టానికి ఎంత ఎత్తుగా ఉన్నా నంటే, నన్నొక చిన్న కొండలాంటి ఒక మంచెమీద ఎక్కించినట్టుంది. నాకు దిగువగా ముందూ, వెనకా 'డెక్కు'లు పరచినట్లు విశాలంగా వ్యాపించి ఉన్నవి. ఆ చిన్న 'ఫాల్ జోన్స్' నాకే చాలా పెద్దదని నేనెలా అనుకో గలిగానా అని ఆశ్చర్యపోయాను. దానికీ, దీనికీ హస్తిమ

శకాంతర మున్నది. ఆ 'పాల్ జోన్స్' మీది చోదకగృహం చవకబారుగా, ఎగుడు దిగుడుగా ఉన్న ఒక డొక్కు; చాలి నంత స్థలమే లేదు. మరి ఇక్కడ - ఇదొక దివ్యమైన అద్దాల మందిరం; డాన్సుపార్టీ పెట్టుకోడానికి సరిపోయేటంత స్థలం ఉంది. కిటికీలకు కొట్టవచ్చేట్టు ఎర్రనివీ, బంగారువన్నెవీ తెరలు వ్రేలాడుతున్నవి. ఆకర్షణీయంగాఉన్న ఒక సోఫా, బాతాఖానీకోసమూ, 'నదిని తిలకించడం' కోసమూ వచ్చే అతిథి చోదకులకోసం వేసిన ఎత్తైనబెంచీకి తోలుమెత్తలూ, రంపపుపొట్టుతో నింపిన కొయ్యతొట్టెలకు బదులు ఉమ్మి వేసుకోడానికి మెరుస్తూన్న అందమైన తొట్టెలూ, నేలకు క్రొత్తమైనపు గుడ్డా, శీతకాలానికి వెచ్చని పెద్దకుంపటీ, నా తల ఎత్తున విలువైన నగిషీపనితో కూడిన చక్రం, దానికి కట్టి ఉన్న తీగెతో చేసిన 'నిరోధక సూత్రం' (tiller rope), గంటలకు తళతళలాడే ఇత్తడి గుబ్బలూ, రాత్రింబవళ్లు వంతుమధ్యలో జెల్లీలు, ఐస్ క్రీములూ, కాఫీలూ అందించే పరిశుభ్రమైన నల్లని దుస్తులు ధరించి నడుముకి తెల్లగుడ్డలు చుట్టుకున్న సర్వర్లూ - ఆ శోభ వర్ణింప శక్యంకాకుండా ఉంది.

ఇది కొంత 'సుమారుగా' ఉన్నట్టు తోచింది. అందు చేత - తీరాచూస్తే నౌకా చోదకవృత్తి సరదా అయినదే అనే నమ్మకం, ధైర్యం నాకు కలుగసాగినవి. ఓడ కొంచెం సాగిన వెంటనే ఆ మహానౌక నాలుగు మూలలా సందర్శించి ఆనందంలో ఓలలాడాలని బయలుదేరాను. ఓడ ఎక్కడ చూచినా అతిథిమందిరం (drawing room) అంత శుభ్రంగా

సున్నితంగా ఉంది. పొడుగాటి, బంగారు మలామా చేసిన ప్రయాణీకుల శాలలోకి చూస్తే – అత్యద్భుతమైన ఒక గుహ లోకి (tunnel) చూస్తున్నట్టుంది. ప్రతి ముఖ్యమైన కాబిన్ తలుపుమీదా సిద్ధహస్తుడైన చిత్రకారు డెవడిచేతో వ్రాయించిన ఒక తైలవర్ణచిత్రం అందాలొలుకుతూంది. అసంఖ్యాకమైన దీప వృక్షాలతో ఓడ శోభాయమానంగా ప్రకాశిస్తున్నది. గుమాస్తాగది బ్రహ్మాండంగా ఉంది; ఇక హోటల్ పరమాద్భుతం! ఆ హోటల్ యజమాని దుస్తులు వగైరా నమ్మశక్యం కానంత విలువైనవి. బాయిలర్ ఉండే డెక్ (ఓడ రెండో అంతస్తు) ఒక ప్రార్థన మందిరమంత విశాలంగా ఉన్నట్టు నాకు తోచింది. ముందు డెక్ విష యమూ అంతే! ఇక – డెక్ నౌకర్లూ, బొగ్గు వేసేవాళ్లూ, కూలీలు (roust-abouts) చాలీ చాలకుండా ఉండడమనేది లేదు. ఒక దళానికి దళం వాళ్లు ఉన్నారు. ఒక పొడుగాటి పంక్తిగా తీర్చిఉన్న పొయ్యిలలో నిప్పు కణకణలాడుతూ మండుతూంది. వాటిమీాద ఎనిమిది పెద్ద బాయిలర్లు! ఇది నిజంగా వర్ణనాతీతమైన సౌభాగ్యం! ఇక ఆ ఇంజన్ల సంగతి చెప్పనే అక్కరలేదు. నేను అంత ఉత్సాహం ఎప్పుడూ పొందలేదు. పరిశుభ్రంగా ఉన్న ఆ సేవకబృందం నన్ను గౌరవంగా 'అండీ' అంటూ మన్నిస్తూ ఉండడంతో నా సంతృప్తి పరాకోటి నందుకొన్నది.

నేను చోదకగృహానికి తిరిగివచ్చేసరికి సెంట్ లూయిా దాటిపోయాం; ఎక్కడున్నామో నాకేమిా అంతుపట్టలేదు.

నదిలోని ఈ భాగం పూర్తిగా నా నోట్ బుక్ లో వ్రాసి పెట్టుకొన్నదే! అయినా, నాకు తలా, తోకా తెలియడం లేదు. అంతా తలక్రిందులుగా ఉంది. ఎగువకు వస్తూ నే నా నదీభాగాన్ని చూశాను. అప్పుడు వెనక్కి తిరిగి చూచి అలా చూచినప్పుడు ఏ విధంగా కన్పిస్తుందో నేను గమనించ లేదు. నాకు మళ్ళీ గుండెల్లో రాయిపడింది; ఏమంటే – ఈ దుష్కరమైన నదిని నేను ఎగువకూ దిగువకూ కూడా కంఠస్థం చెయ్యాలని స్పష్టమైపోయింది.

చోదకగృహం నిండా బోలెడంతమంది చోదకులు ఉన్నారు; 'నదిని తిలకించడం' కోసం దిగువకు ప్రయాణిస్తున్నారు వారు. 'ఎగువనది' గా ప్రసిద్ధమైన భాగం (సెంట్ లూయీకీ, ఓహియో ఉపనది వచ్చి కలిసే కెయిరోకీ మధ్య ఉన్న 200 మైళ్ల నది) నిజానికి ఎక్కువ ఉరవడి కలది; అక్కడ ఆ మిసిసిపీ నది చాలా తరచుగా ప్రవాహగమనాన్ని మారుస్తూ ఉంటుంది. అందుచేత – వరుసగా ఒక వారం రోజులపాటు రేవులో నిలిచిపోవలసి వచ్చిన ఓడల తాలూకు చోదకులందరూ – ముఖ్యంగా ప్రవాహం ఉరవడి ఎక్కువగా ఉన్న కాలంలో – ఎప్పటికప్పుడు క్రొత్తగా నదిని 'తిలకించడం'కోసం కెయిరోదాకా దిగువకు ప్రయాణం చేస్తూ ఉంటాడు. తరచు ఎక్కడా కిరాయి తగలని దురదృష్టవంతులైన చోదకులే ఈ 'నదీ సందర్శన యాత్ర' కి బయలుదేరుతూ ఉంటారు. వాళ్ల ఒకే ఒక ఆశ ఎక్కడైనా కిరాయి దొరక్కపోతుందా అని. అందుచేత వాళ్లు

ఏ విఖ్యాత చోదకుడికైనా హఠాత్తుగా జబ్బుచేస్తే గాని, మరో కారణం వల్లగాని, ఒక ట్రిప్పుకైనా తమ కవకాశం లభిస్తుంది గదా అని సిద్ధంగా కాచుకుని ఉంటారు. కాని, ఇలాంటి వాళ్లలో చాలామంది ఎగువకూ, దిగువకూకూడా నదిని సందర్శిస్తూ ప్రయాణిస్తూ ఉండడం నిజంగా తమకు చోదకత్వావకాశం లభిస్తుందనే ఆశవల్లకాదు; నదీసందర్శన యాత్రలు (అప్పుడు వాళ్లు ఆ నౌకల అతిథులుగా ఉంటారు గనుక) ఒడ్డున ఉండి భోజనాదులకు డబ్బు వ్యయపరచడం కంటె లాభదాయకం. క్రమేణా వీళ్లకి సూకరాలు బలిసి, భోజనం బాగుంటుందనే ప్రసిద్ధిగల నౌకలనే పట్టుకువ్రేళ్లాడుతారు. అతిథి చోదకులందరూ చేదోడువాదోడుగా ఉంటారు; శీతకాలమైనా, వేసవి అయినా, పగలైనా, రాత్రి అయినా చిన్న పడవల్లో ముందు వెళ్లి సురక్షిత మార్గాన్ని సూచించే గుర్తులు నెలకొల్పటంలో గాని, లేక ఆ నౌకాచోదకునికి వారు ఉపయోగపడగల్గిన మరేపనిలోగాని సర్వసంసిద్ధతతో నిస్సంకోచంగా సహాయపడతారు; నౌకాచోదకులకూ వీరి రాక అభిమతమే! ఎందుచేతంటే - నలుగురు చోదకులొక చోట చేరారంటే, ఇక వారి బాతాఖానీకి విసుగూ, విరామం ఉండదు. వాళ్లెప్పుడు మాట్లాడినా నదిని గురించే కనుక ఆ సంభాషణ అర్థమూ అవుతుంది; ఆనందదాయకంగానూ ఉంటుంది. నిజమైన నౌకాచోదకుడికి తన నది విషయం తప్ప, ప్రపంచంలో మరే విషయమూ పట్టదు; అతని వృత్తి విషయంలో అతనికి గల గర్వం రారాజుల

గర్వాన్ని తలదన్నునట్టిది.

ఈ దిగువ యాత్రలో మా కొక మంచి నదీ సందర్శకుల బృందం లభించింది. ఎనమండుగురో, పదిమందో ఉంటారు. మా బ్రహ్మాండమైన చోదకగృహంలో వారికి ఎక్కీతక్కీ అయేటంత స్థలముంది. వారిలో ఇద్దరు ముగ్గురు మాత్రం మెరిసే సిల్కుటోపీలు, ముందుభాగాన పనితనంతో కుట్టిన విలువైన చొక్కాలు, ఆ చొక్కాలకు వజ్రాలు పొదిగిన పిన్నులు, చేతులకు మేలిమిచర్మంతో తయారు చేసిన గ్లోవ్‌లూ, ఖరీదైన బూట్లూ ధరించి ఉన్నారు. మంచి ఇంగ్లీషు మాట్లాడుతూ, మనుగడకి లోపంలేని వారికే, చోదకులుగా గొప్ప ప్రతిష్ఠ గలవారికీ ఉచితమైన ఠీవితో ప్రవర్తిస్తున్నారు. మిగిలినవారందరూ మామూలు దుస్తులు ధరించి, తలల మీద కామన్‌వెల్తు రోజులను (అమెరికా బ్రిటిష్ కామన్‌వెల్త్‌లో చేరి ఉన్న కాలం) జ్ఞప్తికి తెచ్చే మిఠాయి పొట్లంలాగా పొడుగ్గా ఉండే నాటుటోపీలు పెట్టుకున్నారు.

ఈ హేమాహేమీల సంఘంలో నేనొక కీటకాన్ని; నేను నిరుత్సాహంతో చాలా క్రుంగిపోయాను. 'నిరోధక సూత్రాన్ని' (tiller rope) హడావిడిగా బలంగా క్రిందికి లాగవలసివచ్చినప్పుడైనా చక్రం దగ్గిర ప్రధాన చోదకుడికి నా సహాయంయొక్క ఆవశ్యకత లేకపోయింది. దగ్గరగా ఉన్న ఏ అతిథి చోదకుడో ఆపని చేసేసేవాడు. నదీప్రవాహం అక్కడ చాలా వంపు తిరిగి ఉన్నందువల్లా, నదిలో నీరు

తక్కువగా ఉన్నందువల్లా అలాంటి అవసరం చాలా తరుచుగా వస్తుంది. నేనో మూల నుంచొని వారి సంభాషణ వింటున్నాను; అది నాలో ఉన్న ఆశాలేశాన్ని సమూలంగా పెల్లగించివేసింది. ఒక అతిథి చోదకుడు మరొకణ్ణి అడుగుతున్నాడు;

"జిమ్! ఎగువకి వస్తున్నప్పుడు 'ప్లమ్ పాయింట్'ని ఎట్లా దాటావ్?"

"అది రాత్రిపూట. 'డియానా' నౌకమీద ఒక చోదకుడు చెప్పిన ప్రకారం దాన్ని దాటాను. ఆ అబద్ధాల పాయింట్ దగ్గర ఒక కట్టెల గుట్ట ఉంది చూడు – దానికి 50 గజాల ఎగువను ఆరంభించి పాతిక తక్కువ రెండువంతులు తెరచాప ఎత్తేవరకూ ఆగి, అక్కడి నుంచి తిన్నగా నది మధ్య ఉన్న మెట్టవేపు పోనిచ్చి, అలా ఆ మలుపులో ఉన్న ఒకే కొమ్మ మిగిలిఉన్న ముసలి బూరుగు చెట్టుదాకా వెళ్ళి, ఆక్కడ నా నౌక వెనుకభాగం ఆ చెట్టువేపు, ముందుభాగం ఆ పాయింట్‌కి ఎగువను ఉన్న పల్లపు ప్రాంతం వేపుకిపెట్టి, వేగం హెచ్చించి 9½ మైళ్ళ పాయింట్ దాటి వచ్చేశాను."

"చాలా కష్టమైన క్రాసింగ్ కదూ?"

మరొక చోదకుడు అందుకొని అన్నాడు:

"నేను తోలినప్పుడు నీరు ఇంకా ఎక్కువగా ఉంది; తిన్నగా పల్లపు ప్రాంతంలో నుంచి వచ్చేశాను. అబద్ధాల పాయింట్ దగ్గరే తెరచాపలో రెండో భాగం రెండువంతులుఎత్తి, చెట్లవరుసలు నదిలోకి చొచ్చుకు వచ్చినచోట

పాతిక తక్కువ రెండువంతులకు దించేసి తోలుకు వచ్చాను.

ఘరానా మనుష్యులుగా కనిపించే చోదకుల్లో ఒకడు అన్నాడు: "మీమీ చోదన చాతుర్యాన్ని శంకించటంకాదుగాని, నా ఉద్దేశంలో ప్లమ్ పాయింట్ దగ్గర తగినంత నీరు ఉంది."

ఈ నాజూకైన మందలింపు ఆ ప్రగల్భాలాడుతున్న చోదకుడికి వాకట్టు చెయ్యటం చూసి చుట్టూ అందరూ అమోదసూచకంగా తల లూచారు. ఈ ధోరణిలో శర పరంపరగా మాట వెంట మాటగా సంభాషణ సాగిపోతున్నది. అంతసేపూ నా మనస్సులో రేగుతున్న ఊహ లేమిటంటే: "ఇప్పుడు నా చెవులు సరిగ్గానే విని ఉంటే, నేను నదిమీది పట్టణాలు, లంకలు, వంపులు మొదలైనవి కంఠస్థం చేయడమే కాక, ఈ 12 వందలమైళ్ల నది ఒడ్డునాఉన్న అన్ని చెట్ల గుబురులతోను, ముసలి బూరుగు చెట్లతోను, కట్టెల గుట్టలతోను అతిసన్నిహితమైన పరిచయం కూడా సంపాదించి తీరాలన్నమాట! ఇంతేకాదు – చీకట్లోకూడా ఇవన్నీ ఎక్కడెక్కడ ఉన్నదీ నేను గుర్తించగలిగిఉండాలి! ఒకవేళ రెండుమైళ్ళదూరం గాఢాంధకారాన్ని చీల్చుకుని చూడగల దివ్యచక్షువులు ఈ అతిథి చోదకులకున్నాయేమో నాకు తెలియదు. ఈ నౌకాచోదకవృత్తి ఏ మారుమూల 'జెరికో' ప్రాంతానికో సంబంధించినదై ఉండి, నేనెప్పుడూ యీ వృత్తినిగూర్చి ఆలోచించకుండా ఉండి ఉంటే ఎంత బాగుండేది అనుకున్నాను.

ముసిముసి చీకటి పడుతూండగా బిక్స్బీ గంట ముమ్మారు మోగించాడు. అది నౌకను ఒడ్డుచేర్చి నిలప టానికి సంకేతం. అది విని కెప్టెన్ తన ఆఫీసు గదిలో నుంచి బయటకు వచ్చి, 'టెక్సాస్' అనే కాబిన్ ముందుకొస నుంచి తలపై కెత్తి ప్రశ్నార్థకంగా చూశాడు. బిక్స్బీ ఇలా అన్నాడు :

"మన మీ రాత్రికి ఇక్కడ ఆగుదాం కెప్టెన్!"

"అలాగేనండి!"

అంతే! నౌక ఒడ్డుకి వచ్చింది. ఆ రాత్రికి అక్కడ కట్టి వేశారు. అంత గొప్పవాడైన కెప్టెన్ అనుమతి తీసు కోకుండా చోదకుడలా తన ఇష్ట ప్రకారం వ్యవహరించగల గటం నాకు చాలా గొప్ప విషయంగా అనిపించింది. నేను భోజనం ముగించుకొని ఆ నాటి పరిశీలనలతోను, అనుభవాల తోను నిరుత్సాహపడి, వెంటనే నిద్రపోయాను. క్రితపు నౌకాయాత్రలో నేను నోట్ బుక్ లో వ్రాసిపెట్టుకున్న అంశాలు అర్థం పర్థంలేని కొన్ని పేర్ల కదంబంతప్ప మరేమీ కాకుండా పోయినవి. ఆ పగలు నేను దానిలో చూచినప్పు డల్లా గందరగోళంలో పడిపోతూ వచ్చాను. నిద్రలో కొంత మనశ్శాంతి కలుగుతుందని ఆశపడ్డాను. కాని కలుగలేదు. సూర్యోదయ పర్యంతం తలా తోకా లేని ఒక పీడకల నిర్విరామంగా నాతల నిండా మార్మోగి పోయింది.

మరుసటి ఉదయం నేను చాలా చికాకుగా దిగాలు పడి కూచున్నాను. ఆనాడంతా మా నౌక అనేక సాహ

సాలుచేసి వడివడిగా ప్రయాణం సాగించింది. ఎందుచేతంటే, చీకటి పడక మునుపే మేము 'నదిని దాటాలని' (కెయిరో వరకూ ఉండే ఎగువ మిసిమిసిపీ నదిని దాటటాన్ని అలా అంటారు) మేము తహతహ లాడాము. కాని, బిక్స్బీ సహా చోదకు డంతలో నౌకను నేల పట్టించటంతో దానిని మళ్ళీ నీళ్ళలోకి త్రోయటానికి చాలా కాలయాపన అయింది. అందుచేత ఓహియో నదివచ్చి మిసిసిపీలో కలిసే కెయిరో పట్టణానికి చేరుకోటానికి చాలా ముందుగానే చీకటి పడటం తథ్యమని స్పష్టమైంది. ఇది చాలా దురదృష్టం; ముఖ్యంగా–మా అతిథి చోదకులలో చాలామందికి. వీళ్లు మళ్లీ తిరిగి వెళ్లేవరకూ – ఎంత ఆలస్యంగా వెళ్లినా సరే – వీళ్ల నౌకలు వీళ్లకోసం ఎదురుచూస్తూ ఉంటవి. అందుచేత మా చోదక గృహ సంభాషణలో గాంభీర్యం హెచ్చింది. ఎగువకు వచ్చేటప్పుడు నీరు తక్కువగా ఉండటాన్నిగాని, చీకటినిగాని చోదకులు లక్ష్యపెట్టరు. ఒక్క పొగమంచు తప్ప ఏదీ వారి గమనాన్ని నిరోధించలేదు. కాని, దిగువ ప్రయాణం సంగతి వేరు; ప్రవాహపు వడి వెనుకనుంచి త్రోసివేస్తూ ఉంటే నౌక నిస్సహాయమై పోతుంది. అందుచేత, దిగువ ప్రయాణంలో నీరు తక్కువగా ఉన్నప్పుడు రాత్రిపూట ప్రయాణం సాగించే మామూలు లేదు.

అయినా – ఒక చిన్న ఆశ ఉంది; చీకటి పడేలోగా క్లిష్టమైన, ప్రమాదభరితమైన 'హాట్' దీవి క్రాసింగ్ దాటామా – ఇక మిగిలిన భాగం సాహసంగా ముందుకు

పోవచ్చు. ఆ తరువాత సమప్రదేశంగానూ ఉంటుంది; నీరు ఎక్కువగానూ ఉంటుంది. రాత్రిపూట 'హాట్' దీవి క్రాసింగును గడవ యత్నించడం మాత్రం ఉన్మత్త చర్యే అవుతుంది. ప్రొద్దు క్రుంకేదాకా మాటిమాటికీ చేతి గడియారాలు చూసుకుంటూ ఉండడంలోనూ, మా నౌకా వేగానికి లెక్కలుగడుతూ ఉండడంలోనూ గడిచింది. ఎవరి నోట విన్నా 'హాట్' దీవిని గూర్చిన ప్రసంగమే! ఒక్కొక్కప్పుడు చాలా ఆశాజనకంగా కనిపించేది; మరొకప్పుడు ఏ క్లిష్టమైన క్రాసింగుదగ్గరో ఆలస్యమైపోయి ఆశ పూర్తిగా దిగజారేది. కొన్ని గంటలు ఈ నిరుద్ధోద్వేగభారంతో గడచినవి. ఆ ఉద్వేగం నాకూ ప్రాకింది. 'హాట్' దీవిని గూర్చి నేనూ బాగా ఆందోళన పడుతూ, ఆ బాధ్యతాభారంక్రింద నలిగిపోతూ – "ఒక్కసారి తీరానికి పోయి అయిదు నిమిషాల పాటు హాయిగా గాలి పీల్చుకుని మళ్లీ బయలుదేరగలిగితే ఎంత బాగుండును!" అనుకున్నాను. చోదకులు వంతుల ప్రకారం తోలడం మానేసి, ఎగువకు వచ్చేటప్పుడు ఏ భాగంలో ఎవరు తోలారో – అది అతడికి సుపరిచితమైనదవడంవల్ల – ఆ భాగంలో ఆ చోదకుడే మళ్లీ తోలుతున్నాడు. అయితే, ఇద్దరు చోదకులూ నిరంతరం చోదక గృహంలోనే ఉంటున్నారు.

సూర్యాస్తమయానికి ఒక గంట ముందు బిక్స్బీ చక్రం తీసుకున్నాడు; మిస్టర్ 'డబ్ల్యు' తప్పుకున్నాడు. ఆ తరువాత 30 నిమిషాల సేపు ప్రతివ్యక్తీ గడియారం చేత

పుచ్చుకొని మౌనంగా, చికాకుగా, ఏదీ తోచనట్టు గడి పాడు. చివరికి ఎవరో అన్నారు – నిరాశాసూచకంగా నిట్టూర్పు విడుస్తూ :

"అదిగో అదే హాట్ దీవి. కాని, మనం దాన్ని దాటలేము."

నౌక మీది వంతుదార్లందరూ ఒక్కసారిగా ఉలిక్కి పడ్డారు. ప్రతివ్యక్తీ నిట్టూరుస్తూ – "చాలా కష్టం. ... ఒక్క అరగంట ముందు ఇక్కడికి రాగలిగితే ఎంత బాగుం డేది!" ఇలాంటి మాటలేవో గొణగసాగాడు. అక్కడి వాతావరణ మంతా నిరుత్సాహంతో నిండిపోయింది. కొందరు బయటికి పోదామని బయలుదేరారు ; కాని ఒడ్డు చేరే గంట మ్రోత వినిపించనందున తచ్చట్లాడుతున్నారు. సూర్యబింబం దిక్చక్రం క్రిందికి జారిపోయింది. నౌక ముందుకు సాగిపోతున్నది. అతిధి చోదకుల మాధ్య ప్రశ్నార్థ కపు చూపుల వినిమయం జరిగింది. ఒకడు తలుపు తెరవటా నికి గుబ్బను త్రిప్పి, కొంతసేపు నిరీక్షించి, మళ్లీ గుబ్బమీద నుంచి చెయ్యితీసేసి తలువు గడియ పడిపోనిచ్చాడు. నౌక నిదానంగా వంపును దాటింది. మరింత ఎక్కువగా భావ గర్భితమైన చూపులూ, చకిత ప్రశంసా సూచక శిరః కంపాలూ వినిమయం పొందినవి ; అంతే–ఒక్కరి నోట మాట లేదు. నిశ్చేతనులై అ చోదకులందరూ బిక్స్‌బీ వెనుక చేరారు. ఆకాశం మరింత నల్లపడింది ; ఒకటి, రెండు గ్రుడ్డి నక్షత్రాలు ఉదయించినవి. ఆ శ్మశాన నిశ్శబ్దత, ఆ

నిరీక్షణ భావం దుర్భరంగా ఉన్నవి. బిక్స్‌బీ త్రాడు లాగాడు; గంటనుండి వెలువడిన రెండు గంభీరనాదాలు రాత్రిలో తేలిపోయినవి. కొంత విరామం ... మళ్లీ ఇంకొక గంట మ్రోత. వెంటనే పై 'డెక్' (Hurricane-deck) మీద నుంచి కాపలావాని కంఠం వినిపించింది. "అదిగో 'లాబ్ బోర్డు' రేవు!"

నౌకల కెదురు వచ్చి, వాటి త్రాళ్లను పట్టుకొని ఒడ్డుకు లాక్కొనిపోయే బృందం (leads-men) వారి కేకలు దూరంనుంచి అస్పష్టంగా వినిపించ సాగినవి. మా నౌక పై డెక్ మీద ఉన్న వార్తా ప్రసారకులు (word-passers) అస్పష్టంగా వినిపిస్తూన్న ఆ మాటలను తిరిగి మొరటుగా పునశ్చరణ చేస్తున్నారు.

"మూడువంతులు! పాతిక తక్కువ మూడు! రెండు న్నర; రెండుం బాతిక! రెండు వంతులు! పాతిక తక్కువ ......!"

బిక్స్‌బీ 'గంట త్రాళ్లు' రెండు లాగాడు; బాగా క్రింది భాగంలో ఉన్న ఇంజన్ గదిలోనుండి అస్పష్టంగా కొన్ని ధ్వనులు వినిపించినవి. అంతటితో మా నౌక వేగం మందగించ సాగింది. గొట్టంలో నుంచి (guage-cock) ఆవిరి బయటికిపోతూ హోరుమని ధ్వని చేస్తున్నది. దూరంగా నౌకా మార్గదర్శకుల కేకలు వినిపిస్తూనే ఉన్నవి. ముఖ్యంగా రాత్రిపూట ఆ కేకలు ఏవో అలౌకిక ధ్వనులుగా వినిపిస్తవి. చోదకుల్లో ప్రతి ఒక్కడూ కళ్లార్పకుండా, ఊపిరి బిగబట్టి

జాగ్రత్తగా పరిశీలిస్తున్నాడు. ఒక్క బిక్స్బీ తప్ప ఎవ్వడూ స్తిమితంగానూ, శాంతంగానూ లేడు ; అతడు అక్కడ ఉన్న చక్రం ఆకుల్లో ఒకదాని మీద ఎక్కి నిలబడి, నా దృష్టిలో బొత్తిగా కనిపించని (అప్పుడు మేము విశాలమైన, విషాదావృతమైన ఒక మహా సముద్రం మధ్య చిక్కుకున్నట్టనిపించింది) ఒక్కొక్క 'మార్క్' గుండా నౌక పోతున్నప్పుడల్లా తత్తత్కాలోచితంగా చక్రం త్రిప్పుతున్నాడు. వినపడీ వినపడనట్టు గుసగుసలాడుతున్నట్టు సాగుతున్న సంభాషణలో అప్పుడప్పుడు ఈ క్రిందివిధంగా ఒక్కొక్క పూర్తి వాక్యం వినిపిస్తూంది !

"అదిగో - మొదటిగడ్డు సక్రమంగా దాటేసింది."

కొంత విరామం తర్వాత మరొక మంద్రస్వరం :

"నౌక ముందు భాగం దేవుడి దయవల్ల సరిగ్గా ముందుకు చొచ్చుకొని పోతున్నది."

"అదిగో ఇప్పుడు 'మార్క్' ల దగ్గరకు వచ్చింది ; ఆఁ! వాటిని దాటేసింది."

మరో కంఠం :

"బలే! బలే? బలే బాగా తోలుతున్నాడు!"

తర్వాత ఇంజన్లు పూర్తిగా ఆపివేశారు. మేము ప్రవాహం ఎటు తీసుకుపోతే అటు పోతున్నాం. అయితే నౌక గమనం నేను చూడగలుగుతున్నానని కాదు. అప్పటికి నక్షత్రాలన్నీ మరుగుపడడంవల్ల నా కేమీ కనుపించడం లేదు. ఆ విధంగా ప్రవాహం వెంట పోతూ ఉండటం

అత్యంత విపత్కరమైన ఘట్టం. అందరికీ గుండెలు కొట్టుకోడం మానివేసినవి. అంతలో – ఉన్న విపత్తు చాలనట్లు మరింత దారుణమైన విపత్తును మే మెదుర్కోబోతున్నామని నేను గుర్తించాను. అది ఆ దీవి అగ్రభాగం. మా నౌక తిన్నగా దానివేపు వెళ్ళిపోతూంది. ఆ దీవి నీడలోకి మేము ప్రవేశించాము. ఇంక విపత్తు తప్పనిసరి అనిపిస్తూంది; నాకు మూర్ఛ వచ్చేటంతపని అవుతున్నది. ఏదో ఒక పని, ఆ నౌకను కాపాడడానికి ఏదో ఒకటి నేను చేసెయ్యాలని నాలో ఒక బలమైన ఉత్కంఠ కలిగింది. బిక్స్బీ ఇంకా తన చక్రం దగ్గరే నిలబడి ఉన్నాడు. మౌనంగా, ఎర కోసం పొంచి ఉన్న పిల్లిలాగ. మిగిలిన చోదకులందరూ అతని వెనుక వరుసగా నుంచుని చూస్తున్నారు.

"ఈ గడ్డు గడవడం కష్టం" ఎవరో గొణిగారు.

నౌకామార్గదర్శకుల కేకలనుబట్టిచూస్తే – నీటిలోతు ఇంకా ఇంకా తగ్గిపోతూన్నది. చివరికి—

ఎనిమిదిన్నర! ఎనిమిది అడుగులు! ఎ – ని – మి – ది అడుగులు! ఏడున్నర...!"

బిక్స్బీ తన సంభాషణ గొట్టం ద్వారా ఇంజనీరును హెచ్చరిస్తూ అన్నాడు:

"ఇప్పుడే మీరు బాగా జాగ్రత్తగా ఉండాలి!"

"అలాగేనండి."

"ఏ–డు–న్న–ర! ఏడు అడుగులు! ఆరున్నర..."

మా నౌకకు నేల తగిలింది. తత్ క్షణం బిక్స్బీ

బోలెడు గంటలు వాయించాడు. సంభాషణగొట్టంలోనుంచి అరిచాడు – "ఇప్పుడే – మీరంతా గట్టిపట్టు పట్టాలి! మీ శక్తి సామర్థ్యాలన్నీ చూపించాలి!" తరువాత తన సహచరుడి వేపు తిరిగి – "బలంగా లాగించు!" అన్నాడు. నౌక ఇసుకను చీల్చుకుని ముందుకు పోయింది. ఒక క్షణం సేపు విపత్తు శిఖరాన్ని చూచి, వెంటనే ఆ గడ్డు గడిచి ముందుకు సాగిపోయింది. ఇక బిక్స్బీ వెనుకగా చోదక గృహం కప్పు ఎగిరేటట్టుగా లేచిన హర్ష ధ్వానాలు ఇంతకు ముందు ఏ నౌకలోనూ, ఎన్నడూ వినిపించి ఉండవు.

అటు తరువాత ఇక చిక్కు లేదు. ఆ రాత్రి బిక్స్బీ మహావీరుడు. అతని ఘనకార్యాన్ని గూర్చి ఆ తర్వాత ఎంతో కాలం నదీ నౌకా చోదకులు చెప్పుకునేవారు.

బ్రహ్మాండంగా పరుచుకొని ఉన్న ఆ జలమయ ప్రపంచం మధ్య ఆ మహానౌకను సరిగ్గా 'మార్కు'లలో ప్రవేశ పెట్టడానికి అవసరమైన అత్యద్భుత చాతుర్యాన్ని పూర్తిగా అవగతం చేసుకోవాలంటే – అవరోధాలవల్ల, అగాధాలవల్ల అత్యంత క్లిష్టమైన తన మార్గాన్ని సరిగా గుర్తిస్తూ ఆ దీవిలో ముందుకు వంగి ఉన్న చెట్లూ మొదలైనవి నౌక ముందు భాగానికి తగిలి తుత్తునియలయేటంత దగ్గరగా ఆ దీవిని రాచుకొని పోవలసి రావడమే కాక, ఒకచోట అంతకు పూర్వం అక్కడ బ్రద్దలై పైకి కనబడకుండా మునిగిపోయి ఉండిన ఒక ఓడకు బారెడు దూరంలో నుంచి వెళ్ళవలసి ఉన్నదని కూడా గుర్తించాలి!

ఈ నౌక దానికి వెళ్ళి కొట్టుకున్నదా – నౌక అడుగు భాగ మంతా తుత్తునియలై మరుక్షణంలో నదీ గర్భాన కలిసేది; పావు మిలియన్ డాలర్ల ఖరీదు చేసే ఈ నౌకా, సామానూ అంతా అయిదు నిమిషాల్లో సర్వనాశనమవడమే కాక, ఒక 150 మంది జీవులను గూడా ఆహుతిగా గ్రహించేది!

ఆ రాత్రి నేను విన్న చిట్ట చివరివాక్యం మరపు రానిది. మా అతిధి చోదకులలో ఒకడు తనలో తాను ఆవేశంతో అనుకుంటున్నాడు :

"మృత్యువు నీడలో నుంచి తప్పించుకొని వచ్చాం. నిజంగా అతడు పరమ సునిశిత చోదకుడు!"



# బెంజామిన్ ఫ్రాంక్లిన్

**1706-1790**

[అమెరికా దేశ చరిత్రలో అత్యంత మహనీయులు, బహుముఖ ప్రజ్ఞాధురీణులు అయిన కొద్ది మందిలో బెంజామిన్ ఫ్రాంక్లిన్ ఒకడు. ఈయన బోస్టన్ నగరంలో జన్మించాడు; 12 వ ఏట ముద్రాపకుడైన అన్నవద్ద శిక్షణ పొందడం ఆరంభమైంది. 17 వ ఏట ఆ "శిక్షణ చెర" నుండి తప్పించుకొని ఫిలడల్ఫియా నగరానికి పారిపోయాడు. ఏడేళ్ల అనంతరం ఆ నగరంలో ఒక ముద్రణ వ్యాపార సంస్థకు యజమాని అయి, 'పెన్సిల్ వేనియా గజెట్' పత్రికా ప్రకాశకుడయ్యాడు. 42 వ ఏటనే ఆ వృత్తి నుంచి విరమించి, వైజ్ఞానిక పరిశోధనలకు, ప్రజా సేవకు శేషించిన జీవితాన్ని అంకితం చేశాడు. అయన చేసిన ప్రయోగాలలో మిక్కిలి ప్రసిద్ధి కెక్కినవి విద్యుచ్ఛక్తికి సంబంధినవి. ఒక తుఫానులో మెరుపును ఆకర్షించిన ఫ్రాంక్లిన్ గాలిపటం కథ - న్యూటన్ యాపిల్ పండు కథతోను, స్టీవెన్ సన్ టీ కెటిల్ (తేనీటి గిన్నె) కథతోను సమానంగా ప్రచారం పొందింది; పైగా-వాటికంటె అధిక విశ్వసనీయమైనది.

'విప్లవానికి' ముందు పెన్సిల్ వేనియా తరఫున ఫ్రాంక్లిన్ ఇంగ్లండులో ప్రతినిధిగా పనిచేశాడు; స్వాతంత్ర్య ప్రకటన పత్రం

మీదా, ఇంగ్లండుతో జరిగిన సంధి పత్రంమీదా, రాజ్యాంగ ప్రణాళికమీదా ఈయన సంతకాలు చేశాడు. అమెరికాతో ఫ్రాన్సు మైత్రి సంపాదించడంకోసం రాయబారాలు జరిపే సందర్భంలో పారిస్‌లో ఉన్నప్పుడు ఈయన అక్కడ బాగా ప్రచారణ పొందాడు.

ఛలోక్తులతో కూడిన అసంఖ్యాకములైన హాస్య ప్రసంగాల వల్లా, 'రిచర్డ్ పంచాంగాలు' (Poor Richard's Almanacs), 'ఆత్మకథ' అనే గ్రంథాలవల్లా రచయితగా ఫ్రాంక్లిన్ అగ్రశ్రేణిలో గణన కెక్కాడు. ఉదాత్త సాహితీ గౌరవం గల రచనగా సర్వజనామోదం పొందిన ఆయన 'ఆత్మకథ' నుండి బాస్టన్ నుండి తప్పించుకొని ఫిలడల్ ఫియాకు ఆయన పారిపోవడాన్ని అభివర్ణించే - ఈ క్రింది భాగం గ్రహించబడింది.]

# బాస్టన్ నుంచి ఫిలడల్‌ఫియాకు బెన్ ఫ్రాంక్లిన్ పలాయనం

[బాస్టన్ నగర పత్రిక 'న్యూ ఇంగ్లండ్ కొరంట్' కి ప్రకాశకుడైన తన అన్న జేమ్స్‌వద్ద వ్రాతకోతలు మొదలైన తగు లాంఛనాలన్నిటిలోనూ బెన్ శిక్షణ పొందడానికి కుదిరాడు.]

మా పత్రికలో ఏదో రాజకీయ సమస్య మీద - అది నాకిప్పుడు సరిగ్గా జ్ఞాపకంలేదు - ప్రచురితమైన ఒక వ్యాసం అసెంబ్లీకి ఆగ్రహకారణమైంది. ఆయనను (మా అన్న జేమ్స్ ఫ్రాంక్లిన్‌ను) బంధించి స్పీకర్ వారంటు మీద విచారణ జరిపి, ఒక నెల ఖైదు విధించారు. బహుశః మా అన్న ఆ వ్యాస రచయిత పేరు బయటపెట్ట నిరాకరించడం వల్ల అలా జరిగిందనుకుంటాను. నన్ను కూడా బంధించి కౌన్సిల్ ఎదుట విచారణ జరిపారు. కాని, నేను వారిక్కి

సంతృప్తికరమైన సమాధానమేదీ యివ్వకపోయినా, వారు నన్ను మందలించడంతో సంతృప్తిపడి వదిలివేశారు. బహుశః — శిక్షణకు కుదిరిన నాకు నా యజమాని రహస్యాలు రక్షించడం తప్పని సరి అని వారు భావించిఉంటారు.

మా అన్నతో వ్యక్తిగతంగా అభిప్రాయ భేదాలు ఉన్నా, ఆయనకు జైలు శిక్షపడడం నాకు చాలా కష్టం కలిగించింది. ఆయన జైలులో ఉండగా పత్రికా యాజమాన్యం నేను వహించాను. నేను ధైర్యంచేసి పత్రికలో ప్రభుత్వాధికారులను ఘాటుగా విమర్శించడం మొదలు పెట్టాను. ఇతరులు నా రచనలు చూచి నేను వ్యక్తిదూషణకు వ్యంగ్య పరిహాస రచనకు పూనుకున్నందుకు అననుకూల వైఖరి ప్రదర్శించినా, మా అన్న మాత్రం చాలా దయతోనే నా రచనల నామోదించాడు. ఆయనను జైలు నుంచి విడుదల చేసినప్పుడు శాసన సభవారు ఒక తాఖీదును కూడా జారీచేశారు. అది — చాలా విచిత్రమైన తాఖీదు: "జేమ్స్ ఫ్రాంక్లిన్ అనే వ్యక్తి 'న్యూ ఇంగ్లండ్ కొరంట్' అనే పత్రికను ఇకమీదట ఎంత మాత్రమున్ను ప్రకటింపరాదు" అని.

మా ప్రెస్సులో ఆ విషయమై ఆయన కర్తవ్యాన్ని గూర్చి ఆయన మిత్రులతో సమాలోచనలు సాగినవి. కొంత మంది ఆ పేపరు పేరు మార్చేస్తే సరిపోతుందన్నారు; కాని, అలాచేస్తే, కొన్ని అసౌకర్యాలున్నట్టు మా అన్న భావించడంవల్ల చివరికి — భవిష్యత్తులో పత్రికను బెంజామిన్

ఫ్రాంక్లిన్ పేరుతో ప్రకటించడం అంతకంటె మంచి ఉపాయమని నిర్ణీతమైంది. అయితే, తనవద్ద శిక్షణ పొందుతూ ఉన్నవాడిచేత ప్రకటింప చేస్తున్నాడనే అప రాధంనుంచి తప్పుకోడానికి మరోఉపాయం ఆలోచించారు. నేను శిక్షణకు చేరినప్పుడు వ్రాసియిచ్చిన కాగితాలు వగైరా అవసరమైనప్పుడు ప్రభుత్వానికి చూపడానికి వీలుగా రద్దుచేసి, నాకు తిరిగి యిచ్చివేయడానికీ, కాని, అందువల్ల మా అన్నకు నష్టం కలుగకుండా నేను మిగిలిన కాలానికి క్రొత్త పత్రాలు వ్రాసి యివ్వడానికీ, తాత్కాలి కంగా ఆ క్రొత్తపత్రాలను రహస్యంగా అట్టే బెట్టడానికీ ఏర్పాటు జరిగింది. నిజానికి అది చాలా అస్తవ్యస్తపు పథకం. అయినప్పటికీ వెంటనే దాన్ని అమలుపెట్టారు. ఆ ప్రకారం నా పేరుతో పత్రిక అనేక మాసాలపాటు వచ్చింది.

కొన్నాళ్ళకు మా అన్నకూ నాకూ మరొక అభి ప్రాయభేదం వచ్చింది. నేను క్రొత్తగా వ్రాసియిచ్చిన పత్రాలు బయటపెట్టడనే ధీమాతో స్వతంత్రించి వ్యవహ రించసాగాను. ఆ అవకాశం చూసుకొని నేనా విధంగా ప్రవర్తించడం న్యాయం కాదు. అందుచేత నా జీవితంలోని తప్పొప్పుల పట్టికలో దాన్ని మొదట అంశంగా నేను పరిగ ణిస్తూ వచ్చాను. వెర్రికోపంతో మా అన్న చీటికి మాటికి నన్ను కొట్టే దెబ్బలకు నాకు కలిగిన రోషం ముందు ఆ నా ప్రవర్తన అన్యాయమని నాకనిపించేది కాదు. ఇతర విధా

లుగా ఆయన ఏమంత దుష్ట స్వభావంగల మనిషి కాడు. బహుశః - నేను చాలా పెంకెగాఉండి, ఆయన కోపాన్ని రెచ్చకొట్టేవాణ్ణి అనుకుంటాను.

నేనా ప్రెస్ వదలి వెళ్ళి పోవాలనుకోడం పసిగట్టి, ఆ ఊళ్ళో నాకింకే ప్రెస్సులోనూ పని కుదరకుండా చేయ డానికి ఆయన ముందుగా వెళ్లి ప్రెస్ యజమాను లందరి తోనూ చెప్పివచ్చాడు. ఆ ప్రకారం వారందరూ నన్ను పనిలోకి తీసుకోడానికి నిరాకరించారు. సమీపంలో ప్రెస్సులు ఉన్న పట్టణం న్యూయార్కే అవడంవల్ల నే నక్కడికి పోవా లని నిశ్చయించుకొన్నాను. బాస్టన్‌లోని పాలకవర్గం వా రప్పటికే నామీద క్రోధభావం వహించి ఉన్నందువల్లా, మా అన్నగారిమీద దౌర్జన్యంగా కేసుపెట్టి శిక్ష విధించి నట్లే నామీదకూడా వారు కసితీర్చుకునే అవకాశం ఉన్నందు వల్లా, అన్నిటికంటె ముఖ్యంగా మతం విషయంలో విచక్షణ లేని నా తగూలు 'అవిశ్వాసి'గాను, 'నాస్తికుడు'గాను నన్ను భీతాహంతో పౌరులు వేలుపెట్టి చూపించే స్థితికి తెచ్చినందువల్లా ఇంక నేను బాస్టన్‌లో ఉండకూడదని నా కనిపిస్తూ వచ్చింది. నే నా విషయంలో ఒక నిశ్చయానికి వచ్చాను గాని, అప్పుడు మా తండ్రి మా అన్నకు వంత పాడుతూ ఉన్నందువల్ల బహిరంగంగా నేను వెళ్లిపోయే ప్రయత్నంచేస్తే వారు నన్ను అడ్డగించే ప్రమాదం ఉందని నేను గుర్తించాను. అందుచేత నా మిత్రుడు కొల్లిన్స్ నాకు సహాయం చేయవలసి వచ్చింది. నా తరఫున న్యూ

యార్క్ పోయే ఒక నౌక కెప్టెన్‌తో అతను మాట్లాడి నా ప్రయాణానికి ఏర్పాటుచేశాడు. నాకు ఇష్టంలేని, ఇంతకు ముందే సంతానవతి అయిన ఒక అమ్మాయిని పెళ్ళిచేసుకోమని నన్ను ఆ అమ్మాయి బంధువులు బలవంతం చేస్తున్నారనీ, అందుచేత నేను బహిరంగంగావచ్చి నౌక ఎక్కడానికి వీలులేదనీ కూడా నా మిత్రుడు కెప్టెన్‌తో చెప్పాడు. నేను నా పుస్తకాల్లో కొన్నిటి నమ్మి కొంతడబ్బు చేతబట్టుకొని రహస్యంగావెళ్లి ఓడ ఎక్కాను. గాలి అనుకూలంగా ఉన్నందువల్ల మూడు రోజులలోనే మా ఊరికి 300 మైళ్ళ దూరంలో ఉన్న న్యూయార్క్ నగరం చేరుకొన్నాను. అప్పటికి నాకు పట్టుమని 17 ఏళ్లు లేవు. ఆ మహానగరంలో ఎవరినైనా ప్రత్యక్షంగా ఎరిగి ఉండడంగాని, ఎవరి దగ్గరికైనా సిఫారుసు ఉత్తరంగాని లేవు; జేబులో పైకమూ అత్యల్పంగానే ఉంది.

నావిక జీవితంమీద నాకుండే మోజు అప్పటికి పూర్తిగా అంతరించింది. నాకు చేతిలో పని ఉండడంవల్లా, ఆ ముద్రణ విద్యలో నేను చాలా సిద్ధహస్తుడనని భావిస్తూ ఉన్నందువల్లా ఆ నగరంలో ఉన్న ముద్రాపకుడు విలియం బ్రాడ్ ఫర్డ్ దగ్గిరికి ఉద్యోగకోసం వెళ్ళాను. అతడు పెన్సిల్‌వేనియాలో మొదటి ముద్రాపకుడు; – ఆ విద్యలో తల నెరిసినవాడు. కాని, జార్జికీత్‌తో వివాద మేర్పడడంతో అ నగరం వదలిపెట్టి న్యూయార్క్ చేరుకున్నాడు. అప్పు డాయనకు క్రొత్తమనిషి ఆవశ్యకత లేకపోవడంవల్ల

ఆయన జాలిగా నాతో ఇలా అన్నాడు: "ఫిలడల్ ఫియాలో ఉన్న నా కుమారుడు అక్విలారోజ్ ప్రెస్‌లో ఫోర్మన్ ఈ మధ్య కాలం చెయ్యడంవల్ల ఆ స్థానం ఖాళీగా ఉండాలి. నీ వక్కడికి వెళ్ళగలిగితే అతడు నిన్ను తీసు కుంటాడను కుంటాను." అక్కడికి ఫిలడల్ఫియా మరో వంద మైళ్ళ దూరముంది. అయినా సాహసించి నేను నా పెట్టె, సామాను వెనుక నుంచి సముద్రం మీదుగా పంప మని చెప్పి అంబాయ్ పోయే పడవ మీద బయలు దేరాను.

సముద్రపు పాయను దాటుతున్నపుడు ఒక పెద్ద గాలివచ్చి, మా పడవ పాత తెరచాప లన్నిటినీ తుత్తు నియలుచేసి, ఉప్పునీరులోకి మేము ప్రవేశించకుండా నిరో ధించి, లాంగ్ ఐలెండు వేపు మా పడవను నెట్టేసింది. ఆ మధ్య దారిలో మా పడవలో ప్రయాణం చేస్తూ ఉన్న ఒక డచ్ ప్రయాణికుడు తప్ప త్రాగి పడవమీద నుంచి సముద్రంలో పడిపోయాడు. నేను వెంటనే దూకి మునిగి పోతూన్న అతన్ని జుట్టు పట్టుకొని పైకి లాక్కొచ్చాను. ఆ విధంగా నీళ్ళలో నానడంతో అతని కైపు కొంత దిగింది; తన జేబులో నుంచి ఒక పుస్తకం తీసి ఆరబెట్ట మని నాకిచ్చి అతడు గాఢంగా నిద్రపోయాడు. ఆ పుస్త కం విప్పి చూడగా నాకు ప్రియ తమ రచయిత జాన్ బన్యన్ వ్రాసిన "యాత్రిక ప్రగతి" (Pilgrim's Progress) అనే పుస్తకం తాలూకు డచ్ అనువాద మది. మంచి

కాగితం మీద అందంగా ముద్రించిన ప్రతి. మూల భాషలో ఆ పుస్తకానికి అంత అందమైన ముద్రణ వెలువడడం నే నెరుగను. తరువాత తరువాత అది యూరప్‌లోని భాషలలోకి అనూదితమయిందనీ, ఒక్క బైబిల్‌ని మినహాయిస్తే ఈ పుస్తకాని కున్నంత మంది పాఠకులు మరే గ్రంథానికీ లేరనీ నేను తెలుసుకున్నాను.

మా పడవ లాంగ్ ఐలెండ్ సమీపించగానే అక్కడి తీరం పర్వతమయమై ఉండడం, సముద్రపు ఉద్ధతి ఎక్కువగా ఉండడం గుర్తించి తీరానికి దూరంగానే మా పడవకి లంగరు వేశాం. నీటి అంచు దగ్గిరికి కొంతమంది జనంవచ్చి మమ్మల్ని ఉద్దేశించి గట్టిగా ఏవో కేకలు వేస్తున్నారు. ఇటునుంచి మేమూ అరుస్తున్నాము. కాని, గాలి వడీ, సముద్రపు హోరూ జోరుగా ఉండడం వల్ల ఒకళ్ళ మాటలు ఒకళ్ళకు వినబడడం లేదు. ఒడ్డున కొన్ని చిన్న తెప్పలు ఉన్నవి. మమ్మల్ని ఎలాగైనా ఒడ్డుకి చేర్చమని ఆ జనానికి సంజ్ఞలు చేశాం. మా సంజ్ఞలు వాళ్లకి అర్థమేకాలేదో, లేక ఆ పని అసాధ్యమనే వాళ్లు భావించారో కాని, కొంతసేపటికి ఒడ్డున ఉన్న జనమంతా ఎవరి దారిన వాళ్ళు వెళ్ళిపోయారు. క్రమంగా చీకటి పడుతూంది.

గాలివడి తగ్గేవరకూ అలా నిరీక్షించడం తప్ప మాకు గత్యంతరం కనిపించలేదు. అందుచేత పడవ సరంగూ, నేనూ నిద్రపోవడానికి ప్రయత్నించాలని తీర్మానించుకొన్నాం. ఆ ప్రకారం పడవమీద ఉన్న ఒకే చిన్న గదిలో మేమందరం

ఇరుక్కుని పడుకున్నాం. డచ్చి ప్రయాణీకుని దుస్తులు ఇంకా నీళ్లోడుతూనే ఉన్నవి. సముద్రపు కెరటాలు పడవకు తాకి లేచిన నీటి తుంపురలు మా గదిలోకికూడా వచ్చి పడుతూ, త్వరలోనే మమ్మల్ని కూడా పూర్తిగా తడిపివేసినవి. ఆ స్థితిలో ఆ రాత్రంతా గడిపాము. ఒక్కరికీ కంటి మీద కునుకులేదు; విశ్రాంతి లేదు. మర్నాడు ఉదయం గాలి తీవ్రత తగ్గడంతో అంబాయ్ వైపు ప్రయాణం సాగించి మళ్ళీ ప్రొద్దుక్రుంకేలోపుగానే అక్కడకు చేరుకున్నాం. 30 గంటల సేపు నీళ్లమీద ఆహారంగాని, మరికి 'రమ్' సారాయి తప్ప మరో పానీయంగాని లేకుండా ప్రయాణించి అలా చివరికి గమ్యస్థానం చేరుకున్నాం.

ఆ సాయంత్రంనాకు బాగా జ్వరం వచ్చేసింది. పడక వేశాను. జ్వరానికి చల్లని మంచినీళ్ళు ఎక్కువగా త్రాగడం మంచిదని ఎక్కడో చదివినట్లు జ్ఞాపకం ఉండి, ఆ ప్రకారం చేశాను. ఆ రాత్రంతా బాగా చెమటలుపోసి, జ్వరం జారిపోయింది. మర్నాడు ఉదయం నది దాటి, అక్కడికి 50 మైళ్ళ దూరంలో ఉన్న బర్లింగ్‌టన్‌కి కాలినడకను ప్రయాణం సాగించాను. అక్కడనుంచి ఫిలడల్ఫియా చేరు కోటానికి మళ్ళీ నేను పడవ ప్రయాణం చేయవలసి ఉంది.

ఆ రోజంతా కుంభవృష్టిగా వర్షం కురిసింది. నేను తడిసి ముద్దైపోయాను. మధ్యాహ్నమయేసరికి బాగా అలసి పోయాను. అందుచేత ఒక చిన్న హోటల్లో ఆగి, ఆ రాత్రంతా అక్కడ గడిపాను. ఇంటి దగ్గరనుంచి ఎరక్క

పోయి బయలుదేరానుగదా అనిపించడం మొదలు పెట్టింది. ఆ హోటల్లో నన్నడిగిన ప్రశ్నలనుబట్టి అప్పటి నా స్వరూపం ఎలాంటి సంశయాలకు అవకాశమిస్తున్నదో నా కర్థమైంది. పారిపోయి లేచివచ్చిన నౌకరుగా అనుమానించి బంధించే ప్రమాదం కూడా ఏర్పడింది. అయినా, మర్నాడు నేను మళ్ళీ నా ప్రయాణం సాగించి ఆ సాయంత్రానికి బర్లింగ్టన్‌కి 8, 10 మైళ్ళ దూరంలో ఉన్న మరో చిన్న హోటలు చేరుకున్నాను. ఆ హోటలు యజమాని బ్రేన్; నేను ఆహారం తీసుకొంటున్నప్పుడు ఆయన నన్ను సంభాషణలోకి దించి, నేను కొంచెం చదువుకున్నట్టు కనిపించడంవల్ల నాపట్ల చాలా స్నేహభావాన్ని ప్రదర్శించాడు. ఆ నాడు ఆయనతో నాకు కలిగిన పరిచయం ఆయన జీవించి ఉన్నంత వరకూ అలాగే కొనసాగింది. కొన్నాళ్లు ఆయన సంచారోపన్యాసకుడుగా పనిచేశాడనుకుంటాను. ఎందుచేతంటే, ఇంగ్లండులోగాని, యూరప్‌లోగాని ఏ దేశంలోగాని గల ప్రతి పట్టణాన్నిగూర్చి ఆయన విచిత్రమైన అంశాలు చెప్పగలిగే వాడు. ఆయన కొంతవరకు విద్వాంసుడు; చాలా ప్రతిభావంతుడు, అయితే - నాస్తికుడు. తర్వాత కొన్ని ఏళ్లకు బైబిల్‌ని పరిహసిస్తూ చట్కారీ ఛందస్సులో - కాటన్ 'వర్జిల్' కవితకు వ్రాసినట్టు - పేరడీలు (హాస్యానుకరణలు) వ్రాయడానికి పూనుకున్నాడు. ఆ రచనలో ఎన్నో సత్యాలను పరిహాసాస్పదంగా చిత్రించాడు; ఆ రచనే ప్రచురితమైతే ఎన్నో దుర్బల హృదయాలను గాయపరచి ఉండే

వాడు ; కాని, అది ప్రచురితం కాలేదు.

ఆ రాత్రికి ఆయన ఇంట్లో పడుకొని, మర్నాడు ఉదయం బయలుదేరి బర్లింగ్టన్ చేరుకున్నాను. కాని, నే నక్కడికి చేరుకోవడానికి కొంచెం ముందుగానే మామూలుగా బయలుదేరే నౌకలు వెళ్లిపోయినట్లు తెలుసుకొని చాలా క్రుంగిపోయాను. ఆ వేళ శనివారం. మళ్ళీ మంగళవారం ఈలోపుగా ఏ పడవా బయలు దేరదన్నారు. ఉసూరు మంటూ ఆ పట్టణంలోని ఒక ముసలమ్మ కొట్టు దగ్గిరికి తిరిగి వచ్చాను. అంతకు ముందు ప్రయాణానికి ఉపయోగిస్తుంది గదా అని ఆ అవ్వ దగ్గర ఒక అల్లపు రొట్టెకొని ఉన్నాను. నా పరిస్థితి అంతా ఆమెకు చెప్పి, ఆమె సలహా అడిగాను. నాకు పడవ దొరికేవరకూ తన ఇంటికి వచ్చి ఉండమని ఆమె నన్ను ఆహ్వానించింది. నడచి నడచి అలసిపోయి ఉండడంవల్ల ఆమె ఆహ్వానాన్ని అంగీకరించాను. నేను ముద్రాపకుణ్ణని తెలుసుకుని, నే నా ఊళ్లోనే ఉండిపోయి, ఆ వ్యాపారం ఎందుకు చేసుకోకూడదని ఆమె అడిగింది. పాప మామెకు ఆ వ్యాపారానికి కావలసిన పెట్టుబడి ఎంతో తెలియదు. ఆమె నాకు చాలా మర్యాదగా ఆతిథ్య మిచ్చింది. ఎద్దు మాంసంతో భోజనం పెట్టింది. ఒక కడివెడు 'ఫుల్' సారాయి మాత్రమే అందుకు ప్రతిఫలంగా నా నుండి పుచ్చుకుంది. ఇంక నాకు మంగళవారం దాకా ఆ ఊరునుంచి విముక్తి లేదనుకున్నాను. కాని, ఆ సాయంత్రం నది ఒడ్డున పచారుచేస్తూ ఉండగా ఫిలడల్ ఫియా

పోయే ఒక నౌక వచ్చింది. దానినిండా ప్రయాణీకు లున్నారు. ఆ నౌక సరంగు నన్ను తీసుకు వెళ్ళడానికి అంగీకరించాడు. గాలి అనుకూలంగా లేకపోవడంవల్ల దారి పొడుగునా మేము తెడ్లు వేయవలసివచ్చింది. అర్ధరాత్రి అయినా మాకు ఆ నగరం కానరాకపోయేసరికి. మాలో కొందరు మేము నగరం దాటి ఎగువకు వచ్చేశామని గట్టిగా వాదించసాగారు. ఇంక మేము తెడ్లు వేసేది లేదని మొరా యించుకు కూచున్నారు. ఇతరులకు మేము సరిగా ఎక్కడ ఉన్నదీ అంతు పట్టలేదు. అందుచేత మేము నౌకను ఒడ్డుకు పట్టించి, ఒక చిన్న పాయలోకి పోనిచ్చి, ఒక ప్రాత దడి ప్రక్కగా ఆపుచేశాం. ఆ దడి తాలూకు బద్దెలు విరిచి, అది చలికాలం (అక్టోబరు) అవడంవల్ల చలిమంట వేసు కున్నాం. తెల్లవారిన తర్వాత మాలో ఒకడు అప్పుడు మేమున్నది 'కూపర్' పాయ అని గుర్తించాడు. అనగా ఫిలడల్ఫియా దాటి కొద్దిగా ఎగువకు వచ్చా మన్నమాట! వెంటనే పడవని వెనక్కిత్రిప్పి, ఆదివారం ఉదయం 8, 9 గంటలకల్లా ఆ నగరం చేరుకుని, బజారు వీధి రేవుదగ్గిర దిగాము.

మా ప్రయాణాన్ని ఇంత వివరంగా వర్ణించడం, ఇంక ఆ నగరంలోకి నా ప్రవేశాన్ని కూడా ఇలాగే అతి వివరంగా వర్ణింపబోవడం ఎందుకంటే – ఏ దశలో నేను ఆ నగరం చేరుకొన్నానో, తర్వాత క్రమంగా ఏ స్థితికి నేను వచ్చానో మీరు పోల్చి చూచుకొనేందుకు వీలవుతుందని.

నా మంచి దుస్తులన్నీ సముద్రమార్గాన రావలసి ఉండడం వల్ల అప్పుడు నేను పనిచేసేటప్పుడు ధరించే దుస్తులు ధరించి ఉన్నాను. అవి కూడా ప్రయాణంలో బాగా మాసిపోయి ఉన్నవి. మేజోళ్ళ వగైరా కుక్కడంతో జేబులు ఎత్తుగా ఉన్నవి. ఆ నగరంలో నేను ఎవరినీ ఎరుగను. ఎక్కడ బస చెయ్యాలో తెలియదు. ప్రయాణంతోనూ, తెడ్లువేయడం తోనూ బాగా అలసిపోయి ఉన్నాను; విశ్రాంతి కావాలి; ఆకలి దహించుకు పోతున్నది. నౌక నుంచి దిగేసరికి నా జేబులో ఒక డచ్చి డాలరూ, ఒక షిల్లింగు చిల్లరా ఉంది. ఆ డాలరు నౌక సరంగుని తీసుకోమన్నాను. మొదట అతడు నేను తెడ్లువేసి ఉన్నందువల్ల డబ్బు పుచ్చుకోనన్నాడు; కాని, నేను బలవంతంచేసి యిచ్చాను. మనిషికి ఒక్కొక్కప్పుడు ధనం విస్తారం ఉన్నప్పటికంటె తక్కువగా ఉన్నప్పుడే ఔదార్యం ఎక్కువవుతూ ఉంటుంది. బహుశః తన నిర్ధనత్వం వెల్లడి అయిపోతుందేమో అనే భయంవల్ల అనుకుంటాను.

తరువాత నేను ఇటూ అటూ పరకాయించి చూస్తూ వీథి ఎగువనున్న సంత మార్కెట్ దాకా నడచి వెళ్ళాను. అక్కడ ఒక పిల్లవాని చేతులో రొట్టెచూచి, "అది ఎక్కడ కొన్నా"వని అడిగాను. అతడు చెప్పగా ప్రక్క వీథిలో ఉన్న రొట్టెల దుకాణానికి వెళ్లి, మా బాస్టన్‌లోలాగా అక్కడకూడా బిస్కట్లు ఉండక పోతయ్యా అని అడిగాను; ఫిలడల్ఫియాలో అలాంటి బిస్కట్లు తయారు చెయ్యరట!

అయితే ఒక 'మూడు పెన్నీలరొట్టె' యివ్వండన్నాను. అలాంటి రొట్టెకూడా ఏదీ వారు తయారు చెయ్యరట! ఇక ప్రాణం విసిగి, చివరకు మా ఊరికీ, అక్కడికీ డబ్బువిలువ విషయంలో ఉండే తేడానిగాని, వాళ్లరొట్టెల పేర్లనిగాని పట్టించుకోకుండా మూడు పెన్నీలు ఖరీదుచేసే ఏదో ఒక రొట్టె ఇమ్మన్నాను. అతడు వెంటనే మూడు పెద్ద పెద్ద రొట్టెలు తెచ్చియిచ్చాడు. రొట్టె అక్కడ అంత చవక అయినందుకు ఆశ్చర్యపోతూ, ఆ మూడు రొట్టెలూ తీసికొని జేబులు ఖాళీ లేనందువల్ల రెండు రొట్టెలు చెరో చంకలో పెట్టి, మూడవది చేతిలో పట్టుకుని తింటూ బయలుదేరాను. అలా మార్కెట్‌వీధికి ఎగువగా నాల్గోవీధి పర్యంతం వెళ్లాను. ఆ దారిలోనే మున్ముందు నా భార్య కానున్న స్త్రీ యొక్క ఇల్లు ఉంది. ఆమె అప్పుడు గుమ్మంలో నుంచుని నన్నుచూచి విచిత్రమైన, పరిహాసాస్పదమైన నా అప్పటి స్వరూపానికి నవ్వుకున్నదట! తర్వాత నేను చెస్ట్‌నట్ వీధి గుండాను, వాల్‌నట్ వీధిలో కొంత భాగమున్నూ నడిచాను. అప్పటికి నా చేతిలోవున్న రొట్టె పూర్తిగా తినేశాను. అక్కణ్ణించి చుట్టూ తిరిగి మళ్లీ మార్కెట్‌వీథి పడవలరేవుకి చేరుకొన్నాను. నేను వచ్చిన పడవ ఇంకా అక్కడే వుంది. నదిలో మంచినీళ్లు త్రాగడానికని ఆ పడవ మీదికి వెళ్లాను. ఒక్క రొట్టెతోనే నాకు కడుపు నిండి పోవడంవల్ల మిగిలిన రెండు రొట్టెలూ ఆ పడవలో నాతో కూడా ప్రయాణంచేసి వచ్చి, అక్కడ దిగకుండా ఇంకో

ఊరు ప్రయాణించడంకోసం ఆ పడవలోనే నిరీక్షిస్తున్న ఒక స్త్రీకి, ఆమె పిల్లవాడికి ఇచ్చేశాను.

ఆ విధంగా ఆకలి శాంతించిన తరువాత మళ్లీ ఆ వీధికి ఎగువగా బయలుదేరాను. అప్పటికి ఆ వీధి పరిశుభ్రమైన దుస్తులు ధరించిన జనంతో నిండి ఉంది. అందరూ ఒకేవైపుకు పోతూ ఉన్నారు. నేను వాళ్ళవెంట నడచి, సంతబజారుకు దగ్గరలో ఉన్న క్వేకర్ మతస్థుల సమావేశ మందిరంలోకి వాళ్ళతోపాటు వెళ్ళాను. అందరితోపాటు నేనూ ఒకచోట చతికిలపడి, ఎవరైనా ఏదైనా మాట్లాడతారేమో అని కొంతసేపు చుట్టూ కలయ జూశాను. కాని, ఎంతకూ, ఎవ్వరూ మాట్లాడక పోయేసరికి – పరిశ్రమవల్లా, గతరాత్రి విశ్రాంతి లేకపోవడంవల్లా నిద్ర తూలి తూలి వస్తున్నందున గాఢంగా నిద్రపోయాను. మీటింగు అయిపోయి, ఎవరిదారిన వాళ్ళు వెళ్ళిపోయేవరకూ అలా నిద్రపోతూనే ఉన్నాను. చివరికి ఎవరో పాపం వచ్చి నన్ను నిద్ర లేపారు. అందుచేత ఫిలడల్ఫియా నగరంలో నేను మొట్టమొదట అడుగుపెట్టిన ఇల్లు, లేక నిద్రించిన ఇల్లు ఆ 'క్వేకర్' సమావేశ మందిర మన్నమాట!

మళ్ళీ నదివేపుకు నడుస్తూ, మనుష్యుల ముఖాల్లోకి చూస్తూ పోతూండగా ఒక 'క్వేకర్' యువకుడు నాకు తగిలాడు. అతని ముఖం నాకు చాలా ఆకర్షకంగా కనిపించింది. అతనిని మాటలలోకి దించి. క్రొత్తవాళ్ళు ఆ నగరంలో బసచేయడానికి వీలైన స్థలం ఏదని అడిగాను.

అప్పుడు మేము 'నావిక త్రయం' (Three Mariners) అనే భవనంముందు ఉన్నాము. అతడు ఆ భవనంవేపు చూపుతూ "ఇక్కడ క్రొత్తవాళ్లకి బస ఇస్తారుగాని, ఇదేమంత మర్యాదగల స్థలంకాదు. మీరు నాతోకూడా వస్తే ఇంత కంటె మంచిస్థలం చూపిస్తాను" అన్నాడు. అతడు నన్ను 'వాటర్ స్ట్రీట్'లోని 'క్రుకెడ్ బిల్లెట్' అనే చోటికి తీసుకు వెళ్ళాడు. అక్కడ నేను భోజనం చేశాను. నేను భోం చేస్తున్నంతసేపూ వాళ్లు నన్ను వ్యంగంగా ప్రశ్నించడం మొదలుపెట్టారు. నా వయస్సు, నా వాలకం చూసి వాళ్లు నేను పారిపోయివచ్చిన వాణ్ణని అనుమానిస్తున్నట్లు వాళ్ల ఆ ప్రశ్నలు స్పష్టం చేసినవి.

భోజనానంతరం మళ్లీ నిద్ర తూలి తూలి వచ్చింది. వాళ్లు ఒక ప్రక్క చూపగా, పోయి పడుకొని, సాయంత్రం 6 గంటలదాకా నిద్రపోయాను. అప్పుడు వాళ్లు లేపగా, లేచి భోజనంచేసి మళ్లీ వెంటనే పడుకొన్నాను. మర్నాటి ఉదయం వరకూ ఒళ్లు తెలియని నిద్రపోయాను. అప్పుడు లేచి, నా దగ్గరఉన్న దుస్తులతో సాధ్యమైనంత పరి శుభ్రంగా తయారై, ముద్రాపకుడైన ఆండ్రూ బ్రాడ్ఫర్డ్ని కలుసుకొనడానికి బయలుదేరాను. నేను అక్కడకు వెళ్లేసరికి నేను న్యూయార్క్లో చూసిన బ్రాడ్ఫర్డ్ తండ్రి అక్కడ ప్రత్యక్షమయాడు. గుర్రంమీద ప్రయాణంచేసి ఆయన నాకంటె ముందే ఫిలడల్ఫియా చేరుకున్నారు. ఆయన తన కుమారుడికి నన్ను పరిచయం చేశాడు. అతడు నన్ను

చాలా మర్యాదచేసి, ఫలాహారం వగైరా పెట్టి, చివరికి - తా నిటీవలే ఒక మనుష్యుని వేసుకొని ఉన్నందువల్ల మరో మనిషి ఆవశ్యకత లేదని చెప్పాడు. కాని, ఇటీవలే కొత్తగా ఆ ఊళ్లో ప్రెస్ పెట్టిన కీమర్ అనే ఆయన ఉన్నాడనీ, బహుశః ఆయన నన్ను తీసుకోవచ్చుననీ, ఒకవేళ అలా తీసుకోకపోతే, నేను వచ్చి ప్రస్తుతానికి తమ ఇంట్లో ఉండ వచ్చుననీ, ఎక్కడైనా పని కుదిరేవరకూ అప్పుడప్పుడు తానే ఏమైనా పని ఇస్తూ ఉంటాననీ అన్నాడు.



# థామస్ ఏ. ఎడిసన్

1847-1931

[ఓహియోలో జన్మించి, మిషిగన్‌లో పెరిగి పెద్దఅయి, నూత్న యంత్రాన్వేషణలో నిర్విరామంగా గడచిన జీవితంలో చాలాభాగం న్యూజెర్సీలో గడపిన ఎడిసన్ నూటికి నూరుపాళ్ళు అమెరికన్ జాతీయుడు. అమెరికాదేశంలో పుట్టిన ఒక డజన్‌మంది మహా పురుషుల జాబితాను తయారుచెయ్యమని ఎవరిని కోరినాసరే, ప్రతివాని జాబితాలోను ఎడిసన్ పేరు తప్పని సరిగా ఉండి తీరుతుంది. 'దేదీప్య-మానమైన ఎలక్ట్రిక్' దీపం, 'ఫొనొగ్రాఫ్' ('గ్రామఫోన్') "మిమియోగ్రాఫ్' (సైక్లొస్టయిల్ యంత్రం), బొగ్గువాడే టెలిఫోను యంత్రం, మైక్రోఫోన్ (శబ్దవిస్తరణ యంత్రం), కినెటోస్కోప్, టాకీసినిమా యంత్రం - మొదలైన అతని నిర్మాణము లెన్నో అమెరికా జాతీయ జీవిత వికాసానికి అగణ్యమైన సేవచేసినవి.

ఈ క్రింది ఖండికలు జార్జి ఫార్సన్స్ లాత్రప్ రచించిన "ఎడిసన్‌తో ప్రసంగాలు" అనే గ్రంథం లోనివి. మొదట 1890

ఫిబ్రవరిలో 'హార్పర్స్ న్యూ మంత్లీ మ్యాగజైన్' అనే పత్రికలో సీరియల్‌గా ఈ గ్రంథం ప్రచురించ బడింది.]

# స్వతంత్ర జీవన ప్రారంభం

బాల్యంలో టామ్ ఎడిసన్ 'డెట్రాయిట్ ఫ్రీ ప్రెస్' అనే పత్రికని ప్రతి స్టేషన్‌లోను రైలు ఆగినప్పుడల్లా – కేక లేస్తూ అమ్మే పేపర్ల కుర్రాడు. ఆ 'ఫ్రీప్రెస్' పత్రిక ప్రకాశకుడు (తరువాత 'షికాగో టైమ్స్' కి కూడా ఈయనే ప్రకాశకుడు) ప్రసిద్ధుడైన విల్బర్ ఎఫ్. స్టోరీ.

ఎడిసన్: ఇలా అన్నాడు :

"అంతర్యుద్ధం ఆరంభమైన రోజుల్లో ప్రొద్దస్తమానం పేపర్లమ్ముతూ విపరీతంగా హైరాన పడేవాణ్ణి. అయినా, నిజానికి నాకు తగినంత లబ్ధి ఉండేదికాదు. నేను చాలా కొద్ది కమీషనుకే పేపర్లమ్మేవాణ్ణి. అందుచేత నేను అమ్మగల శక్తికి మించి పేపర్లు తీసుకోకుండా చాలా జాగ్రత్తపడవలసి వచ్చేది. అలా అని మరీ తక్కువ తీసుకు వెళ్ళితే యాత్ర సగంలోనే పేపర్లన్నీ అయిపోవటం జరుగవచ్చు. అందుచేత ఒక మధ్యే మార్గం త్రొక్కడానికి వీలుగా నేను ఒక పన్నుగడ పన్నాను; అది బాగా ఫలించింది. 'ఫ్రీ ప్రెస్' పత్రికా కార్యాలయంలోని ఒక కంపోజిటర్‌తో నేను స్నేహం చేశాను. ప్రతి రోజూ ఆ నాటి వార్తలలో చాలా ప్రముఖమైన వార్త తాలూకు గాలీ ప్రూఫ్ అతడు

నాకు ముందుగా చూపించే ఏర్పాటు చేసుకున్నాను. ఆ వార్తలోని హెడ్డింగులను చూచి ఆ నాటి వార్తా పత్రిక ఎలా అమ్ముడు పోతుందో అంచనా వేయడం అభ్యాసం చేశాను. అందుచేత నేను ఎన్ని పేపర్లు ఏ రోజున అమ్మగలనో ముందుగా సరియైన అంచనా వేసుకోగలిగేవాణ్ణి. సాధారణంగా నేను రోజుకి 200 పేపర్లు అమ్మేవాణ్ణి. కాని, యుద్ధరంగం నుంచి ఏదైనా ప్రత్యేకవార్త వచ్చిన రోజున 300, ఇంకా పైనా కూడా అమ్ముడు పోయేవి. ఇలా ఉండగా ఒక రోజున నా కంపోజిటరు స్నేహితుడు పెద్దపెద్ద అక్షరాలతో హెడ్డింగులు పెట్టి ఉన్న ప్రూఫ్ ఒకటి నాకు తీసుకొచ్చి ఇచ్చాడు. పిట్స్‌బర్గ్ లాండింగ్ (ఇప్పుడు దీన్నే షైలో అంటున్నాం) వద్ద జరుగుతూన్న యుద్ధం తాలూకు మొట్టమొదటి రిపోర్టది. ఆ యుద్ధంలో హతులూ, క్షతగాత్రులూ కలసి 60 వేలదాకా ఉన్నట్టు ఆ రిపోర్ట్ తెలుపుతున్నది.

"నేను వెంటనే పరిస్థితి అర్థంచేసుకున్నాను. పత్రిక కాపీలు బ్రహ్మాండంగా అమ్మే అవకాశం వచ్చిందని గుర్తించాను. అయితే ఒక విషయముంది. రైల్వే లైన్ వెంట ఉన్న ఊళ్ళ ప్రజలకి ఇప్పుడు నాకు తెలిసిన ఈ విషయం ముందుగా తెలియాలి; ఈ ప్రూఫ్ కాగితం వాళ్లందరూ చూసే అవకాశముంటే ఎంత బాగుండును అనుకున్నాను. హఠాత్తుగా నా కో ఊహ తట్టింది. వెంటనే టెలిగ్రాఫ్ ఆపరేటరు దగ్గరకు పరుగెత్తి అతి గంభీరంగా అతనికొక

సూచన చేశాను. అంత గంభీరంగానూ అతడు అతడు నా సూచనను విన్నాడు. ఆ సూచన ప్రకారం అతడు మేము వెళ్లే రైల్వేలైను మీద ఉన్న ప్రతి ముఖ్యమైన స్టేషనుకీ వైరుచేసి, రైళ్లరాకపోకలను సీమసున్నంతో వ్రాసే నల్లని ప్రకటన పలకలమీద ఆ యా స్టేషన్ మాష్టర్లు ఈ సంగ్రామ వార్తనీ, హతులు, క్షతగాత్రుల సంఖ్యనీ వ్రాసేటట్టు చెయ్యాలి. అందుకు ప్రతిఫలంగా 'హార్పర్స్ వీక్లీ', 'హార్పర్స్ మంత్లీ', సాయంత్రపు దినపత్రికా ఆ నాటినుంచి ఆరు నెలల వరకూ ఆ ఆపరేటర్ కి ఉచితంగా సరఫరా చేస్తూ ఉండడానికి నేను అంగీకరించాను.

"ఆ బేరం కుదిరిన తర్వాత, నా పన్నుగడను ఫలవంతం చేసుకొనడానికి తగినన్ని కాపీలు సంపాదించడమెలాగా అని ఆలోచింప సాగాను. నా దగ్గర ఉన్న రొక్కం చాలా తక్కువ: ఇక నాకు ఉన్న పరపతి మరింత తక్కువ. పేపర్లు బట్వాడా చేసే డిపార్టుమెంటు సూపరింటెండెంట్ దగ్గరకు వెళ్లి, నా మీద నమ్మకముంచి ఆనాటి 'ఫ్రీ ప్రెస్' ప్రతులు వెయ్యి నాకు అరువుగా ఇప్పించమని అతి వినయంగా ప్రార్థించాను. అయితే నా ప్రార్థన వెనువెంటనే, మిక్కిలి మొరటుతనంతో నిరాకరించబడినందుకు నా కాశ్చర్యం కలుగలేదు. ఆ రోజుల్లో నేను చాలా ఉత్సాహవంతుడుగానే ఉండేవాణ్ణి గాని, ఆ టెలిగ్రాఫ్ ఆపరేటరు తన మాట నిలుపుకుంటే (ఆ విషయంలో నా కింకా కొంత సంశయంగానే ఉంది) కొద్దిలో నాకు లభింపనున్న

అదృష్టం చేజారిపోతున్నదే అని నిరుత్సాహ పడ్డాను. కాని, ఎలాగో ధైర్యం కూడ దీసుకొని, అత్యంత సాహసకృత్యానికి ఒడిగట్టి, చర చరా మేడమెట్లెక్కి, తిన్నగా ఫిల్బర్ ఎఫ్. స్టోరీ గది దగ్గరకు వెళ్లి నేను ఆయనను చూడాలన్నాను. కొన్ని నిమిషాల అనంతరం నా కాయన దర్శనమైంది. నే నెవర్నో ఆయనకు తెలుపుకొని, నా కానాటి పత్రిక 1500 ప్రతులు అరువుగా కావాలనికోరాను. పొడుగ్గా, బక్కపల్చగా, పల్లని కళ్ళతో విరాగిలాగా కనిపించే ఆ వ్యక్తి ఒక నిమిషం నా వంక నిశితంగా చూసి, తర్వాత ఒక చిన్న కాగితం ముక్కమీద నాలుగు మాటలు గిరికాడు. ఆ కాగితం నా కిచ్చి "దీనిని క్రిందికి తీసుకొని వెళ్ళి చూపించు, నీవు కోరిన కాపీలు ఇస్తారు" అన్నాడు. నే నాప్రకారం చేశాను. నా కప్పుడు కలిగినంత ఆనందం ఆ తర్వాత నా జీవితంలో ఎన్నడూ కలుగలేదు.

నేను నా 1500 కాపీలు తీసుకొని, అవి మడతపెట్టడంలో నాకు సహాయం చెయ్యడానికి ముగ్గురు కుర్రవాళ్ళను కూడా వెంటబెట్టుకుని రైలెక్కాను. టెలిగ్రాఫ్ ఆపరేటరు తన మాటప్రకారం చేశాడా లేదా అని నా ప్రాణాలు పీచు పీచు మంటున్నవి. మా రైలు ఆగిన మొదటి స్టేషన్‌లో నేను మామూలుగా రెండు కాపీలే అమ్మగలిగేవాణ్ణి. కాని, ఆ వాళ స్టేషన్ ఇంకా దూరంగా ఉండగానే ప్లాట్‌ఫారం మీద జనం నా పేపరుకోసం కొట్టుకుంటున్నారా లేదా అని తొంగి చూశాను. ప్లాట్‌ఫారమంతా జనంతో కిటకిటలాడు

తూంది. రైలు స్టేషన్‌లో ఆగగానే వారందరూ నా పేపరు కోసం వచ్చినవారే అని నాకు స్పష్టమైంది. రైలు కదిలే లోపల కాపీ ఐదేసి సెంట్ల చొప్పున ఒకటి రెండు వందల కాపీలు అక్కడ ఖర్చు చేశాను. తరువాతి స్టేషన్‌లో జన సమూహం మరింత ఎక్కువగా ఉంది. నేను ధర పెంచాను. పదేసి సెంట్లుచేసి అక్కడ 300 కాపీలు అమ్మాను. క్రమంగా మేము పోర్టు హ్యూరాన్ స్టేషన్ చేరే వరకూ అలా పత్రిక ధరా, అమ్మకమూ కూడా పెరుగుతూనే వచ్చినవి. అక్కడ నా కోసం ఎదురుచూసే నా మామూలు బగ్గీలోకి మిగిలి ఉన్న పేపర్లు ఎక్కించి, ఎవరూ వాటిని అపహరించకుండా ఆ పేపర్ల కట్టమీద ఒక చిన్న కుర్రాణ్ణి కూచోబెట్టి, ఆ పేపర్లు పాతిక డాలర్లుకీ ఇంకా పైనాకూడా ఒక్కొక్క కాపీ అమ్ముకుంటూ బయలుదేరాను. నాకు బాగా జ్ఞాపకం ఉంది – మేము వెళుతున్న దారిలో ఒక చర్చిలో ప్రార్థన సమావేశం జరుగుతున్నది. ఆ చర్చి ముందాగి నేను నాటి ప్రముఖ వార్తని అరిచాను. పది సెకనులలో మతాచార్యునితోసహా ఆ చర్చిలో ఒక్క పిట్ట మిగులలేదు. అందరూ నా బండీ చుట్టూ మూగి అమూల్యమైన నా పత్రిక కోసం ఒకళ్ల మీద ఒకళ్లు పోటీపడ సాగారు.

“టెలిగ్రాఫ్‌యొక్క ప్రాముఖ్యాన్ని మొదట నేను ఎట్లా గుర్తించానో మీ కిప్పుడు అర్థమై ఉంటుంది. టెలిగ్రాఫ్‌ద్వారా బోర్డులమీద నోటీసులు వ్రాయించడమేగదా ఆ నాటి నా విజయంలోని కీలకం! వెంటనే నేను టెలిగ్రాఫ్

ఆపరేటర్ని కావాలని మనస్సులో నిశ్చయం చేసుకున్నాను. కాని, విల్బర్ ఎఫ్. స్టోరీ ఆనాడు నాకు ఆ సహాయమే కనుక చేసి ఉండకపోతే, విద్యుత్ శాస్త్రం సాధించగల అద్భుత ఫలితాలను నే నెన్నటికీ పూర్తిగా గుర్తించగలిగి ఉండే వాణ్ణి కానని మాత్రం నిశ్చయంగా చెప్పవచ్చు."

## ఫోనోగ్రాఫ్ నిర్మాణంలో ఆరంభ కృషి

"ఆ విషయమై చాలాకాలం ఆలోచన జరిపిన మీదట, 1877 లో నేను ఒక ఘట్టానికి చేరుకోగలిగాను. 'మార్స్' గూఢలిపి ప్రకారం చుక్కలు, గీతలతో ఒక చిన్న కాగితం ముక్కమీద నొక్కులు కలిగించడంద్వారా టెలిగ్రాములను పంపడమే కాక, ఒక వార్తను ఎన్నిసార్లైనా మనకు కావలసినంత వేగంగా పునశ్చరణ కూడా చెయ్యగల ఒక పరికరాన్ని సంతృప్తికరంగా తయారు చేయగలిగాను. అప్పుడు నేను టెలిఫోన్ విషయమై కూడా ప్రయోగాలు జరుపుతున్నాను. నా మనస్సంతా ధ్వని స్పందనలకూ, ఆ స్పందనలను సన్నని పొరల (Diphragms) ద్వారా ఒక చోటినుండి మరొక చోటికి పంపడానికీ సంబంధించిన సిద్ధాంతాలతో నిండి ఉంది. సహజంగానే నా కొక ఊహ తట్టింది. ఒక చోట కాగితం మీద కలిగించిన నొక్కులు (Indentations) మరొక చోటి యంత్రాన్ని పనిచేసేట్టు చెయ్యగలుగుతున్నప్పుడు, ఒక సన్నని పొర

యొక్క స్పందనాలను మాత్రం భద్రపరచి తిరిగి సరిగ్గా ఆలాంటి స్పందనాలనే ఎందుకు కలిగించలేము ? నేను కూడా విడిగా ఒక పరికరాన్ని తయారు చేశాను. దానిలో ఒక కాగితపు ముక్కను దోపి 'హెలో' అని అరిచాను. తరువాత ఆ కాగితాన్ని జరుపవలసిన ప్రకారం జరిపి, నేనూ నా మిత్రుడు 'బాచిలర్' ఊపిరి బిగపట్టి శ్రద్ధగా విన్నాం. సుదూరం నుంచి వస్తున్నట్టు ఒక హీన స్వరం విన్నాము. గాఢమైన భావనా బలంచేత ఆ ధ్వని 'హెలో' అన్న మొదటి మాటకు ప్రతిధ్వనే అని గుర్తింపవచ్చు. కాని, బాచిలర్‌కి మాత్రం నమ్మకం కలుగలేదు. ఆ పని నే నే నాటికైనా సరే సాధించగలిగితే ఒక పీపాడు యాపిల్ పండ్లు కదపా ఇస్తానని పందెం కూడా వేశాడు. నేను తయారు చెయ్యదలుచుకొన్న మోడల్‌ని ఒక కాగితంమీద వ్రాసి, దాన్ని తీసుకెళ్లి క్రూసీ కిచ్చి, ఆలాంటి మోడల్ తయారు చేసి పెట్టమన్నాను. ఆ రోజులలో 'క్రూసీ' నా కిలాంటి పనులు చేసి పెట్టటానికి కుదిరాడు. ప్రస్తుతం స్కెనెక్‌టాడీ లోని మా యంత్ర నిర్మాణశాలలో అసిస్టెంట్ జెనరల్ మేనేజరుగా పనిచేస్తున్నాడు. ఆ యంత్రం తయారుచేసి ఇస్తే అతనికి నేను 4 డాలర్లు ఇస్తానన్నాను; అది మాట్లాడే యంత్రమని కూడా చెప్పాను. నేను పరిహాసమాడుతున్నా నని అతడు ఒక చిన్న మూలుగు మూలిగాడు. కాని, పని ఆరంభించి త్వరలోనే నా మోడల్ తయారుచేసి ఇచ్చాడు. నేను పల్చని సీనా రేకు దానిలోపెట్టి మాట్లాడాను. క్రూసీ

చూస్తున్నాడు. ఇంకా అపనమ్మకంగానే ఉందతనికి. ప్రసారానికి అనుగుణంగా నేను యంత్రాన్ని సవరించిన వెంటనే మేమిద్దరం ఒక దూర స్వరం దానినుండి రావడం విన్నాము. అతడు భయంతో ఇంచు మించు కుప్పకూలి పోయాడు. నిజానికి నేను కూడా కొంచెం భయపడ్డాను. తర్వాత బాచిలర్ దగ్గిరనుంచి కీపాడు ఆపిల్ పండ్లు వసూలు చేశాను. ఆ ఆపిల్ పండ్లు నా కమితానందాన్ని కలిగించినవి."

# ఓర్పు - పట్టుదల

ఆ ట్టే కాలం కాలేదు – నే నోరోజున ఎడిసన్‌ను ఆయన నిర్మాణాలన్నిటిలోనూ దేనికోసం ఆయన ఎక్కువగా చదవవలసి రావడం, విస్తృతంగా ప్రయోగాలు చేయవలసి రావడం జరిగిందని అడిగాను.

తడుముకోకుండా వెంటనే ఆయన ఇలా జవాబు చెప్పాడు :

"విద్యుద్దీప నిర్మాణం నన్ను చాలా చిక్కులు పెట్టింది. నామటుకు నేను ఎప్పుడూ నిరుత్సాహపడడంగాని, విజయం విషయంలో ఆశ వదలుకొనే పరిస్థితి రావడంగాని జరుగక పోయినా, నా సహచరుల విషయంలో మాత్రం ఆ మాట నేను చెప్పలేను. ప్రయోగాలతోను, పరిశోధనలతోను గడచిన ఆ అన్ని సంవత్సరాలలోను, నాకొక్క సత్యంకూడా ఆవిష్కృతం కాలేదు. నాకృషి అంతా వినియోగాత్మక (deductive) మైనది. నేను సాధించే ఫలి

తాలు కూడా కేవలం నిర్మాణాలకు సంబంధించినవి. మొదట ఒక తాత్కాలిక సిద్ధాంతాన్ని ఏర్పరచుకొని, ప్రయోగాలు చేసి చూడడం, అది తప్పని తేలితే మరొక సిద్ధాంతాన్ని కల్పించుకొని, ప్రయోగాలు చేయడం, అదీ తప్పని తేలితే మరొకటీ - ఇలా నాకృషి సాగుతూంది. సమస్యా పరిష్కారానికి నాకు వీలైన మార్గ మిదొక్కటే! ఎందుచేతంటే - దేదీప్యమానమైన విద్యుద్దీపం ప్రకాశించే పరిస్థితులు విలక్షణమైనవీ, సంతృప్తికరంగా సూక్ష్మపరిశీలన జరపడానికి వీలులేనివీ. ఒక్కవిషయం ఆలోచించండి: అత్యంత సూక్ష్మమైన ఒకసన్నని తీగెకి మనం ఊహించలేనన్ని డిగ్రీల వేడిమి కలిగించాలి. ఆపని శూన్యప్రదేశంలో (vacuum) మనకు బొత్తుగా తెలియని పరిస్థితులలో జరగాలి. ఆ పరిశీలనలో మన కళ్ళు మన కేమీ ఉపయోగించవు. ఆచిన్న బల్బులో ఏమి జరుగుతున్నదో నిజంగా మన కేమీ తెలియదు. నేను అతిశయోక్తి లేశం కూడా లేకుండా చెబుతున్నాను - ఈ విద్యుద్దీప నిర్మాణం సందర్భంలో మూడువేల వేరువేరు సిద్ధాంతాలను నేను పరీక్షించాను. దేని కదే హేతుబద్ధమైనదిగాను, స్థూలదృష్టికి సక్రమమైనదిగాను కనిపించేది. అయినప్పటికీ - రెండు సందర్భాలలో మాత్రమే ఆ సిద్ధాంతాలు సరియైనవని నా ప్రయోగాలు రుజువుచేసినవి. నే నెదుర్కోవలసి వచ్చిన ప్రధానమైన ఇబ్బంది దేదీప్యమానమైన కాంతికి ఆధారంగా ఉండదగు సన్నని కర్బనపు తీగెను తయారు చేసుకోవడంలో ఉంది. నా ఏజంట్లు భూగోళం

లోని ప్రతి ప్రాంతాన్నీ గాలించివేశారు; సర్వవిధములైన విచిత్ర ద్రవ్యాలనూ వాడి చూశాం. చివరికి - ప్రస్తుతం వాడుక చేస్తున్న వెదురుదారాన్ని నిశ్చయించాం.''

ఎడిసన్ ఇంకా ఇలా అన్నాడు:

''ఇప్పటికీ ఇంచుమించు ప్రతిదినం నేసి దీపం విషయమై పరిశోధనలు జరుపుతూనే ఉన్నాను. ఇటీవలనే ఒక 'అశ్వశక్తి' (Horse Power) గల విద్యుత్తుతో 15 దీపాలను వెలిగించే పద్ధతి కనుక్కున్నాను. ఇంతకు ముందు ఒక 'అశ్వశక్తి' విద్యుత్తు 10 కంటె ఎక్కువ దీపాలకు సరిపోయేదికాదు.''

ఎడిసన్ నాతోచేసిన, ఈ పై ప్రసంగంవల్ల విజ్ఞాన, యాంత్రిక శాస్త్రాలలో సహజమైన ప్రతిభ కలిగి ఉండడమే కాక, తార్కిక వినియోగాత్మక ప్రయోగాలలో బ్రహ్మాండమైన ఓర్పూ, సునిశితమైన అంచనా, అనవధిక ప్రయోగ నిర్వహణమూ, నిర్విరామ పరిశ్రమా, నిరుత్సాహానికి తావీయని పట్టుదలా కూడా ఆయనకున్నట్లు స్పష్టమవుతూన్నది. అంతేకాదు; సర్వవిధములైన సూచనలకూ - అవి ఇతరులకెంత పరిహాసాస్పదములుగా కనిపించినాసరే - అసంకుచితమైన ఆయన మనస్సులోకి సదా ప్రవేశం లభిస్తుంది. ఏ ఊహానుగాని పూర్తిగా పరీక్షించి చూచిగాని ఆయన వదలి పెట్టడు. ఆయన ఒక యంత్రాన్ని నిర్మించిన మరుక్షణంనుంచీ, అది ఏ ఇతర నిర్మాణాలకు దారి తీయగలదో ఆలోచించడం మొదలు పెడతాడు. ఈ విషయాలన్నీ

ఆయన మనస్సులోనే భావింపబడుతూ, పరిశీలింపబడుతూ కొన్ని సంవత్సరాలపాటు ఉంటాయి. చివరికి ఆచరణ యోగ్యములుగా తోచినవి ఒకదాని తరువాత ఒకటి ముందుగా ఆయన నోట్ బుక్‌లోకి ఎక్కి, తర్వాత క్రమంగా ప్రత్యక్ష నిర్మాణాలుగా రూపొందుతాయి.



# హెన్రీ ఫోర్డ్

1863-1947

[ఇంచుమించు ఎవడయినా ఎలాంటి పరిస్థితులలో అయినా నడప డానికి వీలైన 'T' మోడల్ ఫోర్డుకార్లు ధర విషయంలో ప్రతివ్యక్తికీ కూడా (అమెరికాలో) అందుబాటులో ఉండడంవల్ల ఆ కార్లు అత్యద్భుతంగా ప్రజాదరణ చూరగొన్నవి. వేలకొలది ఛలోక్తులు ఈ కారు పేరు మీద అల్లబడి వ్యవహారంలోకి రావడం చూస్తే, నమ్మకంగా పనిచేసే ఈ "చవకబారు" కార్లు అంటే ప్రజల కెంత మక్కువో స్పష్టమవుతుంది. ఈ కార్ల నిర్మాత ఇంచుమించు 'పురాణ పురుషు' అంత ప్రఖ్యాతి పొందాడు.

హెన్రీ ఫోర్డు మిషిగన్‌లో జన్మించాడు; చిన్నతనంలోనే యాంత్రికవృత్తిని స్వీకరించి, స్వయంచాలక యంత్రాల విషయమై ప్రయోగాలు సాగించాడు. 1903 లో ఆయన స్థాపించిన "ది ఫోర్డు మోటారు కంపెనీ" ప్రపంచంలో కార్లు నిర్మించే సంస్థలన్నిటిలోకీ పెద్దదిగా అభివృద్ధి పొందింది.

హెన్రీఫోర్డు తన కృషిలో విజయం సాధించిన తొలిరోజులను వర్ణించే ఈక్రింది కథ శామ్యుయల్ క్రౌథర్ "తోడ్పాటుతో" ఫోర్డు

వ్రాసిన "నా జీవితం - నాకృషి" (1922) అనే గ్రంథం నుంచి గ్రహించ బడింది.]

# 'T' మోడల్ కారు ఆవిర్భావ వృత్తాంతం

"పాక్కర్డ్ ప్లేస్"లో 81 వ నెంబరు ఇంట్లో చిన్న ఇటికల దుకాణంలో నేను పనిచేసే కాలంలో ఒక క్రొత్త కారు నమూనాను గూర్చి, నిర్మాణ విధానాలను గూర్చి కృషి చెయ్యడానికి కావలసినంత అవకాశం నాకు లభించింది. కాని, సరిగ్గా నేను ఉద్దేశించిన విధంగా ఒక సంస్థను రూపొందించి, పనిలో నాణ్యం, ప్రజానుకూల్యం అనేవే ప్రధాన లక్ష్యాలుగా నిర్మాణం సాగించ గలిగినప్పటికీ, ఆ నాడు అమలులో ఉన్న నిర్మాణ విధానాల దృష్ట్యా, పూర్తిగా మేలిరకం కారును నేను తక్కువ ధర కమ్మటానికి వీలుగా నిర్మించ గలిగి ఉండేవాణ్ణి కాను.

ఒకపనిని మొదటిసారికంటె రెండోసారి చాలాబాగా చేయవచ్చునని అందరూ ఎరిగిన సంగతే! కాని, ఆ కాలంలోని ఉత్పత్తిదారులు దర్శంమీద ఈప్రాథమిక సత్యాన్ని ఎందుకు గుర్తించలేదో నాకు తెలియదు. ఒకవేళ - అమ్మకానికి ఏదో ఒక సరుకు కావాలనే తొందరలో ఉత్పత్తికి తగినంతగా ఏర్పాట్లు చేసుకొనే వ్యవధానం వారికి లేక పోయిందేమో నేను చెప్పలేను. భారీ ఎత్తున సరుకు ఉత్పత్తి చేసి అట్టే పెట్టుకోడానికి బదులుగా, 'ఆర్డర్' వచ్చినప్పుడే ఉత్పత్తి చేసే అలవాటు, లేక ఆచారం చేతిపనుల యుగం

నుంచి మనకు సంక్రమించిన వారసత్వ మనుకుంటాను. ఫలానావస్తువు మీకు ఎలా ఉంటే ఇష్టం అని వందమందిని ప్రశ్నించండి. సుమారు 80 మందికి మీ ప్రశ్నకు సమాధానం తెలియదు; వాళ్లా విషయాన్ని మీ నిర్ణయానికే వదిలివేస్తారు. మిగిలిన వారిలో 15 మంది ఏదో ఒకసమాధానం చెప్పాలనుకుంటారు; కాని, చెప్పలేరు. నిజంగా - ఆ వందమందిలోను చిట్టచివరి అయిదుగురికే ప్రత్యేకాభిరుచులూ, వాటికి తగిన హేతువులూ ఉంటవి. తమకేలాంటి సరుకు కావాలో తెలియక తెలియదని ఒప్పుకునే వారితోను, తెలియక పోయినా ఆ సంగతి ఒప్పుకోని వారితోను కూడిన నూటికి 95 వంతులమందే నిజానికి ఏ సరకుకైనా క్రేతలు (Buyers) గా ఏర్పడుతున్నారు. సరుకులో ప్రత్యేకమైన నాణ్యాన్ని కోరే మిగిలిన 5 వంతులమందిలో ఆ నాణెపు సరుకు కొనగలవారూ, కొనలేనివారు కూడా ఉండవచ్చును. కొనగలవారికి ఆలాంటి సరుకు సరఫరా అవుతుంది. అయితే, అట్టి వారి సంఖ్య చాలా తక్కువ. ఇక - ఈ 95 వంతుల మందిలోను బహుశః పదిమందో పదిహేనుగురో నాణ్యంచూసి ధరపెట్టే వారుంటారు. మిగిలిన వారిలో కొందరు నాణ్యం ప్రసక్తి లేకుండా కేవలం ధరను బట్టే కొనేవారుంటారు. కాని, ఇలాంటి వారి సంఖ్య నానాటికీ తగ్గిపోతున్నది. క్రేతలు ఎలా కొనాలో క్రమంగా నేర్చుకుంటున్నారు. అధిక సంఖ్యాకులు నాణ్యం చూచి, తమ డాలరుకి వీలైనంత ఎక్కువ నాణ్యంగల సరుకును రాబట్టు

కోవాలని చూస్తున్నారు. అందుచేత ఈ నూటికి 95 వంతుల మందికీ నచ్చే నాణ్యంగల సరుకును ఉత్పత్తిచేసే పద్ధతి కని పెట్టి, అటు తరువాత ఆ నాణ్యం తగ్గకుండా, సాధ్యమయి నంత తక్కువ ధరకి సరఫరా చెయ్యడానికి వీలుగా ఆ సరు కును ఉత్పత్తిచేసే ఏర్పాటు నీవు చేయగలిగితే, సార్వజనీన మని చెప్పదగిన 'గిరాకీ' (Demand) నీ సరుకుకి ఏర్పడు తుంది.

ఇదంతా నాకు ప్రత్యక్ష సత్యంగా కనిపిస్తుంది. సంఘంలో నూటికి 95 వంతుల మందిని సంతృప్తిపరచజూచే ఏ వ్యాపారానికైనా ఇదే సహేతుకమైన ప్రాతిపదిక! సంఘం శ్రేయస్సును సాధించుకునేందుకు కూడా ఇదే హేతు బద్ధమైన మార్గం! వ్యాపారమంతా ఈ పద్ధతిమీద ఎందుకు నడవదో నే నర్థం చేసుకోలేను. ఈ పద్ధతిని అవలంబించేం దుకు చేయవలసినదల్లా చేతికి చిక్కిన మొట్టమొదటి డాల రునే, - అదే ప్రపంచంలో ఏకైకమైన డాలరు అన్నట్టుగా - స్వాయత్తం చేసుకోవాలని చూడకపోవడం. ఈ అలవాటు ఇప్పటికే కొంతవరకు జయించబడింది. ఈ దేశం (అమె రికా) లో జేగీయమానంగా నడుస్తున్న పెద్ద పెద్ద చిల్లర దుకాణాలన్నీ 'ఒకే ధర' సూత్రాన్నే పాటిస్తున్నవి. ఇక జరుగవలసినదల్లా - కొనుగోలు శక్తిని బట్టి ధరలు నిర్ణ యించే పద్ధతికి స్వస్తిచెప్పి, ఉత్పాదన వ్యయాన్ని బట్టి ధరలు నిర్ణయించే వివేకయుతమైన పద్ధతి నవలంబించడమూ,

తర్వాత క్రమంగా ఆ ఉత్పత్తి ఖర్చుకూడా తగ్గే ఉపాయం చూడడమూ.

ఒక సరుకు నమూనాను గూర్చి శ్రద్ధగా యోచించడం ద్వారా దానిలో మార్పులు నెమ్మదిమీద క్రమంగా వస్తాయి. కాని, ఉత్పత్తి విధానాలలోని మార్పులు మాత్రం అతి వేగంగాను, అత్యంత సహజంగాను వచ్చివేస్తాయి. మేము చేబట్టిన ప్రతి విషయంలోను మా అనుభవం అలాగే ఉంది. అదంతా ఎంత సహజంగా జరిగినదీ తర్వాత వివరిస్తాను. ముఖ్యంగా ఇక్కడ నేను నొక్కి చెప్పదలుచుకున్న విషయం: ముందుగా అఖండమైన యోచనచేస్తేతప్ప మనం మన శక్తినంతా కేంద్రీకరించదగిన మంచి సరుకును ఉత్పత్తి చెయ్యగలగడం అసంభవమనిన్నీ, అది ఏ ఒక మధ్యాహ్నమో కూర్చుంటే తెమిలే పని కాదు అనిన్నీ.

ప్రయోగాలు చేస్తూ గడిపిన ఆ సంవత్సరంలో ఈ అభిప్రాయాలన్నీ నాలో ఒక రూపాన్ని పొందుతున్నవి. నా ప్రయోగాలలో ఎక్కువ భాగం పందెపు కార్లను నిర్మించే విషయాన్ని గురించి చేశాను. అత్యుత్తమమైన కారు అంటే పందెపు కారే అని ఆ రోజుల్లో అంతా అనుకునేవారు. నేను నిజానికి పందెపు కార్లను గూర్చి ఎక్కువ ఆలోచించిన వాణ్ణి కాను. కాని, బైసికిల్ దృష్టాంతం చూచి, ఒక రోడ్డు మీద పందెం గెలవడం ఆ స్వయంచాలక యంత్రంయొక్క గొప్పతనాన్ని ప్రజలలో బాగా ప్రచారం చేస్తుందనే ఊహ ఆ నాటి ఉత్పాదకుల కందరికీ

ఉండేదీ. వేగపు పరీక్షకే కాక, ఇతర పరీక్షలకు నిలిచినా, అంత ఎక్కువ ప్రచారమూ కలుగుతుందనే నేను భావించే వాణ్ణి.

అయితే - ఇతరులందరూ చేస్తున్నారు గనుక, నేనూ ఆపని చెయ్యవలసి వచ్చింది. 1903 లో టామ్ కూపర్‌తో కలిసి పూర్తిగా వేగం దృష్టితోనే నేను రెండు కార్లు నిర్మించాను. రెండూ ఇంచు మించు ఒకమోస్తరువే! మొదటి దానికి "999" అనీ, రెండోదానికి 'ఏరో' (బాణం) అనీ పేర్లు పెట్టాము. ఒక కారు వేగానికి పేరు పొందిందంటే, ప్రపంచంలో వేగం ప్రసక్తి వచ్చిన చోటల్లా ఆ కారు ప్రసక్తి వచ్చితీరాలి. ఈ రెండు కార్లూ అటువంటివి. అంతకుముందు ఎవ్వరూ విని ఎరుగని రీతిగా - ప్రతికారులోను 80 అశ్వముల శక్తినిచ్చే నాలుగేసి పెద్దసిలెండర్లను మేము ఏర్పాటుచేశాం. ఆ సిలెండర్ల మోతేచాలు - మనిషికి పై ప్రాణం పైన పోయేట్టు చేయడానికి. ఒకటే సీట్ ఉంది. నేను ఆ కార్లను నడిపి పరీక్షించాను. కూపర్ కూడా ఆ కార్లను నడిపి పరీక్షించాడు. మేము పూర్తి వేగంతో వాటిని నడిపాము. ఆ వేగం చూచి కలిగిన అలజడిని పూర్తిగా నేను వర్ణించలేను. వాటిలో ఒక కారులో ప్రయాణించి వచ్చిన తర్వాత నయాగరా జలపాతంమీద ఖులాసాగా నౌకా విహారం చేయవచ్చు. మేము మొదటి పందెంలో పెట్టిన "999"ని నడపే బాధ్యత నేనే వహించడం నాకు ఇష్టం లేదు. కూపర్‌కీ ఇష్టంలేదు. వేగంమీదే బ్రతికే ఒక

వ్యక్తిని తానెరుగుదుననీ, అతడు తట్టుకోలేని వేగం అంటూ లేదనీ కూపర్ అన్నాడు. అతడు సాల్ట్ లేక్ సిటీకి తంతి పంపాడు. వెంటనే బైసికిల్ పందెములే వృత్తిగా జీవిస్తూన్న బార్నే ఓల్డ్‌ఫీల్డ్ అనే వ్యక్తి వచ్చాడు. అతడంతకు ముందెప్పుడూ మోటారుకారు తోలినవాడుకాడు. అయితే కారు డ్రైవింగ్ నేర్చుకోవాలని అతనికుంది: ఏపనినైనా ఒకసారిచేసి చూడాలనిపించే స్వభావ మతనిది.

అతనికి డ్రైవింగ్ నేర్పడానికి ఒకవారం రోజులకంటె ఎక్కువ పట్టలేదు. ఆమనిషి భయమంటే ఏమిటో ఎరుగడు. అతడు నేర్చుకోవలసినదల్లా ఆభూతాన్ని స్వాధీనంలో ఉంచుకునే విధానాన్ని మాత్రమే! ఈనాడు అత్యంతవేగంగా పోయేకారును అదుపులో ఉంచడం ఆకారుతో పోల్చిచూస్తే చాలా తేలిక అనిచెప్పాలి. అప్పటికి స్టీరింగ్ చక్రాన్ని కనిపెట్టలేదు. అంతవరకూ నేను నిర్మించిన కార్లన్నిటికీ ఒక 'టిల్లర్' త్రాడే ఉండేది. ఆకారుకి మాత్రం రెండు అలాంటి త్రాళ్ళు ఏర్పాటుచేశాను. ఎందుకంటే – కారుని తిన్నగా పోనివ్వడానికి ఒక బలమైనమనిషి తన బలమంతా ఉపయోగించవలసి వచ్చేది. మేము పాల్గొనవలసిన పందెం 'గ్రాస్ పాయింట్' రోడ్ మీద మూడో మైలురాయి దగ్గర ఆరంభమవుతుంది. అంతవరకూ మా కార్లను గురించి ఎవ్వరికీ తెలియకుండా దాచిపెట్టాం. ఎవరి ఇష్టం వచ్చినట్లు వాళ్ళని ఊహించుకోనిచ్చాం. ఆనాటి రోడ్లు శాస్త్రీయంగా వేసినరోడ్లుకావు. ఆరోడ్లమీద ఒక

కారు ఎంతవేగంగా పోవచ్చో తెలియదు. మలుపుల విష యంలో 'ఓల్డ్‌ఫీల్డ్' కంటె తెలిసినవాడు లేడు. నేను కారుని స్టార్ట్ చేస్తూండగా అతడు కారులో ఆసీనుడవుతూ ఖులా సాగా అన్నాడు: "ఈ రథం నన్ను చంపితే చంపివేయ వచ్చు; కాని, కారు రోడ్ తప్పిపోయేవేళకు నేను 'యమ' వేగంగా తోలుతున్నానని మాత్రం ఆతర్వాత అందరూ చెప్పుకుంటారు."

అతడు అంత వేగంగానూ వెళ్లాడు ... చూపును ఎప్పుడూ మరో వేపుకి త్రిప్పలేదు. మలుపులలో కూడా వేగం తగ్గించలేదు. కారుని పూర్తి వేగంతో వదిలేశాడు; నిర్నిరోధంగా అది ముందుకు సాగిపోయింది. పందెము ముగిసేవేళకి అతడు తన తరువాతి వాడికంటె ఒక అరమైలు ముందున్నాడు.

999 కారు ఏ ఉద్దేశంతో నిర్మించబడిందో ఆ ఉద్దే శం నెరవేరింది, వేగంగా నడిచే మోటారుకారును నేను నిర్మించగలనని అది దేశంలో బాగా ప్రచారం చేసింది. ఆ పందెం ముగిసిన వారం రోజులకు నేను ఫోర్డు మోటారు కంపెనీ స్థాపించాను. నేను దానికి ఉపాధ్యక్షుడుగాను, నమూనాల నిర్మాత (Designer) గాను, ప్రముఖ యాంత్రి కుడు (Machanic) గాను, పర్యవేక్షకుడుగాను, జనరల్ మేనేజరుగాను పనిచేసే వాణ్ణి. ఆ కంపెనీ మూలధనం లక్ష డాలర్లు. దానిలో నూటికి 25½ వంతులు నాది. నగదుగా వసూలుచేసిన మొత్తం సుమారు 28 వేల డాలర్లు

మాత్రమే! మూలధనం క్రింద ఆ కంపెనీ మళ్ళీ వాటాదార్ల నుంచి డబ్బు అడగలేదు. నా వెనుకటి అనుభవాన్ని గమనించకుండా, పూర్తి అధికారాన్ని స్వాయత్తం చేసుకో డానికి అవసరమైనన్ని వాటాలు నాకు లేకపోయినా, నేను ఆ కంపెనీని నిర్వహించడం సాధ్యమవుతుందని ఆరంభంలో నేను అనుకున్నాను; కాని, అనతికాలంలోనే నా పొర పాటును గుర్తించాను. ఆ కంపెనీవల్ల నాకు వచ్చిన లాభా లతోనే 1906 లో ఇంకా వాటాలు కొని నూటికి 51 వంతుల వాటాలకు యజమాని నయాను. తర్వాత కొద్ది కాలానికి మరికొన్ని వాటాలు కూడా కొని మొత్తం నూటికి 58½ వంతుల వాటాలు నా పరం చేసుకొన్నాను. ఏటేటా వస్తున్న లాభాలలోనుంచే నూతన సాధన సంపత్తి సమ కూర్చుకుంటూ ఆ కంపెనీ అభివృద్ధి పొందుతూ వచ్చింది. 1919 లో నా కుమారుడు ఎడ్సెల్ మిగిలిన 41½ వంతుల వాటాలూ కూడా కొనివేశాడు. మైనారటీ వాటాదారులు కొందరు నా విధానాలకు అంగీకరించక పోవడం వల్ల ఆ పని అవసరమైంది. నూరు డాలర్ల వాటాకి 12,500 డాలర్ల చొప్పున మొత్తం 7,50,00,000 డాలర్లు చెల్లించి ఆవాటాలు నా కుమారుడు కొన్నాడు. మొదట కంపెనీకి సాధన సంపత్తి చెప్పుకోదగినంత లేదు. మాక్ వీధిలో 'స్ట్రీ'లో వడ్రంగి దుకాణం మే మద్దెకు పుచ్చుకున్నాం. నేను కార్ల నమూనాలు తయారు చేయడంతో పాటు వాటి నిర్మాణ పద్ధతులను కూడా నిర్ణయిస్తూండేవాణ్ణి. కాని,

ఆ కాలంలో మాకు పెద్ద యంత్రాలుకొనే తాహతు లేక పోవడం వల్ల కారంతా నా పథకం ప్రకారమే నిర్మించబడ్డా, వివిధ ఉత్పాదకులచేత నిర్మింపబడేది. వేరువేరు భాగాలను సంధించడంలో కూడా మేము చేసే పని కేవలం చక్రాలూ, టైర్లూ, బాడీ తగిలించడం వరకే! నేను పైన వివరించిన నిర్మాణ ప్రణాళిక ప్రకారం సరిగ్గా వివిధభాగాలూ ఉత్పత్తి కాగలవనే నమ్మకం కనుక ఉన్నట్లైతే, నిజంగా అదే చాలా పొదుపరితనంతో కూడిన ఉత్పత్తి విధానం. భవిష్యత్తులో అయినా చాలా తేలికగా నిర్మింపదగిన వస్తువుల విషయంలో తప్ప, ఒకేచోట వివిధ భాగాలు ఉత్పత్తిచేయక పోవడమే అత్యంత లాభదాయకమైన ఉత్పత్తివిధానం కాగలదు. ఆధునిక – లేక, ఆగామి అనడం ఇంకా మంచిది – పద్ధతిలో ప్రతిభాగం అది చాలా బాగా తయారయ్యేచోటనే నిర్మితం కావడం, తర్వాత వినియోగానికి వీలుగా ఆ భాగాలన్నిటిని ఒక చోట సంధించడం జరుగుతుంది. మేము ప్రస్తుతం అను సరిస్తూ, ఇంకా విస్తరింపజేయాలని అనుకుంటూన్న పద్ధతి కూడా ఇదే! అందరూ ఒకేవిధమైన సరఫరా విధానాలను అవలంబించేటట్లైతే, ఒకే సంఘం, లేక వ్యక్తి ఒకవస్తువు యొక్క వివిధ భాగాలను తయారుచేసే ఫ్యాక్టరీ లన్నిటి మీదా యాజమాన్యం వహించినా, లేక, ప్రతిభాగం మన స్వంత కర్మాగారంలోనే తయారుచేసుకున్నా ఫలితం ఒక్కటే! మనం తయారు చేసుకున్నంత బాగా ఉండే విడి భాగాలు ఖరీదుకి బయట మనకు దొరుకుతున్నప్పుడు, అందు

లోనూ అవి పుష్కలంగా దొరుకుతూ, ధర కూడా సర సంగా ఉన్నప్పుడు, మనం అట్టి విడిభాగాల్ని – మరీ ప్రాణావసరం వచ్చినప్పుడు తప్ప – స్వయంగా తయారు చేసుకోవాలని చూడము. నిజానికి – విడిభాగాలు ఉత్పత్తి చేసే ఫ్యాక్టరీలమీద యాజమాన్యం కూడా ఎక్కువగా విభక్తమై ఉండడమే మంచిది.

కారు బరువును తగ్గించే విషయంలో నేను ప్రధా నంగా ప్రయోగాలు జరుపుతూ వచ్చాను. ఏ స్వయం చాలక వాహనానైనా అధికభారం క్రుంగదీసేస్తుంది. బరువునుగూర్చి అనేక మూఢాభిప్రాయాలున్నవి. మూఢంగా కొన్ని క్రొత్త పదాలు వాడుకలోకి వచ్చే తీరు బలే చిత్రంగా ఉంటుంది. మానవుని మానసిక సాధనాలకు వర్తించే "బరువైన భారం" (Heavy weight) అనేపదం ఒకటి తయారైంది. ఎవ్వడూ తన శరీరం తెగబలిసి, బరువెక్కువ కావాలని కోరడుగదా! – ఇక మనస్సు విష యంలో మాత్రం అట్లా ఎందుకు కోరుతాడు? అస్పష్ట మైన ఏదో కారణంవల్ల మనం బలానికీ, బరువుకీ మధ్య తబ్బిబ్బు పడుతూ ఉంటాం. తొలికాలపు ఉత్పత్తిలోని మొరటు విధానాలు నిస్సందేహంగా ఇలాంటి తబ్బిబ్బుతో కూడినవి. ప్రాతకాలపు ఎద్దుబండీ టన్ను బరువు కలది. ఆ బరువువల్లనే అది అంత దుర్బలమైంది. కొలది టన్నుల బరువుగల మానవులను న్యూయార్క్ నుండి షికాగోకు చేరవేయడానికి రైలుమార్గంమీద ఎన్నోవందల టన్నులు

బరువుగల రైలుబండి నిర్మింపబడుతున్నది. అందుకు పర్యవసానంగా - నిజమైన శక్తి ఎంతో దుర్వ్యయమౌతూంది. విద్యుచ్ఛక్తి రూపంలో లెక్కలేనన్ని లక్షల డాలర్లు ఖర్చు అవుతున్నవి. శక్తి భారంగా మారిన చోటునుంచే 'మూల్యక్షీణ సూత్రం' (Law of Diminishing Values) వర్తించడం ఆరంభమవుతున్నది. ఒక్క రోడ్ రోలర్‌కి మాత్రం బరువు వాంఛనీయం కావచ్చు; మరి దేనికీ కాదు. శక్తికి బరువుతో ఏ విధమైన సంబంధమూ లేదు. ప్రపంచములో కార్యసాధకుడైన మనిషి మనస్తత్వం ఉల్లాసకరంగాను, తేలికగాను; అయినా బలంగానూ ఉంటుంది. ఈ ప్రపంచంలో అత్యంత సుందరమైన వస్తువులన్నీ అధికభారం తగ్గించి వేయబడినవే? మనుష్యుల విషయంలో గాని, వస్తువుల విషయంలోగాని శక్తి అనేది కేవలం బరువే కాదు. ఎవరైనా నాకు నేను నిర్మించే కార్ల బరువు పెంచమనీ, మరొక భాగాన్ని కూడా చేర్చమనీ సూచించినప్పుడల్లా, నేను వాటి బరువును తగ్గించే మార్గం కోసం, ఏదైనా భాగాన్ని తీసివేసే వీలుకోసం చూస్తూ ఉంటాను. అప్పటికి నిర్మితములైన కార్లన్నిటిలోకీ అప్పుడు నేను నమూనా తయారుచేసిన కారు చాలా తేలికయినది. దాని తత్త్వం పూర్తిగా తెలిసి ఉంటే ఇంకా తేలికగా చేయగలిగి ఉండేవాణ్ణి. అనంతరకాలంలో తగిన ముడిసరకు సంపాదించి అంతకంటె కూడా బరువు తక్కువ ఉండే కారు నిర్మించాను.

మా కంపెనీ స్థాపించిన తొలి సంవత్సరంలో

''మోడల్-ఏ'' కార్లు తయారుచేసి, బాడీ లేకుండా 850 డాలర్లు చొప్పునా, బాడీ మరొక వంద డాలర్లు చొప్పునా, విక్రయించాము. రెండు సిలెండర్ల మోటారుతో 8 అశ్వాల శక్తితో నడిచేందుకు వీలుగా ఆ కార్లను మేము నిర్మించాము. ఇంజన్‌లోనుంచి చక్రాన్ని త్రిప్పేందుకు గొలుసుతో బంధించిన పరికరమూ ముందూ వెనుకా చక్రాల మధ్య 72 అంగుళాల అంతరమూ, – అది సుదీర్ఘమైన అంతరమని భావించేవారు – అయిదు గాలన్ల తైలం నుపయోగించే శక్తి ఉండేటట్టు అది నిర్మితమైనది. ఆ తొలి సంవత్సరం మేము మొత్తం 1708 కార్లు నిర్మించి విక్రయించాము. ప్రజల ఆదరణ అంత ఎక్కువగా మాకు లభించింది.

గారడీ చేసినట్టు మా వ్యాపారం చరచరా అభివృద్ధి పొందింది. మన్నికకు మా కార్లు ప్రసిద్ధికెక్కినవి. అతి బలంగాను, సరళంగాను, అందంగానూ నిర్మించబడినవి. సర్వజనోపయోగి అయిన ఒకే నమూనాను తయారుచేయడానికై నేను కృషిచేస్తున్నాను; కాని, ఏ నమూనానూ నేను స్థిరపరచలేదు; పై పెచ్చు ఉత్పత్తికి అవశ్యకమైన అనుకూల యంత్రాలను ఏర్పరచుకొనేటందుకు చాలినంత డబ్బు మాదగ్గిర లేదు. బాగా తేలిక అయిన పదార్థమేదో పరిశోధించేందుకు నాదగ్గర డబ్బులేదు. బజారులో లభ్యమయ్యే సరుకుతోనే మేము తృప్తిపడి ఊరుకోవలసివచ్చేది. దొరికినంతలో అత్యుత్తమమైన సరుకే కొనేవాళ్ళం; కాని, వివిధ పదార్థాలను శాస్త్రీయ పద్ధతిలో పరీక్షించేందుకుగాని,

స్వతంత్ర పరిశోధన జరిపేందుకుగాని మాకు అవకాశాలు లేవు.

మా కార్లన్నీ ఒకే నమూనాలో నిర్మించడం సాధ్య మని నా సహచరులకు నమ్మకం కలుగలేదు. బైసికిల్ పరి శ్రమలో వెనుక అవలంబిస్తూ ఉండిన పద్ధతినే కార్లపరిశ్రమ కూడా అనుసరిస్తూన్నది. ఆ బైసికిల్ పరిశ్రమలో ప్రతి ఉత్పాదకుడూ ఏటేటా క్రొత్త మోడల్ సైకిల్ నిర్మించడం అవసరమనీ, ఆక్రొత్తదాన్ని వెనుకటి వాటికంటె చాలా అభివృద్ధిపరచడం ద్వారా వెనుకటి నమూనాలు కొన్న వాళ్ళుకూడా వాటిని ఎలాగో వదల్చుకొని, క్రొత్తమోడల్ సైకిల్ కొనుక్కునేటట్టు ప్రలోభ పరచవచ్చుననీ భావించే వాడు. ఆసూత్రాన్ని అనుసరించిన వాణిజ్యమే మంచి వాణిజ్యం అనే భావం ఉండేది. స్త్రీలలో కూడా తమ దుస్తుల విషయంలోను, టోపీల విషయంలోను, ఇదే భావం కని పిస్తుంది. నిజానికది సక్రమమైన 'సేవ' అనిపించుకోదు. ఏదో క్రొత్తసరుకును సరఫరా చెయ్యాలనేకాని, వెనుకటి దానికన్న మంచి సరుకును అందజేద్దామనే సంకల్పమే లేదు. వ్యాపారం – అనగా, నిరంతరాయమైన అమ్మకం – బాగా సాగాలంటే కాతాదారును శాశ్వతంగా సంతృప్తిపరచడంవల్ల కాక, అతని దగ్గర ఒకవస్తువుకి ముందు డబ్బు గుంజి, తర్వాత అదే వస్తువులో మరోరకంచూపి, దాన్నికూడా కొనేటట్టు ప్రలోభపరచడం వల్లనే అది సాధ్యమవుతుందనే అభి ప్రాయం ఉత్పాదకులలో బాగా నాటుకొనిపోయి ఉండడం

ఆశ్చర్యకరం! ఆరోజుల్లో నామనస్సు లోతులలో ఒక ఊహ ఉండేది. కాని, దానిని కార్యరూపంలో పెట్టడానికి కావలసిన హంగు మాకు లేదు. ఆ ఊహ ఏమిటంటే – ఒక నమూనాను స్థిరపరిస్తే, ఇక ఆ తరువాత తోచే మెరుగులన్నీ ఆ పూర్వపు నమూనాలోకూడా చేయడానికి వీలుగా ఉండాలి. దానివల్ల ఏ కారూ 'మోటు' అయిపోవడం (ఫాషన్‌లో పాతపడిపోవడం) అంటూ ఉండదు. నేను తయారు చేసే ఏ యాంత్రిక భాగమైనా మళ్లీ రెండోది కొనుక్కోవలసిన అవసరం పట్టనంత బలమైనదిగా తయారు చెయ్యాలని నాకాంక్ష. ఏరకమైన మంచి యంత్రమైనా ఒక మంచి గడియారం మన్నినంత దీర్ఘకాలం మన్నాలి.

రెండో ఏడు మాశక్తులన్నీ మూడు నమూనాల కార్ల మధ్య విభక్తమైపోయినవి. 'మోడల్ – బి' అనే నాలుగు సిలెండర్లుగల టూరింగ్ కారు ఒకటి నిర్మించి, రెండేసి వేల డాలర్ల చొప్పున విక్రయించాము. 'మోడల్ – ఏ' కి కొంచెం మెరుగుదిద్ది 'మోడల్ – సి' అనే కారు తయారు చేసి వెనుకటి ధరమీద 50 డాలర్లు ఎక్కువచేసి అమ్మాము. "మోడల్ – ఎఫ్' అనే మరొకరకం టూరింగ్ కారు నిర్మించి వెయ్యేసి డాలర్లకు విడుదలచేశాం. అనగా – మాశక్తి విక్షిప్తమై పోవడం, పై పెచ్చు ధరలు పెంచడం జరిగింది. తత్పర్యవసానంగా మొదటి ఏడాదికన్న రెండవ ఏడాది తక్కువ కార్లు అమ్మగలిగాము. ఆ యేడు 1695 కార్లే అమ్ముడు పోయినవి.

మామూలు రోడ్లమీద వాడడానికి వీలైన మొట్ట మొదటి నాలుగు సిలెండర్ల కారు - 'మోడల్ - బి' కారు. దానికి ప్రచురణ చేయవలసి ఉన్నది. పందెం గెలవడం గాని, క్రొత్త 'రికార్డు'ను ఏర్పరచడం గాని ఆ రోజుల్లో అత్యుత్తమ విధమైన ప్రచురణ. అందుచేత - వెనుక "999"తోపాటుగా నిర్మించిన 'ఏరో' అనే కారును (ఇంచుమించు అదిపూర్తిగా పునర్నిర్మించబడింది) పందెంలో ప్రవేశ పెట్టడానికి నిశ్చయించాను. న్యూయార్క్ మోటారు పందెములు ఆరంభం కావడానికి ఒక వారం ముందు నేను స్వయంగానే మంచుమీద ఒకమైలు దూరం 'డ్రైవ్' చేసి చూశాను. ఆ పందెం నేనెన్నటికీ మరువలేను. ఆ మంచు చాలా మృదువుగా ఉన్నట్టూ, అప్పుడు గనుక నేను పందెంలో నుంచి విరమించినట్లైతే వ్యతిరేకపు ప్రచారం మా కారుకి చాలా ఎక్కువగా వచ్చేటట్టు నాకు మొదట అనుపించింది. కాని, నిజానికా మంచు అంత మృదువుగా లేకపోగా, పొరలు పొరలుగా పేరుకొని, మధ్య మధ్య చాళ్లు ఏర్పడి ఉన్నది. వేగం పెంచేవేళకు ఆ చాళ్లు చాలా ఇబ్బంది పెడతాయని నాకు తెలుసు. అయితే, అంత వరకూ వచ్చాక, ఆ పందెంలో పాల్గొనడం తప్ప, గత్యంతరం లేదు. చివరికి 'ఏరో'ని పందెంలో నడిపాను. మంచులో చాలు చాలు దగ్గరా కారు గాలిలో కెగిరేది. మళ్ళీఎలా నేల మీందికి వాలుతున్నదీ నాకు తెలిసేదికాదు. అలా గాలిలోకి ఎగరని సమయాలలో నా కారు జారిపోతూ ఉండేది.

ఎలాగో ప్రయత్నంమీద నేను కారు తల క్రిందులు కాకుండా చూచుకుంటూ వచ్చాను. చివరికి ప్రపంచ మంతా నివ్వెరపోయే 'సిక్సర్' స్థాపించ కలిగాను. ఆ పందెం 'మోడల్ - బి' కారుకి వాణిజ్య జగత్తులో ఒక ప్రముఖ స్థానాన్ని సమకూర్చింది. అయితే - ధర పెంచింపును సహించేటంత మోజును కలిగించలేక పోయింది. ఎట్టి 'స్టంట్'గాని, ఎంత ప్రచురణగాని ఒక వస్తువును ఎంతో కాలం అమ్ముడు పోయేటట్లు చేయలేదు. వాణిజ్యం జూదం కాదు. క్రమంగా ఆ సత్యం బోధపడుతూంది.

మేము చేస్తున్న వ్యాపారానికి మా చిన్న కొలిమి దుకాణం బొత్తిగా సరిపోని స్థితి వచ్చింది. 1906 లో మా పెట్టుబడిలో నుంచి కొంతడబ్బు తీసి పికెట్, బ్యూబిన్ వీథులు కలిసే మలుపులో ఒక మూడంతస్థుల భవనం నిర్మించాము. మొట్ట మొదటిసారిగా అప్పుడే మాకు నిజమైన ఉత్పాదన సౌకర్యాలన్నీ అమరినవి. ప్రధానంగా మాది వివిధ భాగాలను సంధించే వ్యాపారమే అయినా, క్రమంగా చాలా విడి భాగాలు కూడా మేము స్వయంగా ఉత్పత్తి చేసుకోడం మొదలుపెట్టాం. 1905-1906 సంవత్సరంలో మేము రెండు నమూనాల కార్లే తయారు చేశాం. మొదటిది రెండేసివేల డాలర్ల చొప్పున అమ్మిన నాలుగు సిలెండర్ల కారు; రెండోది వెయ్యేసి డాలర్ల చొప్పున అమ్మిన టూరింగ్ కారు. రెండూ అ క్రితం సంవత్సరపు నమూనాలే! మా అమ్మకం - 1599 కార్లకి తగ్గిపోయింది.

దానికి కారణం మేము క్రొత్త నమూనాలు తయారు చేయకపోవడమే అని కొందరన్నారు. మా కారు చాలా ప్రియం అవడంవల్లా, నూటికి 95 వంతుల మందిని ఆకర్షింప లేకపోయినందు వల్లా అమ్మకం పడిపోయిందని నేను అనుకున్నాను. మరుసటి యేడాది నేను నూటికి 50 కంటె ఎక్కువ వాటాలు నా పరం చేసుకొని కంపెనీ విధానం మార్పు చేశాను. 1906-1907 సం॥రంలో మేము పూర్తిగా టూరింగ్ కార్లను నిర్మించడం మానేసి, మూడు నమూనాలలో బాడీలేని కార్లనూ, రోడ్లమీద నడిచే మామూలు కార్లనూ తయారుచేశాం. నిర్మాణ విధానాలలోగాని, భాగాలలోగాని ఆ మూడు నమూనాలలోను చెప్పదగిన వ్యత్యాస మేమీ లేదు. స్వరూపంలో మాత్రమే కొంత తేడా కనిపిస్తుంది. అన్నిటికంటె ముఖ్యవిషయం ఏమిటంటే - మా కార్లలో అన్నిటికంటె చౌక కారు 600 డాలర్లు. అన్నిటికంటె ప్రియపు కారు 750 డాలర్లు. దానితో ధరలో ఎంత మాహాత్మ్యముందో మాకు స్పష్టమైపోయింది. ఆ ఏడు 8,423 కార్లు - ఆ క్రితం సంవత్సరాలలో బాగా ఎక్కువ అమ్మిన సంవత్సరపు అమ్మకానికి ఇంచుమించు అయిదురెట్లు - అమ్మగలిగాము. వ్యాపారం తారస్థాయి నందుకున్న వారం 1908 మే 15; ఆ వారం ఆరు రోజులలో 311 కార్లు తయారుచేశాం. మా సాధన సంపత్తి చాలక తడుముకోవలసి వచ్చింది. మా ఫోర్మన్ ఒక్కొక్క కారే తయారై పరీక్షలకు అందజేసి నప్పుడల్లా ఒకసీమ

సుప్నం ముక్కుతో ఒక బోర్డుమీద మార్కు చేసేవాడు. ఆ వారం ఆ బోర్డు సరిపోలేదు. ఆ తరువాతినెల జూన్‌లో ఒక్కరోజులో మేము నూరుకార్లు తయారు చేశాం.

ఆ మరుసటి యేడు, అంత విజయవంతంగా సాగిన ఆ కార్య ప్రణాళికను విడిచిపుచ్చి, నేను 50 అశ్వాలశక్తి గల ఆరు సిలెండర్ల పెద్దకారుకి – రోడ్లను వేడెక్కించే బ్రహ్మాండమైన కారుకి – నమూనా తయారు చేశాను. అయితే చిన్నకార్ల నిర్మాణం కూడా సాగిస్తూనే వచ్చాం. కాని, 1907 నాటి భీతావహం వల్లా, మరింత ఎక్కువ ఖర్చుతో కూడిన నమూనావంకకు మాదృష్టి మరలడం వల్లా, మా అమ్మకం 6,398 కార్లకి తగ్గిపోయింది.

ఆ విధంగా అయిదు సంవత్సరాలు మా కంపెనీ ప్రాయోగిక దశలో గడిపింది. క్రమంగా మా కార్లు యూరప్‌లో కూడా అమ్ముడుపోవడం మొదలయింది. అన్ని స్వాయంచాలక యంత్రాల వాణిజ్యాల వలెనే మా వ్యాపారమూ అసాధారణాభ్యుదయం పొందుతున్నట్లు భావించబడింది. డబ్బు మాకు పుష్కలంగా ఉండేది. మొదటి సంవత్సరం నుంచే మా చేతిలో బాగా డబ్బాడేది. మేము నగదు వ్యాపారం చేశాం; ఎక్కడా అప్పు చేయలేదు; సూటిగా క్రేతలకే అమ్మేవాళ్లం. మురిగిపోయే అప్పు లేవీ మాకు లేవు; మేము మా తాహతుకుమించి ఎప్పుడూపోలేదు. నా సాధన సంపత్తి పరిమితిలోనే నేనెప్పుడూ ప్రవర్తించేవాణ్ణి. నేను కాళ్ళు, చేతులు విరుచుకొని పని చేయవలసిన

అవసరం ఎప్పుడూ రాలేదు; ఎందుచేతంటే - తగినంత శ్రద్ధతో మనం మన కర్తవ్యాన్ని నిర్వర్తిస్తూ ఉంటే, మన సాధన సంపత్తి నమ్మటానికి వీలులేనంత వేగంతో పెరిగి పోతుంది. దానిని మళ్ళా వాడుకలో పెట్టటానికి పథకాలు తయారు చేసేటంత వ్యవధానం కూడా ఉండదు......

నేను నా వ్యక్తిగత ప్రతిభను చెప్పడానికై 'ఫోర్డ్ మోటారు కంపెనీ' చరిత్ర నిక్కడ వర్ణించడం లేదు. "మీరు ఇలాగే చేయండి!" అని నేను అందరినీ హెచ్చరించ బోవడమూ లేదు. నేను ముఖ్యంగా చెప్పదలుచుకున్న దేమిటంటే - మామూలుగా సాగే వ్యాపార పద్ధతి అత్యుత్తమ మైనదికాదు అని. మామూలు పద్ధతులకు పూర్తిగా తిలోదకా లిచ్చేదశ నా జీవితంలో వచ్చింది. అటు తర్వాత మా కంపెనీ అసాధారణమైన విజయాలు సాధించింది.

అంతవరకు మేము వాణిజ్యంలో సర్వ సాధారణ విధానాలే ఎక్కువగా అనుసరిస్తూ వచ్చాం. మా కార్లు మిగిలిన వాటికంటే తక్కువ క్లిష్టంగా ఉండేవి. మా కంపెనీలో బయటి వాళ్ళ డబ్బు లేదు. ఈ రెండు విషయాలలో తప్ప ఇతర కంపెనీలకూ, మాకూ ప్రధానమైన భేదం ఏమీ లేదు. అయితే - మా కంపెనీ మిగిలిన వాటికంటె ఎక్కువగా అభివృద్ధి పొందుతూ ఉండటంలోను, కచ్చితంగా నగదు వ్యాపారమే చేస్తూ, మాకు వచ్చే లాభాలను కూడా మళ్లీ వ్యాపారంలో పెట్టి, కంపెనీకి ప్రతి సంవత్సరం పెద్ద

మొత్తం నిలువ చూపుతూ ఉండడంలోను మాత్రం కొంత తేడా కనిపించింది. అన్ని పందెములలోను మా కార్లు పాల్గొన్నవి. బాగా ప్రచారంచేసి, అమ్మకం ఎక్కువ చేసుకున్నాం. మా కార్ల నిర్మాణం సరళంగా ఉండడమే కాక, మా నమూనాలలో మరొక విశిష్టత కూడా ఉండేది. పూర్తిగా "వినోదకరమైన కారు"కి మేము ప్రాముఖ్యత మీయలేదు. బజారులో పోటీ చేస్తున్న మిగిలిన కార్లన్నిటితో పాటు మా కార్లు కూడా వినోదాన్ని కలిగించ కలిగినా, ప్రత్యేకం విలాసదృష్టికి మేము ప్రాధాన్య మీయలేదు. అయితే విడివిడిగా ధర పెట్టగల క్రేతకి అతని అభిమతాను సారం కారు తయారుచేసి ఇవ్వడానికి మేము సిద్ధమే! మా కంపెనీ బాగా అభివృద్ధి పొందింది. ఇంక మేము హాయిగా నిశ్చింతగా – "ఒక స్థితికి వచ్చాము. ఇంక ఈ లాభాలు నిలుపుకుంటే అంతే చాలు!" అనుకునే దశ వచ్చింది.

నిజంగా మాలో కొందరలా అనుకోడం కూడా మొదలు పెట్టారు. మా కంపెనీ రోజుకి 100 కార్లు తయారు చేసే స్థితికి వచ్చేసరికి మా వాటాదార్లలో కొందరు చాలా గాభరా పడ్డారు. నేను కంపెనీని నడపకుండా అడ్డుపడ టానికి ఏదైనా చెయ్యాలని కూడా అనుకున్నారు. కాని నేను రోజుకు వందకార్లు చాలా స్వల్పమనీ, అనతి కాలం లోనే రోజుకి వెయ్యికార్లు నిర్మించే స్థితి సాధించబోతున్నా నని చెప్పేసరికి వారు నిర్విణ్ణు లయారు. కోర్టులో నామీద చర్య జరపాలని కూడా వారు ఆలోచించినట్టు నాకు తెలి

సించి. నా సహచరులలో ఎక్కువగా వ్యాపించి ఉన్న అభి ప్రాయం ప్రకారం - నేను ఆ వ్యాపారాన్ని మరి పెరుగుదల లేకుండా యథాతథంగా నిలిపి ఉంచి, మా కంపెనీ డబ్బుతో చక్కని నిర్వహణ విధానాన్ని రూపొందించి, బాగా చురుకుగా ఉత్పత్తి సాగిస్తున్న పోటీదారులతో సమాలోచనలు జరుపుతూ, ఎప్పటికప్పుడు క్రొత్తక్రొత్త నమూనాలు తయారుచేసి ప్రజల నాకర్షిస్తూ, ప్రశాంత మైన గౌరవనీయమైన వ్యాపారం సాగించే ఒక ప్రశాంత మైన, గౌరవనీయమైన పౌరుడుగా కాలం గడప వలసి ఉన్నది.

ఒక స్థితిలో ఆగిపోయి, సంపాదించినంతవరకూ - జాగ్రత్త చేసుకుందామనే ప్రలోభం అత్యంత సహజమైనది. సంచలనాత్మక జీవితంనుండి విరమించి, ప్రశాంతమైన, సుకరమైన జీవితాన్ని ఆశించడంపట్ల నాకు సానుభూతి ఉంది. అట్టి కోరిక నాలో ఎప్పుడూ తల ఎత్తకపోయినా, ఆ కోరికను నేను అర్థం చేసుకోగలను. అయితే - నిజంగా విశ్రాంతి కోరేమనిషి వ్యాపారంలోనుంచే విరమించాలని నా అభిప్రాయం. విశ్రాంతీ, వ్యాపారమూ - రెండూ కావాలనే ప్రవృత్తి కొందరిలో ఉంటుంది. ఏది ఏమైనప్పటికీ, నాపథకంలో మాత్రం అలాంటి పనికి అవకాశంలేదు. అంత వరకూ మేము చేసిన వ్యాపారం మరెంత ఎక్కువ వ్యాపారం చేయడానికి ఆహ్వానం మాత్రమే అనీ, నిజమైన 'సేవ' చేయదగిన స్థితికి మేము వచ్చినట్లు అది సూచిస్తున్నదనీ

నేను భావించాను. ఆ సంవత్సరాలలో ఇంచుమించు ప్రతి దినం ఒకే ఒక నమూనా కారు తయారుచేసే విషయమై ఆలోచిస్తూనే ఉన్నాను. మేము తయారుచేసిన వేరువేరు నమూనాల కార్ల విషయమై ప్రజల అభిప్రాయాలు తెలిసినవి. ప్రజల వాడకంలోను, పందెములలోను, రోడ్లమీద పరీక్షలలోను తేలిన విషయాలు మార్గదర్శకములుగా పని చేసి, నేను నిర్మించ దలుచుకొన్న శాశ్వతమైన నమూనా విషయమై ఎట్టిమార్పులు అవసరమో నాకు స్పష్టంచేసినవి. 1905 నాటికే నేను నిర్మించదలుచుకొన్న కారును గూర్చిన అభిప్రాయం కొంతవరకు నామనస్సులో స్పష్టంగా ఏర్పడింది...

మొట్టమొదటి కారు రోడ్డుమీద కన్పించిన తొలి నాడే అది మానవుని నిత్యావశ్యకతలలో ఒకటి అని నాకు తోచింది. ఆ జ్ఞానమే, ఆనమ్మకమే నన్ను ఈలక్ష్యం వంకకు, - అసంఖ్యాక ప్రజానీకపు అవసరాలను తీర్చే కారును నిర్మించే లక్ష్యం వంకకు - మరల్చింది. నాటినుంచి నేటి వరకూ నా యత్నాలన్నీ అట్టి ఒకే నమూనా కారును నిర్మించేందుకే ఉద్దేశింపబడినవి. ఒక ఏడాది గడచిన కొద్దీ ఆ నమూనాను ఇంకా ఇంకా అభివృద్ధి చేయాలనీ, ఇంకా నాజూకుగా చేయాలనీ, దానితోపాటు ధర ఇంకా ఇంకా తగ్గించాలని కృషి చేస్తున్నాను. సర్వజనోపయోగి కాగల ఆ ఒకే నమూనాకారుకి ఈక్రింది లక్షణాలు ఉండాలి.

1. ఎక్కువ కాలం మన్నే లోహాలతో దానిని నిర్మిం

చాలి. అన్నిరకాల ఉక్కులలోను 'వెనాడియమ్' ఉక్కు చాలా బలమైనదీ, ఎక్కువ కాలం మన్నేదీ. కార్ల చక్రానికీ, బాడీకీ కూడా ఈ ఉక్కునే, – అది ఎంత ఖరీదైనా సరే – వాడాలి.

2. తేలికగా నడుపడానికి వీలుగా ఉండాలి. (జనమంతా యాంత్రిక నిపుణులు (మెకానిక్ లు) కారు గదా!)

3. కారుకు తగినంత శక్తి ఉండాలి.

4. మధ్యలో కారు భంగపుచ్చదనే నమ్మకం ఉండాలి. ఎందుకంటే – కార్లను అనేక విషయాలకోసం ఉపయోగిస్తారు. అనేక విధాలైన రోడ్లమీద ప్రయాణించవలసివస్తుంది.

5. బరువు తక్కువగా ఉండాలి. ఫోర్డ్ కార్లను మీరు ఎప్పుడు ఎక్కడ చూచినా, – ఇసుకలోగాని, బురదలోగాని, మంచులోగాని, నీటిలోగాని, కొండ లెక్కుతూ గాని, పొలాలలోగాని, రోడ్లులేని మైదానాలలోగాని – ఏ పరిస్థితులలో చూచినా అవి 'సదా పరుస్తూనే' ఉండడానికి ఇది ఒక ముఖ్యకారణం.

6. కారు మన అధీనతలో ఉండాలి. ఎట్టి పరిస్థితులలో అయినా, – జనసమ్మర్దం గల నగర వీథులలోగాని, విపత్కరమైన రోడ్లమీదగాని – శాంతంగా సురక్షితంగా వేగాన్ని అదుపులో ఉంచుకొనే అవకాశం ఉండాలి. ఫోర్డ్ కార్లలో 'ప్లానెటరీ ట్రాన్స్మిషన్' పద్ధతిని వాడుక చేయడంవల్ల అట్టి అవకాశం లభిస్తుంది; ఎవడు పడితే

వాడు ఈ కార్లను నడపడానికి సాధ్యమవుతున్నది. అందుకే "ఫోర్డ్ కారు నెవరైనా నడపవచ్చు" అనే వాడుక పుట్టింది. ఎంత తక్కువ ప్రదేశంలో అయినా ఆ కారు గుండ్రంగా తిరగ గలదు.

7. మోటారుకారు బరువు ఎక్కువ అయిన కొద్దీ సహజంగా దానికి గ్యాసూ, పెట్రోలూ ఎక్కువ అవసర మవుతాయి. బరువు తక్కువైన కొద్దీ నడపడానికయ్యే వ్యయం కూడా తగ్గిపోతుంది. మొదట్లో ఫోర్డ్ కార్లు తేలికగా ఉంటాయనేది వ్యతిరేక ప్రచారకులకు బలమైన యుక్తిగా ఉపయోగపడేది కాని, ఇప్పుడు పరిస్థితి అంతా తారుమారైంది.

నేను స్థిరపరచిన నమూనాకు 'మోడల్ - టి' అని పేరు పెట్టాం. ఆ క్రొత్త నమూనాలో ప్రధాన లక్షణం దాని సరళత. ఆ నమూనా కనుక ఆమోదితమైతే - ఆమోదింపబడుతుందనే ధైర్యం నాకుంది - దానినే ఏకైకమైన నమూనాగా చేసి, నిజమైన ఉత్పత్తి ఆరంభించాలని నా ఉద్దేశం. ఆ కారు నిర్మాణంలో నాలుగే ప్రధాన భాగాలు - 1. శక్త్యుత్పాదక యంత్రం, 2. చట్రం, 3. ముందు చక్రాల మధ్య ఇరుసు, 4. వెనుక చక్రాల మధ్య ఇరుసు. ఇవన్నీ అందుబాటులో ఉండేవే! వాటి మరమ్మతులోగాని, పాత పడితే తీసి, క్రొత్తభాగాలు వేయడంలోగాని, ఎక్కువ ప్రత్యేక నైపుణి అవసరంలేని విధంగా ఆ భాగాల నమూనా నేను తయారు చేశాను. వ్యయంతో కూడిన మరమ్మతు

పనితో అవసరం పట్టకుండా ఉండేటంతి సరళంగానూ, చౌకగానూ ఆ భాగాలను తయారు చేయడం సాధ్యమవుతుందనే విశ్వాసం నా కప్పుడు ఉండేది. అయితే - ఆ ఊహ ఆ కాలానికి విచిత్రమైనది కావడంవల్ల దాని నెక్కువగా నేను ప్రకటించలేదు. ప్రాతభాగాలు మరమ్మత్తు చేయించుకోడంకన్న క్రొత్తభాగాలు కొనడమే తక్కువ వ్యయంతో జరుగుతుందనిపించేటంత చౌకగా ఆ భాగాలను తయారు చెయ్యాలి! మేకులను, గడియలను ఇనుపకొట్లలోకి తీసుకువెళ్ళడానికి వీలయినట్లుగా, ఆ భాగాలు కూడా తీసుకు వెళ్ళడం సాధ్యం కావాలి! కారు నిర్మాణాన్ని అర్థం చేసుకోవడం ఎవ్వరికీ అసాధ్యం కాకుండా ఉండేటంత సరళంగా కారును తయారుచేయడం నమూనాల నిర్మాతగా నా కర్తవ్యమని నేను భావించాను.

అది రెండు విధాలుగానూ ఉపయోగిస్తుంది; ఇతర వస్తువుల విషయంలో కూడా ఈ సూత్రం వర్తిస్తుంది. వస్తువులో క్లిష్టత తగ్గినకొద్దీ దాని నిర్మాణం సులభతరమౌతుంది; మరింత చౌకగా అమ్మడానికి వీలవుతుంది. తద్ద్వారా అమ్మకం పెరగడమూ జరుగుతుంది.

'మోడల్ - టి' కారులో అంతకు ముందు నమూనాలలో లేని ప్రత్యేక లక్షణాలు ఇంచుమించు ఏవీ లేవు. ప్రతి స్వల్పవిషయమూ ఆచరణలో పూర్తిగా పరీక్షించబడినదే! ఆ నమూనా విజయోపేత మవుతుందా, కాదా అనే విషయంలో ఊహాగానానికి తావే లేదు. విజయవంతమై

తీరవలసినదే! అది ఒక్కరోజులో తయారైనది కాక హేవ షం వల్ల ఫలితం అన్యథాగా ఉండే అవకాశం లేదు. మోటారుకార్ల విషయమై అప్పటికి నేను చేసిన కృషీ, మొట్టమొదటి సారిగా నేను సంపాదించ గలిగిన మేలిరకం లోహమూ కలిసి ఆ కారుగా రూపొందినవి. 1908 – 1909 సం॥రం వాణిజ్య ఋతువులో ఆ 'మోడల్ – టి' కారు బయట పెట్టాం.

అప్పటికి మా కంపెనీ వయస్సు అయిదేళ్లు. మొట్ట మొదట మా ఫ్యాక్టరీ స్థాపించినస్థలం వైశాల్యం 28 సెంట్లు. మొదటి ఏడాది సగటున 311 మంది పనివాళ్ళుండేవారు; 1,708 కార్లను ఆ యేడు నిర్మించాము; ఒక బ్రాంచి ఉండేది. 1,908 లో ఫ్యాక్టరీ ఆవరణ 2.65 ఎకరాలకు విస్తరించింది; మాకు స్వంత భవనం ఏర్పడింది. సగటున పనివాళ్ళ సంఖ్య 1,908 కి పెరిగింది. ఆ యేడు 6,181 కార్లు నిర్మిం చాం; 14 బ్రాంచీలు ఏర్పడినవి. వ్యాపారం అభ్యుదయ పథంలో ఉంది.

1908 – 1909 సంవత్సరం వాణిజ్య ఋతువులో నాలుగు సిలెండర్లు గల బాడీలేని 'మోడల్ – ఆర్' కార్లూ, మామూలు రోడ్లపై నడిచే 'మోడల్ – ఎస్' కార్లూ కూడా తయారుచేస్తూనే వచ్చాం. అంతకు ముందవి చాలా బాగా అమ్ముడు పోయినవి. మొదటిది 700 డాలర్ల చొప్పునా, రెండవది 750 డాలర్ల చొప్పునా విక్రయిం చాము. కాని, 'మోడల్–టి' వాటిని పూర్తిగా తుడిచి

పెట్టేసింది. మేము ఆ నమూనాలో మొత్తం 10,607 కార్లను అమ్మగలిగాము; ఏ ఉత్పాదకుడూ ఎప్పుడూ ఏ నమూనాను అమ్మి ఉండ నంతటి పెద్దసంఖ్య ఇది. టూరింగ్ కారు ధర 850 డాలర్లు. అదే చట్రం మీద నగరాలకు తగినట్టు వేరే బాడీకట్టిన దాని ధర 1,000 డాలర్లు. మామూలు రోడ్లమీద నడిచే కారు (Roadster) ధర 825 డాలర్లు. 'కూప్' (Coupe) రకం కారు ధర 950 డాలర్లు. 'లాండాలెట్' (Landaulet) రకం కారు ధర 950 డాలర్లు.

నా నూతన విధానాన్ని అమలు జరిపేందుకు తగిన తరుణం వచ్చిందని ఆ వాణిజ్యఋతువు నిర్ధారణగా నాకు స్పష్టం చేసింది. నేను నా విధానాన్ని ప్రకటించకముందు బ్రహ్మాండమైన ఆ అమ్మకాన్ని చూసి, మా విక్రేతలు (Sales men) మేమింకా ఎక్కువ నమూనాల కార్లు నిర్మిస్తే, మా అమ్మకం ఇంకా పెరుగగలదని భావించ సాగారు. ఒక సరుకు బాగా అమ్ముడుపోతూ ఉంటే, దానిలో మార్పులు వస్తే ఆ సరుకు ఇంకా బాగా అమ్ముడు పోగలదని కొందరు ఎలా భావించడం మొదలు పెడ తారో చిత్రంగా ఉంటుంది. నమూనాల విషయంలో మర్కట చేష్టలు సాగిస్తూ, మంచి సరుకుని మార్చి మార్చి పాడుచేసే ప్రవృత్తి కొందరిలో కనిపిస్తుంది. మావిక్రేతలు నమూనాల సంఖ్య పెంచమని పట్టు పడుతున్నారు. తమ కెలాంటి సరుకు కావాలో చెప్పగల నూటికి 5 వంతులమంది విలక్షణులైన కొతాదారుల మాటలకే వారు చెవి ఒగ్గుతూ,

ఏ రభసా లేకుండా కొనే నూటికి 95 వంతుల మందిని పూర్తిగా మరచిపోతున్నారు. క్రేతలనుంచి వచ్చే ఆక్షేపణాలనూ, సూచనలనూ గూర్చి సాధ్యమైనంత శ్రద్ధగా ఆలోచిస్తేతప్ప ఏ వ్యాపారమూ వర్ధిల్లజాలదు. 'సేవ' లో ఎక్కడైనా లోపం ఉంటే, తత్‌క్షణం దానిని అతి శ్రద్ధగ పరిశోధించాలి. అయితే - వచ్చిన సూచన నమూనాకు మాత్రమే సంబంధించినదైతే అది కేవలం వ్యక్తిగతమైన అభిలాషమాత్రమే కాదనే సంగతి ముందుగా రూఢి చేసుకోవాలి. విక్రేత లెప్పుడూ కొతాదార్ల వ్యక్తిగత అభిరుచులకే ప్రాధాన్యమిస్తారు గాని, తమ సరుకును గూర్చి తగినంత జ్ఞానం సంపాదించి, ఆ ప్రత్యేకాభిరుచులు గల కొతాదార్లకు వారి అవసరాలన్నిటికీ తమ సరుకు తీర్చగలదని (అలా తీర్చగలిగినదైనప్పుడే) నచ్చచెప్పే సామర్థ్యం గడించాలని చూడరు.

1909 లో ఒక రోజు ఉదయం - ముందు ఎట్టి హెచ్చరికా లేకుండా - భవిష్యత్తులో మేము ఒకే నమూనా కారు నిర్మించనున్నామనీ, అది 'మోడల్ - టి' కారే అనీ, అన్ని కార్లకూ చట్రం సరిగ్గా ఒకే విధంగా ఉంటుందనీ ప్రకటన చేశాను. ఇలా కూడా అన్నాను :

"మా కారు రంగు నలుపు కనుక, ఏ కొతాదారైనా తాను కోరిన రంగు వేయించుకోవచ్చును."

నాతో మా కంపెనీలో కొందరైనా ఏకీభవించారని నేను చెప్పలేను. ఒకేనమూనా కారువల్ల నిర్మాణంలో ఉన్న

సదుపాయాలు విక్రేతలు నిజానికి అర్థం చేసుకోలేరు. అర్థం చేసుకోవాలనే శ్రద్ధా వారికి లేదు. ఆ నాటికి మా నిర్మాణం యథాతథంగా బాగానే ఉందనీ, అయితే కార్ల ధర తగ్గించడంవల్ల అమ్మకం పడిపోతుందనీ, సరుకు నాశెం చూసే కాతాదార్లు నా నిర్ణయంవల్ల పరాఙ్ముఖులై, వారి స్థానంలో క్రొత్త కాతాదార్లు ఏర్పడరనీ సునిశ్చితమైన వారి అభిప్రాయం. మోటారు కార్ల పరిశ్రమను గూర్చిన విస్పష్టమైన భావన మృగ్యంగా ఉంది. అప్పటికీ ఇంకా మోటారు కారును ఒక విలాసవస్తువుగానే భావిస్తున్నారు. ఈభావాన్ని వ్యాపింప చెయ్యడంలో ఉత్పాదకులు చాలా కృషి చేశారు. కొందరు తెలివైనవాళ్లు ''వినోదపు కారు''(Pleasure car) అనే ఒక మాటను సృష్టించారు. ప్రకటనలో విలాస లక్షణాలకు ప్రాధాన్యం ఇవ్వబడింది. అందుచేత, విక్రేతలు ముఖ్యంగా – నే సే దిగువ రీతిగా ప్రకటన చేసినప్పుడు – నా విధానానికి ఆక్షేపణలు చెప్పడానికి తగినంత ఆధారం లేక పోలేదు.

''నేను అధిక సంఖ్యాక ప్రజానీకం కోసం మోటారు కారు నిర్మిస్తాను. అది కుటుంబానికంతా సరిపోయేటంత పెద్దది అయినా, ఒకే వ్యక్తి నడపడానికీ, శ్రద్ధ తీసుకోడానికీ, వీలైనంత చిన్నదిగానే ఉంటుంది. ఆధునిక యాంత్రిక విజ్ఞానం ఊహించ గలిగినంత సరళమైన నమూనాలో, అత్యుత్తమమైన లోహంతో అతి నిపుణులైన కార్మికులు దానిని నిర్మిస్తారు. మంచి జీతం తెచ్చుకుంటున్న

ప్రతి వ్యక్తీ ఒక కారు కొనుక్కొని, భగవత్ సృష్టిలోని విశాల బహిరంగ ప్రదేశాలలో తన విశ్రాంతికాలం తన కుటుంబమంతటితో సహా వినోదంగా గడపడానికి వీలైనంత తక్కువ ధరకి అది లభిస్తుంది.'' ఈ ప్రకటన చూచి ఆనందించినవారు కూడా కొందరు లేకపోలేదు. కాని, సాధారణంగా వినవచ్చిన విమర్శ : "ఫోర్డ్ ఆ పని నిజంగా చేసేటట్లైతే ఆరు నెలలు తిరుగక ముందే వాణిజ్య రంగానికి దూరమైపోతాడు'' అనే.

మంచి కారుని తక్కువ వెలకి నిర్మించడం అసంభవమనీ, అంతేకాక – ధనికులే కార్లు కొంటారు కనుక తక్కువ ధర గల కారును నిర్మించడంవల్ల ప్రయోజనం ఏమీలేదనీ వారి భావన. 1908 – 1909 సం॥రంలో పదివేల పైచిలుకు కార్లు అమ్ముడు పోవడంతో మేము క్రొత్త ఫ్యాక్టరీ కట్టుకోవడం అవసరమని నాకు తోచింది. అప్పటికి పికెట్ వీధిలో ఉన్న ఫ్యాక్టరీయే చాలా పెద్దది. నవీన సాధన సంపత్తి కలది. బహుశః దేశంలో అంత పెద్ద ఫ్యాక్టరీ మరొకటిలేదు. అయినప్పటికీ, తప్పని సరిగా పెరుగనున్న ఉత్పత్తికీ, అమ్మకానికీ అది సరిపోదని నాకనిపించింది. అందుచేత–హైలెండ్ పార్క్‌వద్ద 50 ఎకరాల స్థలం కొన్నాను. ఆ రోజులలో ఆ స్థలం డిట్రాయిట్ నగరానికి దూరంగాఉన్న పల్లెప్రాంతంగా పరిగణించబడేది. అంత ఎక్కువ స్థలం కొనే విషయం లోను, ప్రపంచంలో కని విని ఎరగనంత పెద్ద ఫ్యాక్టరీకోసం తయారుచేసిన అంచనాల విషయంలోను తీవ్ర ప్రతిఘటన

వచ్చింది. అప్పటికే అందరూ ప్రశ్నించ సాగారు: "ఇక ఎంత కాలంలో ఫోర్డ్ దివాలా తీయనున్నాడు?" అని.

ఆ తర్వాత అదే ప్రశ్న ఎన్నివేలసార్లు పునశ్చరణ చేయబడిందో చెప్పలేను. ఒక వ్యక్తి కాక, ఒక సిద్ధాంతం ఆధారంగా ఆ కార్యక్రమం నడుస్తున్నదని గుర్తించలేక పోవడంవల్ల ఆ ప్రశ్న అసలు పుట్టింది. ఆ సిద్ధాంతం ఎంత దురవగాహంగా కనిపిస్తుందో, నిజానికంత సరళమైనది.

1909 – 1910 సంవత్సరంలో నూతన స్థలానికీ, కట్టడాలకూ ఖర్చుపెట్టవలసి ఉన్నందువల్ల నేను కొద్దిగా మా కార్ల ధరలు పెంచాను. అది పూర్తిగా న్యాయసమ్మతమైనదే! క్రేతకు అది లాభదాయకమేగాని నష్టంతో కూడినదికాదు. కొన్ని సంవత్సరాలక్రితం సరిగ్గా అటువంటి పనేచేశాను. రోజ్‌నది ఫ్యాక్టరీ కట్టే నిమిత్తం ఆసంవత్సరం నేను ఏటేట తగ్గిస్తూన్నట్టుగా ధర తగ్గించడం మానేశాను. నిజానికి అప్పుడూ, ఇప్పుడూ కూడా అదనపు ఖర్చు భరించడానికి మేము అప్పు చేయవచ్చు. కాని, అలాచేస్తే ఆ అప్పు తీరే వరకూ వడ్డీ బరువు వ్యాపారం మీదపడి, ఆ తర్వాత మేము నిర్మించే కార్లన్నీ ఆ భారాన్ని భరించవలసి వస్తుంది. అన్ని నమూనాల ధరలూ వందేసి డాలర్ల చొప్పున పెంచాను. 'రోడ్‌స్టర్' కారు ధరమాత్రం 75 డాలర్లే పెంచాను. లాండోలెట్, నగరోచితమైనకారు – ఈ రెంటి ధరలూ వరుసగా 150, 200 డాలర్లు పెంచాను. మేము 18,644 కార్లు ఆ ఏడు అమ్మాము. అటుతర్వాత 1910 – 1911

సం॥రంలో నూతన సౌకర్యాలవల్ల నేను టూరింగ్ కారుధర 950 డాలర్లనుంచి 780 డాలర్లకి తగ్గించాను. ఆ ఏడాది 34,528 కార్లు అమ్ముడు పోయినవి. నిర్మాణ పదార్థాల ధరలు సదా పెరుగుతూనే వచ్చినా, కూలీ 'రేటు' కూడా ఎక్కువ అవుతూనే వచ్చినా, క్రమంగా కార్ల ధరలు తగ్గించడానికి ఆ యేడే అంకురార్పణ చేశాను.

ఇప్పుడు 1908 - 1911 సం॥ల మధ్య వచ్చిన మార్పును గమనిద్దాం. ఫ్యాక్టరీ స్థలం 2.65 ఎకరాలనుంచి 32 ఎకరాలకు పెరిగింది. సగటు పనివారి సంఖ్య 1,908 నుంచి 4,110 కి పెరిగింది. నిర్మితములైన కార్ల సంఖ్య ఆరు వేల పైచిలుకు నుంచి 35 వేలకు పెరిగింది. దీనిని బట్టి ఉత్పత్తి నిష్పత్తిలో పని వారిసంఖ్య పెరగలేదని స్పష్టమవుతున్నది.

మేము హఠాత్తుగా (అది అంతా ఒక్క రాత్రిలో జరిగిపోయిందా అనిపిస్తుంది) అంత ఉత్పత్తిని సాధించాం. ఇదంతా ఎలా సాధ్యమైంది?

కేవలం ఒక ఖచ్చితమైన సిద్ధాంతాన్ని అమలు జరపడం వల్లా, తెలివిగా నడపబడిన శక్తివల్లా, యంత్రసంపద వల్లా ఇది సాధ్యమైంది. ఒక మారుమూల వీధిలో చిన్న చీకటి గుయ్యారం లాంటి ఒక వడ్రంగి దుకాణంలో కూచుని ఒక ముసలివాడు ఏళ్ళతరబడి గొడ్డలి పిడికర్రలు తయారు చేసేవాడు. చేవగల 'హికరీ' కొయ్యతీసికొని ఉలి, బాడిసె మొదలైన పరికరాలతో అతడు వాటిని తయారుచేసి,

మెరుగు కాగితంతో మెరుగుపెట్టేవాడు. జాగ్రత్తగా ఒక్కొక్క పిడికర్రే తూచి ఊతం సరిపోయేటట్లు చూసేవాడు. కాని, ఏ రెండు పిడికర్రలూ సరిగ్గా ఒకేరకంగా ఉండేవి కావు. చేతిలో పట్టుకునేచోట వంపు సరిగా చేతిలో ఇమిడేటట్టుగా చూడాలి. ఆ కొయ్య జాతిని దృష్టిలో ఉంచుకుని ఆ వంపు తయారు చెయ్యాలి. వేకువ నుంచి అర్ధరాత్రి దాకా ఆ ముసలివాడు పాటుపడుతూనే ఉండేవాడు. కాని, అతని సగటు ఉత్పత్తి వారానికి ఎనిమిది పిడి కర్రలు మాత్రమే! ఒక్కొక్కటి ఒకటిన్నర డాలరుకి అమ్మేవాడు. తరచువాటిలో కొన్ని ఊతం సరిగా ఉండక అమ్ముడు పోయేవి కావు.

ఈ నాడు మనకు అంతకంటె మంచి గొడ్డలి పిడికర్ర – యంత్రం మీద తయారైనది – కొన్ని సెంట్లకే బజారులో దొరుకుతుంది. ఊతం సరిగ్గా ఉంటుందో, ఉండదో అనే గుంజాటన అక్కర లేదు. అన్నీ ఒకేరకంగా ఉంటాయి. ప్రతిదీ నిర్దుష్టంగా ఉంటుంది. పెద్ద ఎత్తున నవీన విధానాలను అమలు జరపడం వల్ల గొడ్డలి పిడి కర్రల ధర వెనుకటి ధరలో ఎన్నోవంతుకో తగ్గిపోవటమే కాక, ఉత్పత్తి అయిన సరుకు నాణ్యం కూడా ఎంతో ఎక్కువయింది.

ఫోర్డ్ కార్ల నిర్మాణంలో నిర్దుష్టమైన కొన్నిసూత్రాలను వర్తింపజేయడం వల్లనే ఆరంభం నుంచీ కూడా ధర తగ్గించడానికీ, నాణ్యం పెంచడానికీ వీలయింది. ఒకానొక భావానికి మేము రూపు రేఖలు తీర్చాము. ఒక వ్యాపారానికి కేంద్రం కేవలం ఒక భావమే కూడా అయి ఉండవచ్చు.

అనగా – ఒక నూతన యంత్ర నిర్మాత, లేక భావుకుడైన ఒక కార్మికుడు ఒకస్థిరమైన మానవావశ్యకతను తీర్చడానికి వెనుకటి కంటె ఉత్తమమైన ఒక నూతనవిధానాన్ని కనిపెడ తాడు. ఆ భావం స్వయం ప్రకాశకం అవడంవల్ల ప్రజలు దానివల్ల లాభం పొందాలని చూస్తారు. ఈ విధంగా ఒక వ్యక్తి తన ఒక భావంవల్ల, లేక ఆవిష్కరణవల్ల ఒక వ్యాపారానికి కేంద్రంగా కావచ్చు. అయితే – వ్యాపారానికి రూపురేఖలు దిద్దడంలో దానికి సంబంధించిన ప్రతివ్యక్తికీ భాగం ఉంటుంది. తన వ్యాపారసంస్థ నిర్మాణంలో వేల కొద్దిమంది సహాయం పొందిన ఏ ఉత్పాదకుడూ – ''నేనే ఈ వ్యాపార సంస్థని నిర్మించాను'' – అని చెప్పలేడు. అది ఒక సామూహిక కృషి ఫలితం. దానిలో పనిచేసే ప్రతి వ్యక్తీ దాని నిర్మాణానికెంతో కొంత తోడు పడినవాడే! కష్టపడి పనిచేసి, సరుకును ఉత్పత్తిచేస్తూ క్రేతలంతా ఆ విధమైన సరుకుకోసం ఆ సంస్థచుట్టూ మూగేటట్టుచేసి, తద్వారా, వాణిజ్యాన్ని పెంపొందించి, వారు తమ జీవనోపాధి గడుపుకొంటారు. మా కంపెనీ ఆ విధంగా దినదినాభివృద్ధి పొందింది.

# సర్ విలియం ఫిప్స్

## 1651-1695

విలియం ఫిప్స్ మేన్ రాష్ట్రంలో జన్మించాడు. పద్ధెనిమి దేళ్ల వయస్సులో ఓడలపై వడ్రంగి పనికి తరిఫీదు పొందాడు. పిమ్మట బాస్టన్‌లో ఆ వృత్తిలోనే పనిచేస్తూ చదవడం, వ్రాయడం స్వయంగా నేర్చుకున్నాడు. సముద్ర గర్భంలో దాగి ఉన్నదనుకొంటూండిన స్పానిష్ బంగారం కోసం ఇతడు జరిపిన అన్వేషణను గురించి ఈ దిగువ వ్యాసంలో అభివర్ణింప పడినది. కెనడాలో 1690 లో ఫ్రెంచి వారిపై జరిపిన దాడికి ఈయన నాయకత్వం వహించి నడిపి, రాయల్ అనే రేవును పట్టుకొన్నాడు. కాని; అనంతరం ఇతడు క్విబెక్, మాంట్రియల్ ప్రాంతాలపై జరిపిన దాడులు దారుణ దురంతాలుగా పరిణమించినవి. రెండేళ్ల తరువాత 'ఇంక్రీజ్ మాథర్' సూచనపై, సర్

విలియమ్ క్రొత్త ఛార్టర్ ప్రకారం మసాచూసెట్స్ రాష్ట్రానికి బ్రిటిష్ గవర్నరుగా నియమింప బడ్డాడు. ఇతడు మర్యాదస్తుడు, కష్టజీవి అయినప్పటికీ, ఆ ఉద్యోగానికి తగినవాడుకాడు. ఈయన తన బాధ్యతలను సక్రమంగా నిర్వహించలేదనే ఆరోపణకు సంజాయిషీ చెప్పుకోనడానికిగాను ఇంగ్లండుపోయి, అక్కడే మరణించాడు.

మాథర్ కుటుంబం మొదటి నుండి ఇతనికి అండగా ఉంటేది. కనుక, కాటన్ మాథర్ వ్రాసిన ఇతని జీవితచరిత్ర ప్రశంసనీయంగా ఉండడంలో ఆశ్చర్యంలేదు. గవర్నరు ఫిప్స్ మరణించిన తరువాత రెండేళ్లకు చిన్న కరపత్రంగా ప్రకటింపబడిన ఈ జీవిత చరిత్ర, అనంతరం 1702 లో మాథర్ ప్రకటించిన సుప్రసిద్ధ గ్రంథం "మాగ్నాలియా క్రిస్టీ అమెరికన్" (Magnalia Christi American) లో చేర్చబడింది.]

# కెప్టెన్ ఫిప్స్: స్పానిష్ బంగారం

చక్రవర్తి నౌకలలో ఒకదానికి కెప్టెన్ కావాలనే అప్పటికీ తన వాంఛ అనీ, అప్పటికన్న ఇంకా మంచి నావికులపై తనకు పెత్తనం ఉండాలని కోరుతున్నాననీ, నార్త్ బాస్టన్‌లోని గ్రీన్ లేన్ ప్రాంతంలో తమ కొక ఇటిక ఇల్లు ఉంటే బాగుండుననీ, దయాళువైన భగవంతుడు తనకు ఇవే కాక ఇంకా చాలా మేళ్లు చేయవచ్చుననీ – విలియం ఫిప్స్ తన భార్యతో తరచు చెప్పుతూండే వాడు. ఈ మాటలను ఆమె కొంత సంశయంతోనే వింటూ ఉండేది. కాని, అతడు ఇవన్నీకూడా తప్పకుండా జరుగుతాయన్నట్లు

వాటికోసం తీవ్రంగా నిరీక్షిస్తుండడం వల్ల వాటిలో అతని ప్రధానమైన వాంఛ యేమిటో తెలుసుకోనడం సుసాధ్యం కాదు. అతడు – సాహసోపేతుడైన ప్రతిభావంతుడు. అందు వలన సహజంగా అల్పత్వం అంటే అసహ్యించుకొనేవాడు ... సాహసంగా ఒక ప్రణాళిక వేసుకొని, సహనంతో దానిని కొనసాగించేవాడు. అతని బుద్ధి నిశితత్వం మంగలిక త్తి పదునును బోలినది కాదు. ఒంటి చేతి గొడ్డలిని బోలినది. మహత్కర విషయాలనే సదా ఎన్నుకునేవాడు. మధ్యలో ఎన్ని ప్రమాదాలు వచ్చినా తన నిశ్చయాల పదునును మొక్కవో నీయకుండా కడకంటా నడుకొని పోయేవాడు.

ఈ విధంగా సాహసోపేతమైన ఘనకార్యాలు చేయ డానికి అవసరమైన సర్వ లక్షణాలు ప్రోదిచేసుకొని అందుకు ఉచితమైన నావిక వృత్తిని అవలంబించాడు; భగ్నమైన నౌకలో నుండి బ్రతికి బయట పడిన ఒక నావికుని వలన బహామా దీవులను గురించి విని, అచటికి నౌకాయాత్ర వెళ్లాడు. కాని, ఈ యాత్రలో అతనికి లాభించినదల్లా, అతడు ఇంగ్లండ్ దేశానికి వెళ్లడానికి కావలసిన సంభారం మాత్రమే! ... అయితే, అక్కడే మరొక స్పానిష్ నౌకా భంగాన్ని గురించీ, ఆ సందర్భంలో సముద్ర గర్భంలో మునిగిపోయి మరల ఉద్ధరింపబడని అపార సంపదనుగురించీ కొంత భోగట్టా అతడు సంపాదించాడు. ఆ ధనాన్ని అన్వే షించి ఉద్ధరించాలనే తీవ్ర వాంఛ అతనికి కలిగింది. ఆ విషయం బ్రిటిష్ ప్రభుత్వాధినేతలకు విజ్ఞప్తులు చేసుకొని,

చివరికి 1683 లో రాజనౌకలలో ఒకదానికి కెప్టెన్ అయాడు. కడకు అల్జీర్ రోజ్ అనే పద్ధెనిమిది శతఘ్నులు, తొంభై ఐదుగురు నావికులు గల ఒక నౌక కధిపతిగా అయి హ్యూ ఇంగ్లండు వచ్చాడు.

... ఇతడు 'అల్జీర్ రోజ్'కి కెప్టెన్‌గా ఉన్న సమయంలో ఆ నౌకలోనివారు, ఎన్నటికీ ఫలించని తమ ఐశ్వర్యాన్వేషణతో విసిగిపోయి, తమ కెప్టెన్‌పై తిరుగుబాటు చేశారు. అంతా ఒక్కసారిగా కత్తులుదూసి వచ్చి, క్వార్టర్ డెక్ మీద ఉన్న కెప్టెన్ని చుట్టిముట్టి, తమతో పాటుగా ఈ ఓడను తీసుకొని దక్షిణ సముద్రాలలో ఓడ దొంగల వ్యాపారం చేయడానికి రావలసినదిగా అతణ్ణి ఒత్తిడిచేశారు. ఆ సమయంలో కెప్టెన్ ఫిప్స్ చేతుల్లో కనీసం కర్రముక్కకూడా లేకపోయినా సాహసంతో మహా వీరులగు శామ్సన్, హాంగర్లవలె నిర్భయంగా వారిపైకి దూకాడు. కేవలం అతని పిడికిలి పోట్లతోనే చాలామంది నేలకూలారు; మిగిలినవారు తోక ముడిచారు...

ఒకరోజున ఈ నౌక నిర్మనుష్యమైన ఒక స్పానిష్ దీవివద్ద మరమ్మత్తులకోసం ఒక గుట్టప్రక్కన కట్టివేయబడింది. ఆ నౌకలో ఉన్న నూరుమందిలో ఏడెనిమిదిమంది తప్ప మిగిలిన వారందరూ వినోదార్థమంటూ ఆ దీవిలోని అడవిలోకి బయలుదేరిపోయారు. అక్కడ వారంతా ఒక ఒడంబడిక వ్రాసుకొని, వరుసగా దానిపైన సంతకాలు చేసుకున్నారు. ఈ ఒడంబడిక ప్రకారం ఆనాడు ఏడు గంటలకు

వారంతాకలిసి కెప్టెన్‌ని, అతనికి విశ్వాసపాత్రులైన పది మందినీ బంధించి, ఆ నిర్జన దీవిలోనే వదిలివేసి, తామూ నౌకతో దక్షిణ సముద్రాల పైకిపోయి సముద్రపు దొంగల వ్యాపారం సాగించుకోవాలని నిశ్చయించు కున్నారు. ఈ కుట్ర తీరా మరొక గంట, గంటన్నరలో అమలు జరుగు తుందనగా దానిని గురించిన భోగట్టా కెప్టెన్ ఫిప్స్‌కి తెలియ వచ్చింది. కాని ఆ స్వల్ప వ్యవధిలోనే, అతను ఆ కుట్రదారులంతా లొంగివచ్చి తన కాళ్ల మీద పడి ప్రాణభిక్ష పెట్టుమని వేడుకొనేటట్టు చేయడం సాధ్యమా? సాధ్యమని అతను రుజువు చేశాడు. ఈ కుట్రదారులు తమకు ఒక వడ్రంగి అవసరమున్నదని గుర్తించి, ఆ సమ యానికి నౌకకు మరమ్మత్తు చేస్తూన్న ఆ వడ్రంగికోసం కబురు పంపారు. ఆ కబురు తెచ్చినవాడు సంతకాలు చేసుకున్న ఒడంబడికలోని షరతులన్నీ అతనికి చూపించి, వారితో చేరకపోతే అతని పని ఏమి జరిగేదీ కూడా వివరించాడు. ఆ వడ్రంగి సద్బుద్ధి గలవాడు అవడం వలన ఆ విషయాన్ని శ్రద్ధగా యోచించుకొనడానికి కష్టంమీద ఒక అర గంట వ్యవధి సంపాదించి, నౌకమీద పనిచేయడానికి వెళ్లాడు. కుట్ర దారుల గూఢచారి ఒకడు అతనిని వెన్నంటి వెళ్లాడు. అక్కడ పని చేస్తూ చేస్తూ, అకస్మాత్తుగా అతను కడుపులో పెద్ద నొప్పి వచ్చినట్టు నటించి, మందుకోసం కెప్టెన్ గదిలోకి పరుగెత్తాడు. తన అవస్థ యావత్తూ మూడు ముక్కలలో కెప్టెన్‌కి చెప్పాడు. కెప్టెన్ కూడా చాలా సంగ్రహంగా,

"నువ్వు అడవిలోకి వెళ్లి వాళ్ళ ఒడంబడికమీాద సంతకం చెయ్యి; తరువాత సంగతి నేను చూచుకుంటాను," అని అతణ్ణి పంపివేశాడు. వడ్రంగి వెళ్లిపోయాడు. కెప్టెన్ ఫిప్స్ తన మిగిలిన మిత్రులను (పడుగురో, ఎనమండుగురో) పిలిచి, ఏ పరిస్థితులలోనైనా వారు తనకు అండవై నిలిచేదీ లేనిదీ చెప్పవలసినదిగా కోరి, అప్పటి ప్రమాదకర స్థితిని వారికి తెలియజెప్పాడు, వారంతా, "నిన్నే మేము నమ్ముకొన్నాము, ఎలాగైనా ఈ ప్రమాదాన్నుంచి బయట పడే మార్గం ఆలోచించు" అని అతణ్ణి ప్రార్థించారు. "భగవంతుని కృప ఉంటే ఈ ప్రమాదాన్ని నేను అతి సులభంగా అధిగమించగలను" అన్నాడు ఫిప్స్.

కెప్టెన్ ఆజ్ఞ ప్రకారం, ఆ నౌకలో ఉన్న ఆహార పదార్థా లన్నిటినీ వారు ఒడ్డున వేసిన ఒక గుడారంలోకి చేరవేశారు. వాటి రక్షణార్థం నౌకలో ఉన్న తుపాకులు, శతఘ్నులు అన్నిటినీ ఆ గుడారం చుట్టూ బారుచేసి పెట్టారు. అప్పటికి, తిరుగుబాటు దారుల ముఠా అడవి లోనుంచి తిరిగి వస్తూంది. తీరా వారు గుడారం వద్దకువచ్చి ఈ దృశ్యమంతా చూచి, "మనం మోసపోయాం!" అని నిస్పృహతో అరిచారు. వెనువెంటనే, కెప్టెన్ ఫిప్స్ "దూరంగా నిలబడండి! స్వామి ద్రోహులారా!! మీా ప్రాణాలు మీాకు దక్కవు," అంటూ వేసిన కేక కూడా వినిపించేసరికి, వారికి పైప్రాణాలు పైన లేచిపోయినవి. వారు మరొక అడుగు ముందుకు వేస్తే, తుపాకులు పేల్చ

వలసిందిగా కెప్టెన్ తన అనుచరులను ఆదేశించడంతో, కుట్రదారులలో ఆందోళన ఎక్కువయింది.

వారు ఆయనను ఆ నిర్మనుష్యమైన అరణ్యంలో వదిలివేసి, ఓడతో పారి పోవడానికి కుట్రచేశారు. ఇప్పుడు ఆ శిక్షే వారికి తాను విధించ నున్నట్టు కెప్టెన్ ఫిప్స్ సూచించాడు. పిమ్మట మళ్ళీ వంతెన తెప్పవేయించి, రేవు మీద గుడారంలోని ఆహార పదార్థాలన్నిటినీ తిరిగి ఓడ లోకి చేర్చవలసినదిగా తన అనుచరులను ఆదేశించాడు. దారుణ ప్రవాసశిక్ష అనుభవించవలసి వస్తుందని తెలియ గానే, కుట్రదారుల ముఠాలోని వాళ్ళందరూ కెప్టెన్ కాళ్ళా వేళ్ళాబడి క్షమాభిక్ష వేడుకొనడం ప్రారంభించారు. తమకు కెప్టెన్ మీద ఏ విధమైన ద్వేషమూ లేదనీ, చక్రవర్తి ఓడతో దక్షిణ సముద్రాలపై ఓడ దొంగల వ్యాపారం సాగించుకొనడానికి పారిపోదామంటే, తాను ఒప్పుకొనక పోవడ మొక్కటే తమకుకష్టం కలిగించినదనీ, తక్కినవిషయా లన్నిటిలో చావు బ్రతుకులలో సర్వదా కెప్టెన్‌కి విశ్వాస పాత్రులై ఉండడమే తమ సంకల్పమనీ వా రాయనకు విన్నవించు కొన్నారు. దక్షిణ సముద్రాలకు పారిపోవడం కెప్టెనుకు సుతరామూ ఇష్టం లేదని తేలిపోయినందువలన తమ వాంఛను వదలుకొని, కెప్టెన్ ఆజ్ఞానుసారం ప్రవ ర్తించడానికి సిద్ధంగా ఉన్నామని కూడా వారు ప్రమా ణాలు చేశారు. వారంతా తమ వద్దనున్న ఆయుధా లన్నిటినీ కెప్టెన్‌కు సమర్పించి, దీర్ఘకాలం తన పాదాల

ప్రోల మోకరిల్లి ప్రార్థించేటట్టు చేసిన పిమ్మట, ఫిప్స్ వారిని తిరిగి నౌకపైన ఎక్క నిచ్చాడు. కాని, వారందరినీ జమైకా వరకు తీసుకొనిపోయి అక్కడ వదిలివేశాడు.

జమైకాలో మరికొందరు నావికులను సమకూర్చుకొని అచటినుండి హిస్పానియోలాకు వెళ్లాడు. అక్కడ ఒక వృద్ధ స్పానియార్డ్ (లేక పోర్చుగీసువాడో) నావికుని వద్దనుండి అన్వేషణకు ఉపయోగపడగల కొంత భోగట్టా లభించగా, తిరిగి కొంత ఆశ కలిగింది. పోర్ట్-డ-లా-ప్లాటా (నౌకాశ్రయాని)కి కొన్నిమైళ్ళ దూరంలో సముద్రంలో ఉన్న గుట్టలవద్ద ఆ ధనపునౌక మునిగిపోయినదని ఆ వృద్ధ నావికుడు చెప్పాడు...... ఆ ప్రకారం, కెప్టెన్ పిప్స్ ఆ ప్రాంత మంతా గాలించాడు. కాని, ఆ వృద్ధ నావికుడు సూచించిన ప్రదేశంలో ఎంత వెదకినా అతనికా భగ్ననౌక మాత్రం కనిపించలేదు. అతడు "రోజ్" నౌకలో తిరుగుతున్నంత వరకు, ఇలాంటి ఆశాభంగాలు అతనికి చాలా కలిగినవి. అయితే, వాటివలన సముద్ర గర్భ నిక్షిప్తమైయున్న ఆ ఐశ్వర్యాన్ని అన్వేషించి తీరాలన్న అతని సంకల్పదార్ఢ్యం మాత్రం చెక్కుచెదరలేదు. ఆ నిశ్చయంతోనే ఇంగ్లండుకు తిరిగివెళ్లి, మళ్లీ క్రొత్తగా లోగడకన్న కట్టుదిట్టంగా అన్వేషణ ప్రారంభించడానికి తగిన సన్నాహాలు చేశాడు. అప్పుడే ఓపికతో మరికొంచెం ముందుకు వెళ్లిఉంటే, ఆ ధనం దొరికేదేమో అనే ఆశ అతనికి ఉన్నప్పటికీ, అతని సహచర నావికులు కేవలం అలసులు, అవిశ్వాసనీయులు

అవడంవల్ల అతడు వెనుదిరిగి పోవలసివచ్చింది.

కెప్టెన్ ఫిప్స్ ప్రవర్తన ఘనమైనదిగా, గౌరవమైనదిగా ఉన్నందువల్ల, ఆ రాజ్యంలోని ప్రముఖ సామంతులు (Noble men) కూడా అతనితో ఎంతో మర్యాదగా ప్రవర్తించేవారు. అయినప్పటికీ, అతనికి ప్రబల శత్రువులుకూడా చాలామంది ఉండేవారు. ఆల్బెమార్లీ ప్రభువు మొదలైన కొందరు మోతుబరుల ప్రోత్సాహాన్ని సంపాదించుకొని, సుమారు అర్థశతాబ్దికి పూర్వం "పెద్ద ఎర" వేయబడిన ఆ "బంగారు చేపల వేట"కు కెప్టెన్ ఫిప్స్ మళ్లీ బయలుదేరాడు. అనేక కార్యాలలో, వ్యాపారాలలో తన సామర్థ్యాన్ని స్వయంగా పరీక్షించుకొన్నవాడు అవడం వలన ఈ అపురూపమైన చేపల వేటను చాకచక్యంతో కొనసాగించడానికి అవసరమైన ఉపకరణాలన్నింటినే కాదు, తాను క్రొత్తగా కనిపెట్టిన మరికొన్ని పరికరాలను కూడా తయారు చేసుకొని తీసుకొని వెళ్ళాడు.

ఈ విధంగా కెప్టెన్ ఫిప్స్ ఒక ఓడతోను, ఒక చిన్న పడవతోను పోర్ట్-డ-లా-ప్లాటా వద్దకు చేరుకుని, అక్కడ ఒక పెద్ద కర్ర దోనెను కూడా తయారు చేసుకున్నాడు. బ్రహ్మాండమైన ఒక "కాటన్ వుడ్" చెట్టును నరికి, దాని మ్రానితో తయారు చేయబడిన ఈ దోనె, సుమారు పది తెడ్లతో నడుపవలసినంత పెద్దది. దానిని తయారు చెయ్యడానికి, తక్కిన అన్ని పనులలో వలెనే తన శక్తి యుక్తులన్నింటినీ వినియోగించి, స్వహస్తాలతో చేబాడితపట్టి, ఎడ

తెగకుండా అనేక రాత్రులు అడవిలోనే ఉండి పనిచేశాడు. ఈ దోనె, చిన్న పడవతోపాటు, ఒక సురక్షిత స్థలంలో లంగరు వేయబడి ఉంటూ, చుట్టుప్రక్కల తిరిగి వస్తూ ఉండేది. అయినా, సముద్రంలో వరుసగా ఉన్న కొన్ని గుట్టలను మాత్రమే ఈ దోనెలో వెళ్ళి వచ్చినవారు చూడగలిగారు. ఈ గుట్టలకు "బాయిలర్స్" అని పేరు. వీటిమీద ఒక్కొక్కచోట సముద్రం రెండు మూడడుగుల లోతు మాత్రమే ఉంది. అయితే, ఏదైనా పడవ వచ్చి ఇలాంటి ఒక గుట్టకు కొట్టుకొని పగిలిపోతే మాత్రం, వెంటనే దాని ప్రక్కనే అగాధంగాఉన్న సముద్రగర్భంలోకి దొరలిపోతుంది. ఈ "బాయిలర్స్" ప్రాంతంలో ఎంతకాలం వెదికినా, వీరి పరిశ్రమకు పరిహార మేమీ కనిపించలేదు. ఎప్పుడు వెళ్ళి వెదకి వచ్చినా పరిపూర్ణ ఆశాభంగమే వారికి ఎదు రయేది. ఆ దుర్వార్తే వారు తమకెప్టెన్‌కు అందజేసేవారు.

ఒక రోజున వీరంతా నిరాశతో వెనుదిరిగి వస్తూం డగా, వారిలో ఒకడు దోనె గోడమీదనుండి వంగి నీటి లోపల ఏదో చూశాడు. అది నీటిలోపల ఒకగుట్టమీద పెరుగుతూన్నట్టు కనిపించిన "సీ ఫెదర్" అనే ఒక రక మైన జంతువు. వెంటనే, వారిలోని ఒక ఎర్ర ఇండియను నీటిలో మునిగి ఆ "ఫెదర్"ని తీసుకు వచ్చాడు...ఈ ఎర్ర ఇండియన్ ఆ "ఫెదర్"తో పాటుగా మరొక విచిత్ర మైన సమాచారాన్నికూడా తీసుకువచ్చాడు. తనకు ఈ "ఫెదర్" దొరికినచోట నీటిలో చాలా శతఘ్నులు కను

పించాయని అతడు చెప్పాడు. ఈ వార్త అతని సహచరు లందరినీ ఆశ్చర్య చకితులనుచేసి, ఎడతెగని విఫలయత్నాల వల్ల కలిగిన నిరాశా నిస్పృహాలను పోద్రోలి, తిరిగి నూతన నాశాంకురాలను మొలకెత్త చేసింది. తాము అంతవరకూ అన్వేషిస్తూన్న ప్రదేశాన్ని చివరికి కనుగొన్నామన్నంత ఆనందం వారికి కలిగింది. ఆ ఎర్ర ఇండియనును మళ్లీ ఒక సారి మునిగి చూచి రమ్మని పంపారు. ఈ తడవ అతడొక పెద్ద వెండి పలకను తీసుకువచ్చాడు. అది సుమారు రెండు మూడు వందల పౌనుల ఖరీదు ఉండవచ్చు. దానితో వారి ఆశలు మరింత బలపడినవి. ఆ పైన, వారా ప్రదే శాన్ని మళ్లీ సులభంగా కనుగొనటానికి వీలుగా జాగ్రత్తగా గుర్తులు పెట్టుకొని పోయారు.

వారు తమ కెప్టెన్ దగ్గరకు వెళ్లారు. నిరాశా జనక మైన దుర్వార్తలనే వీరు కెప్టెన్‌కు అందజేయడం, ఆ వార్త కెప్టెన్‌నికూడా నిరుత్సాహ పరచడం చిరకాలంగా వారికి దిన చర్య అయిపోయింది. వీరు ఈసారి, తాము తీసుకువెళ్ళిన వెండి పలకను కెప్టెన్ ముందున్న బల్లక్రింద ఒక ప్రక్కగా పెట్టి ఆ బల్లచుట్టూ కూర్చున్నారు. ఏమైనా సరే, భగ వత్కటాక్షం కలిగి, తమ ప్రయత్నం ఫలించేవరకు వేచి ఉండవలసినదే గాని వెనుదిరిగి పోయేది లేదని కెప్టెన్ తన దృఢ నిశ్చయాన్ని గట్టిగా పునశ్చరణ చేస్తూ ఉంటే, వీరంతా ఆయన మాటలను ఆనందంగా వింటున్నారు. క్రమంగా, బల్లక్రింద ఉన్న వెండి పలకను ఆయనే చూచి, తమను

ప్రశ్నించాలని వారు ఎదురు చూస్తున్నారు. చివరకు ఆ విచిత్ర వస్తువు ఆయన కంట బడింది. వెంటనే పెద్ద గొంతుతో "ఏమిటిది? ఎక్కడిది దిది?" అంటూ కేకలు పెట్టాడు. వీరు తమ ముఖవైఖరులను మార్చి, దానిని తాము ఎక్కడ ఎలా కనుగొనినదీ వివరించారు; దానితో "భగవంతుడికి మనపైన దయ కలిగింది. మనం ధన్యులం!" అని అరిచాడు.

ఆ పైన వారంతా అక్కడినించి ఎవరి పనిలోకి వాళ్లు వెళ్లిపోయారు. అదృష్టవశాత్తు, వీరిహస్తం మొట్ట మొదటే, అభగ్న నౌకా శిథిలాలలో ఒక ప్రక్కగా ఉన్న వెండి బంగారాలమీద పడింది. అలాకాక ఓడకి బరువు కోసం వేసే కంకర బస్తాలు మొదలైన వాటితో కలసిపోయి ఉన్న స్పానిష్ నాణాల సంచులు ఉన్నచోటనే వీరిచేయి మొదట పడి ఉంటే ఈ పని ఎంతో చికాకు కలిగించేదీ, కష్టసాధ్యమైనదీ అయి ఉండేది. ఇప్పుడు అలాకాక, ఆ భగ్న నౌకలో వెండి బంగారాల పలకలు దాచిన ధనాగారమే వీరికి మొదట కనిపించడం నిజంగా గొప్ప అదృష్టం. పిమ్మట ఈ "బంగారపు చేపల వేట" ఎంత అద్భుతంగా సాగిందంటే, – అచిరకాలంలోనే వారు ఒక్క ప్రాణినష్టం కూడా లేకుండా ముప్ఫయి రెండు బుషెళ్ల వెండిని ఆ సముద్ర గర్భంలోనుండి బయటకు తీయగలిగారు; – అవును, అప్పటికి వారు బయటికి తీసిన వెండి బుషెళ్లతో కొలువ దగిన పరిమాణంలోకి వచ్చింది.

ఈ విధంగా, సుమారు అర్ధ శతాబ్దం కి పూర్వం సాగ రార్పితమైన అపార ధనరాశి తిరిగి వెలుగు మొగం చూడ గలిగింది. ఈ మధ్యకాలంలో ఆ ధనపు సంచులపై కొన్ని అంగుళాల మందాన సున్నపురాతిపొర ఏర్పడింది. నీటిలో మునిగిన నావికులు ఇనుప పనిముట్లతో ఆ సున్నపు రాతి పొరను పగుల గొట్టిన మీదట తుప్పువట్టినట్లున్న స్పానిష్ నాణాలను తట్టలకొద్దీ పదెనిమిది నిలువుల లోతునుండి పైకి తీశారు. రకరకాల వెండి నాణాల రూపంలోఉన్న ఈ ధనానికి తోడు, బంగారం రూపంలోను, ముత్యాల రూపంలోను, నగల రూపంలోను గల సంపదకూడా అక్కడ వారికి అపారంగా దొరికింది. ఆ స్పానిష్ ఫ్రిగేట్ పడవనిండా నింపడానికి చాలినంత ధనరాశిని వారు పైకి తీసారు. ఇంతలో వారి ఆహార పదార్థాల నిల్వలు నిండుకొంటున్నందువల్ల వారు బల వంతంగా తమ "బంగారు చేపల వేట" కట్టిపెట్టి బయలు దేరటం తప్పనిసరి అయింది. ... అయితే, కట్టపడపటి రోజున కూడా వారు అతివేగంగా ఇంకా వెండి బంగారు కణికెలను పైకి లాగ గలగడం ప్రశంసనీయమైన విషయం. నిజానికి, అప్పటికి ఒక విధంగా ఆ వెండి బంగారు కణికెలు పేర్చి ఉన్న గదిలోగల సంపదను పూర్తిగానే వారు పైకి తీశారన్న విషయం ఆతరువాత తెలిసింది.

కాని, కెప్టెన్ ఫిప్స్‌కి ఇప్పుడొక తీవ్రమైన విచారం పట్టుకుంది. అతడి నౌకరులంతా, మామూలుగా నావి కులకు ఇవ్వబడే నెలవారీ జీతాల ఏర్పాటుతో వచ్చినవారు.

కాని, ఇప్పుడు కెప్టెన్ ఆదేశానుసారం తామంతా సాక్షి బంగారు కణికల రూపంలో ఉన్న కన్ను చెదిరే ఐశ్వర్యంతో తమ ఓడను నింపారు కనుక, అందులో తమకు భాగం ఉండదన్నమాటను వారు సహించలేరు. ఆ ధన మంత్రముతో, మరొక దూర దేశానికి పారిపోయి, తమ దేశపు అధికారులు వచ్చి అరెస్టు చేస్తారనే భయం లేకుండా సుఖంగా బ్రతకాలనే ఆశలు వారిలో అంకురించడ మారంభించినవి. ... కెప్టెన్ ఫిప్స్ వరాలవృష్టికి సాధ్యమైన మంచితనాన్ని, చాతుర్యాన్ని అంతా ఉపయోగించి ఆ నావికులందరినీ తనకు విశ్వాస పాత్రులుగా చేసుకొన్నాడు. వారి జీతాలకుతోడు, పెద్దపెద్ద మొత్తాలు వారికి పంచిపెట్ట బడతాయనీ, మిగిలిన నావికులకు ఆ మొత్తాలు సంతృప్తి కలిగించకపోతే తన భాగాన్నికూడా వారికి పంచిపెట్ట గలనని ఆయన వాగ్దానం చేశాడు...

కెప్టెన్ ఫిప్స్ 1687 లో లండన్ చేరుకున్నాడు. అతడి ఓడలో దాదాపు 3 లక్షలపౌన్లు (45 లక్షల రూపాయలు) ఖరీదు చేసే వెండి బంగారాలు తీసుకువచ్చాడు, తన నావికులకు తానుచేసిన వాగ్దానాలను తు.చ. తప్పకుండా పాలించడంవల్లను, అయినప్పటికీ ఈ ధనాన్వేషణ యాత్రకు అనేక విధాలుగా సహాయం చేసిన పెట్టుబడిదార్లకు చెందదగిన భాగం న్యాయంగా వారికి ముట్టచెప్పడం వల్లను అతడి సత్యసంధత, ఋజుత్వము, లక్ష్యాతీతమైనవి. ఈ సౌశీల్యానికి ఫలితంగా తీరా చివరికి, పదహార్లువేలపౌన్లు

ఖరీదు చేసే వెండి బంగారాలు మాత్రమే అతనికి మిగిలినవి. ఈ సౌశీల్య ప్రదర్శనకు ప్రశంసా చిహ్నంగా అల్బెమార్లీ ప్రభువు అతని భార్యకు వేయిపౌనులు ఖరీదు చేసే సువర్ణ కలశాన్ని బహుమానంగా ఇచ్చాడు...

ఈ విధంగా, తమజాతికి విశేష ధనాన్ని సంపాదించు కొని రావడానికి సాహసోపేతమైన కృషి చేసినందుకు చక్రవర్తి అతనిని "సర్" బిరుదంతో సత్కరించాడు. ఐశ్వర్యాన్వేషకుడైన వీరుడు అని మనం అతణ్ణి అభివర్ణించే యెడల ఆ విశేషణ మతనికి ఉచితమైనదిగానే కనిపించవచ్చు. అయితే, ఆయన చిరస్మరణీయుడు అవడానికి ముఖ్యకారణం ఆయన సత్యసంధత కనుక, 'సత్యసంధుడైన వీరుడు' అనడం ఇంకా ఉచితమేమో! ఏమైనా-అతడు, కల్మల జల మెరుగని స్వచ్ఛమైన జీవనది వంటివాడు; భగవత్ప్రేరణ వల్ల ఘనుడైన జాతీయ మహావీరుడు.

